శ్రీ

శ్రీగురుపరబ్రహ్మణేనమః

శ్రీకార్తవీర్యార్జునేనమః




# సకలసజ్జనానంద సద్గుణసాగరము

ఇయ్యది

సంకీర్తన మనోరంజితం బగునట్లు

మలుగూరు

పాలపర్తి. శ్రీనివాసశాస్త్రులవారి పుత్రుడగు,

వేంకటాద్రిశాస్త్రులచే

రచియింపబడి

పండితులచే పరిశోధితమై

శేషగూరు. సం. కృష్ణశాస్త్రులవారి సహాయముచే


మొదటి కూర్పు 2,000.

చెన్నపట్టణం.

సువార్త ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను.

1914










| | | | |
|---|---|---|---|
| ... | 17 | వైధ్యము | వైధవ్యము |
| ... | 23 | చేపి | చేపి |
| 48 | 1 | చెపించి | చేపించి |
| ... | 22 | చెపించ | చేపించ |
| 50 | 22 | ప్రశ్నెషు | ప్రశ్నేషు |
| 52 | 11 | పునిలుక్య | షునిలుక్య |
| ... | 25 | వుత్తరో త్తర | వుత్తరో త్తర |
| 54 | 18 | ర[illegible] | రజో |
| 55 | 24 | పరస్పరవిరో | పరస్పరవిరోధ |
| 57 | 10 | వైవాశకమందు | వైవాహికమందు |
| 58 | 25 | దోషాహావము | దోషావహము |
| 59 | 20 | ద్పష్టాతములం | దృష్టాంతములం |
| 61 | 6 | ఋతుమతియైస | ఋతుమతియైన |
| 62 | 1 | బాల్యపయస్సున | బాల్యవయస్సున |
| ... | 9 | మెదలిడుచున్నారు | మొదలిడుచున్నారు |
| 65 | 9 | అవాహా | అహావా |
| 72 | 26 | యుూలాగు | యీలాగు |
| 77 | 23 | బార్యయందు | భార్యయందు |
| 80 | 25 | రావణు | రావణుని |
| 83 | 17 | మూడుజాబులం | మూడుబాబులం |
| 90 | 7 | చరితంతవ | చరితంతపః |
| 93 | 10 | మూర్చ | మూర్ఛ |
| 97 | 25 | దిట్టవేశకసర | దిట్టవేశసర |
| 98 | 7 | యెట్టులపగు | యెట్టులవగు |
| 99 | 10 | డి. | డి. |
| 99 | 11 | అన్నహారము | అన్నాహారము |
| 100 | 8 | కుచస్త్రీరతియు | కులస్త్రీరతియు |
| ... | 14 | ప్రాశినాడని | ప్రాశినాడని |
| ... | 22 | యమాధర్మము | మూధర్మము |
| 101 | 5 | పొడుగానుండి | పొడుగుగానుండి |
| ... | 23 | సమీపించను | సమీపించను |

# విషయసూచిక.



శ్రీరాములు.

# సకల సజ్జనానంద సద్గుణసాగరము.

శ్లోకము॥ శ్రీరామంజనకాత్మజాకుచతటీ। శ్రీగంధపంకోల్లస।
ద్వక్షోవీధిముదారమాశ్రితముని ప్రాగ్మర్త్యవత్కల్పకం।
బ్రహ్మేశానముఖామరస్తుతమజం బ్రంహాండభాండాధిపం।
వందేనలకన్యకానుతమహం వారాశిగర్వాపహం॥

ఒం బ్రహ్మణేనమః॥

## (మనుష్యజన్మ).

శ్రీవిరాట్పురుషుడగు నారాయణుండు ప్రతియుగంబున దుష్టజన శిక్షణ శిష్టజన పరిపాలనార్థమై జననంబెత్తుట ఎల్లరకును దెల్లమె. వైకుంఠవాసుడగు దేవాదిదేవుండు జన్మములలో ఉత్తమంబగు మానుష జన్మంబునందే మహాసాహసకార్యములఁ జేసియున్నాడు.

మానుషజన్మముతో సమానమైన జన్మము లేదని ఎట్టి అసాధ్య కార్యములనైనను అవలీలగా సాధింపవచ్చునని జన్మములలో ఉత్తమంబైన ఈమానుష జన్మమే శ్రేష్టమైనదనియు, దేవత్వముచే రంభాది సురకామినులయందు సౌఖ్యమునొంది యాపుణ్యము సమసినమీద పునః అధోగతిని పొందుదురనిన్నీ సమస్త పురాణములయందు జూచుటన్బట్టి మానవత్వమే మోక్షము నపేక్షించువారలకు ముఖ్యకారణము గదా. గోదాన,భూదాన హిరణ్యదాన అన్నదాన,అహింసాది సమస్తములగు పుణ్యకర్మలచే దేవత్వమును సాధింపవచ్చును. ఈశ్రేష్ఠమైన జన్మ

ములోపుల తనకుదేవుఁడు యిచ్చునంతలో బ్రాహ్మణులకు బ్రాహ్మణేతరు లైనప్పటికిని గుడ్డివాండ్లకును, కుంటివాండ్లకును, చాలాబీదవాండ్లుకును, మూగివాండ్లే మొదలుగాఁగల పాత్రాపాత్ర వివేచనచేశి సత్పాత్రమును చూచి దానముచేయవలయును. ఇట్టిపాత్రాపాత్ర వివేచన మార్గము దెలశి దానము చాయకుండుటన్నట్టి.

శ్లో॥ అదానదోషేణ భవేద్దరిద్రో దారిద్ర్యదోషేణ కరోతిపాపం।
పాపాతవశ్యంనరకంప్రయాతి పునర్దరిద్రో పునరేవపాపి।

## (దారిద్ర్యదుఃఖం.)

మరియొక జన్మమునకు దరిద్రుడై పుట్టును. దరిద్రదోషముచే జీవహింసచేయుడము అబద్ధములు బల్కుడంపసుల వెుక్క మనస్సు నొప్పించడం పరులసొమ్ము నపహరించడం, తప్పుసాక్ష్యము చప్పడం, ఈ మొదలుగాఁగలిగిన పాపకార్యములుచేశి దేహావసానమందు మహారవరవాది నరక మనుభవించి పూర్వజన్మ సంస్కారఫలముచేతపునః నరజన్మమెత్తి నట్లైన దరిద్రుడై పుట్టును. మరియు పైవివరించిన పాపకార్యముల జేయును. ఈలాగు పూర్ధ్వాధోలోకములలో పుట్టుట గిట్టుటయందు ఎడతెగనివారలై మహాకష్టముల ననుభవించుచున్నారు. ఇట్టి మహా పాపమైన దరిద్రము ననుభవించు పురుషునకు తల్లితండ్రులు. భార్యయు బిడ్డలు మిత్రులు బంధువులు సర్వులూశత్రువులుగా దోచుచుందురు. అట్టి దరిద్రపిశాచము పురుషునియందు ఆవరించిన.

శ్లో॥ దారిద్ర్యాద్ధ్రియమేతి హ్రీపరిగతః సత్వాత్పరిభ్రశ్యతే।
నిస్సత్వఃపరిభూయతే పరిభవాన్నిర్వేదమాపద్యతే।
నిర్విణ్ణశ్శుచమేతిశోకనిహతో బుధ్యాపరిత్యజ్యతే।
నిర్బుద్ధిఃక్షయమేత్యహో నిధనతాసర్వాపదామాస్పదం॥

యెట్టిరూపవంతుణినైనను కమల్చివేసును. తనకు మిక్కిలి శత్రువునైనను నోరువిడచి అడుగున్నట్టుగా జేసును. బంధువులు మిత్రులుయొక్క గృహములకు వెళ్ళకుండా జేయును. సభలకు బోవు కుండకుండ జేయును. తానుకోరిన కోర్కెలను విఫలముగా జేయును. ఇట్టి మహాశ్రేష్ఠమైన జన్మములో యీలాటి దరిద్రపిశాచముచేజిక్కి కష్టమ నుభవించుట దుర్లభముగదా!

శ్లో॥ జంతూనాం నరజన్మదుర్లభం।

సమస్తమైన పిపీలికాది జంతుజన్మ లన్నిటిలో నరజన్మమతి దుర్ల భంబుగదా, యిట్టిజన్మలో దేవుడు శిక్ష చేయవలయునని దలంచితే దరి ద్రదేవతను అసన్నముగా జేయుటేచాలును అదియే భూలోక నరకం॥

ముందు వివరించియుండు దరిద్రావస్థ ననుభవించు జన్మములో వలనే తనకు దైవమిచ్చినంతలో దానధర్మ పరోపకారములజేయుచు,

శ్లో॥ మహతాపుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌస్త్వయ।
పారందుఃఖోదధేర్గంతుంతరయావన్నభిద్యతే॥

పుణ్యమనెడు గొప్పవెలబెట్టి యీదేహమను ఓడనుగొనిన నీవు అది నశింపక ముందే దుఃఖసాగరమును యీదిగట్టు చేరుము. యక్ష కిన్నరకింపురుష సురసిద్ధ సాధ్యనాగగరుడయక్ష పిశాచ యీజన్మముల వారికి మోక్ష మబ్బదు ఇన్ని జన్మములలో మోక్షము గైకొనుటకై వడవవంటి నరజన్మమే శ్రేష్ఠమైనది. దారిద్ర్యమనుభవించువాడైనను తనకు దైవమిచ్చినదానిలో దానముచేశినట్లైన మరివక జన్మమునకు పూర్వపుణ్యము రీతిగా ధనవంతుడై పుట్టుచున్నాడు. అప్పటిలో జ్ఞాన మువహించి,

శ్లో॥ దాతృత్వంప్రియవక్తృత్వం ధీరత్వముచితజ్ఞతా।
అభ్యాసేనసలభ్యంతే చత్వారిస్సహజాగుణాః॥

అనురీతిగా దానముచేయడము. ప్రియమైనమాటలు. ధైర్యము. వుచితమైన దానిని తెలియడము యివిజన్యగుణములని చెప్పుచున్నది గాన దానముచేయుటలో వకరి ప్రోత్సాహమునకులోబడి యిచ్చుట గాక తన జన్యగుణముగా దాతృత్వమును వుంచుకొని, దానము, పరో పకారము, అహింస, సమస్త ప్రాణులయందును దయగలిగి యుండుట ఇట్టివనుడు మరియొక జన్మమునకు మిక్కిలి ధనవంతుడై పుట్టుచున్నాడు అప్పటిలో,

శ్లో॥ అయశ్చణక చర్వణం ।
ఫణిఫణాన్మణేకర్షణం కరేణగిరితోలనం ।
జలనిధే పదోల్లంఘనం నిశితఖడ్గసంస్పర్శనం ।
భవేత్సుకృతనామిదం నకృపణేన ధనస్యార్జనం ॥

ఉక్కుశెనిగలను నమలవచ్చును సర్పముతలనుండు మణిని తివ్వ వచ్చును పర్వతమును అరచేతినివుంచుకొని తూకము చెప్పవచ్చును. సముద్రమును దాటవచ్చును. పదునైన కత్తిమీద చెయ్యివుంచి బలముగా రాకవచ్చును. ఇవి యోగ్యులయినను మహాత్ములైనను కృపణునిచే ధనము తివ్వడము చాలాకష్టమని జెప్పియున్నారు గాన ఇట్టి లుబ్ధత్వమునకు మనస్సుచొరనీక దానముచేయవలయును. ధనవంతుడైనవాడు దానముచేయకుండిన,

శ్లో॥ చత్వారోధనదాయాదాః ధర్మాగ్నినృపతస్కరాః ।
జ్యేష్ఠభ్రాత్రవమానేన త్రయఃకుప్యంతిసోదరాః ॥

ధనమునకు సానుగుణ్యమైన నలుగురన్నదమ్ములుగలరు. అందు లో జ్యేష్ఠభ్రాతయను ధర్మమునుయివ్వక అవమానించినట్లైన ముగ్గురగు తమ్ములు చాలావిసుకుజెంది, అగ్నిపడును, లేక రాజుపాలగును, లేక దొంగలు దోచెదరు, ఇది అనుభవసిద్ధము కాబట్టి ధనవంతుడైనవాడు.

దాన, ధర్మ, ధర్మోపసయన, కూప, తటాక, వన, అన్నఛత్రమే మొదలుగాగల పుణ్యకార్యములు జేయుచుండవలెను. అప్పటిలో ధనమువున్నదనే మదాంధత్వముచే, చెడుకార్యములు చేయక, వకరి మనస్సునొప్పించక, సర్వప్రాణులయందు దయకలిగి, వర్తించుచు, మదోన్మత్తుడై యుండక, స్త్రీలవల్లలో జిక్కక.

—: స్త్రీవిషయము, దూషణ. :—

శ్లో॥ వేధాద్వేధాభ్రమంచక్రే కాంతాసుకనకేషుచ
తాసుతేష్వప్యనాసక్తః సాక్షాద్భర్గోనరాకృతిః ॥

బ్రహ్మ రెంటియందు మనుష్యులకు చాలాప్రేమవుండు నట్టుగా కల్పనచేశెను స్త్రీలయందు, బంగారునందు, రెంటియందు యవ్వనికి మమతలేదో వాడు సాక్షాత్ కైలాసవాసుడగు శంకరుడే భూలోకములో అవతరించినాడని తెలియవలయును. గాన స్త్రీలయందు ఆసక్తిలేక అరిషడ్వర్గములను జయించినట్టి యోగిపుంగవుడే స్త్రీలవలలో జిక్కనివాడు అట్టి యోగపుంగవునికి.

శ్లో॥ స్త్రీసాన్నిధ్యంవిరక్తానాం సతాంమజ్ఞాన సన్నిధిః ।
మనఃక్షోభకరంతస్మాత్ తత్సాన్నిధ్యంవివర్జయేత్ ॥

విరక్తిమార్గము నవలంబించియుండు యోగులకు యవ్వనరూపవంతులగు స్త్రీలుదగ్గర చేరడము, సత్పురుషులైన వారలకు దుర్జనసహవాసము, మనుస్సుకు చాలావ్యాకులము కలుగచేయుచున్నది. కాబట్టి విరక్తి మార్గము నవలంబించియుండు వారలకు స్త్రీలు శత్రువులు, విరక్తేతర పురుషులుకు స్త్రీలు మిత్రులాఅంటె,

శ్లో॥ స్మితేనభావేనచలజ్జయాభిః పరాఙ్ముఖైరర్ధకటాక్షవీక్షణైః ।
వచోభిరీర్ష్యాకలహేనలీలయా సమస్తభావైః ఖలుబంధనస్త్రియః॥

చిరునవ్వు హావభావవిలాసము, శిగ్గుగానటించుట, మంచిలీల, కడకంటిచూపు, సుగుణము, చిలుకుపలుకులు, అసూయ, కలహము, వీట్లచే అష్టాదశ విధములగు, హావభావ విలాసములచేత యెట్టివిరక్తు లైనను వారివలలో జిక్కువేసుకొందురు. ఇప్పటిలో పురుషులు,

శ్లో॥ ప్రవృత్యేషుకిము త్తిమంమృగదృశః ప్రేమప్రసన్నంముఖం।
ఘ్రాతవ్యేష్వపికింతదాస్యపవనః శ్రావ్యేషుకింతద్వచః।
కింస్వాద్యేషుతదోష్టపల్లవరసః స్పృశ్యేషుకింతద్వపుః।
ధ్యేయఃకింనవయౌవనంసహృదయైః సర్వత్రతద్విభ్రమాః॥

అనురాగముతో యుక్తమై, చంద్రబింబముతో సమానమగు, స్త్రీముఖము సమస్తవస్తువులలో జూడదగుటకు యోగ్యమైనది, ముఖ మాఘ్రాణించతగినవానిలో వస్తువులలో ముఖ్యమైనది.

వ్యాఖ్యానం॥ నతుపునస్తథావినాఘ్రాః పద్మినీజాతి త్వాసిత్తిదాస్య గంధస్య, పద్మినీజాతి స్త్రీయొక్క ముఖముమంచి పరిమళముతో యుక్త ముగా నుండును. మదవతులయొక్క మృదుమధుర పదములే వ్యాదయ మునా నందించునవి. తొండపండునంటి పెదవియే రసములలో అమృ తముగా వుండునది. మృదువగు సువర్ణచ్ఛాయగల స్త్రీ శరీరమే తాకుటకు యోగ్యమైనది, మంచి యౌవనవంతురాలగు పువ్వుబో ణిని ధ్యానించుటయే ధ్యానములలో ఆనందమును బుట్టించునట్టి ధ్యాన ము, రసికులైన పురుషులకు స్త్రీలయొక్క యవ్వనమే లజ్జగలుగు జేయు నది. యీలాగు సర్వత్రా భ్రమించి రూపముగల సుందరీమణులతో సమానమైన వస్తువు జగత్తునందు లేదని భ్రమించి స్త్రీలవలలో జిక్కు బడుచుందురు.

శ్లో॥ వక్త్రంచంద్రవికాశిపంకజపరీ హాసతమేలోచనే!
వర్ణస్స్వర్ణమపాకరిష్ణురళినీజిష్ణుః కచానాంచయః।

వక్షోజావిభకుంభవిభ్రమహరా గుర్వీనితంబస్థలీ।
వాచాంహారిచమార్దవంయువతిషు స్వాభావికంమండనం॥

చంద్రునిఁబోలు ముఖమున్నూ, కమలమువంటి కన్నులున్నూ, బంగారుకాంతిగల దేహమున్నూ, తుమ్మెదలవంటి కొప్పున్నూ, యేనుగ కుంభములవంటి గొప్ప చన్నులున్నూ, గుండ్రమగు గొప్పపిరుదులున్నూ తేనెలొలుకు చిలుక పలుకులున్నూ, కలస్త్రీ.

శ్లో॥ కుంకుమపంకకళంకితదేహా గౌరపయోధర కంపితహారా।
నూపురహంసరణత్పదపద్మా కంనవశీకురుతే భువిరామా॥

కుంకుమ మొదలైన సుగంధ ద్రవ్యములచే అలంకరింపబడినట్టిన్ని వజ్రవైఢూర్య మాణిక్య మరకత గోమేధికంబులచే చెక్కబడిన కేయూరహారములు కుచకుంభములపై చలింపబడినట్టేన్ని, గజ్జలందెలచే ఘల్లుఘల్లుమనెడి శబ్దముచే యుక్తమైన హంసవలె నడకకలిగినట్టి స్త్రీరత్నము యవ్వనితానే మోహింపజేయదు, ఇట్లు మోహింపజేసినప్పటికిన్ని,

శ్లో॥ మధుతిష్టతి వాచియోషితాం హృదిహాలాహలమేవ కేవలం।
అతఏవనిపియ్యతేధరో హృదయంముష్టిభిరేవతాడ్యతే॥

తేనెలొలుకు పలుకులచే అధరమునందు మధువుండును, హృదయమునందు విషము పదిలముగనుండును. కాబట్టి అధరమును పానముచేయుదురు, హృదయమును పిడికిట బొదుతురు ఇందుకై, స్త్రీల హృదయమందు విషముండుననియు, స్త్రీలను నమ్మకూడదనియు పూర్వీకులైన పెద్దలు గ్రంథములందు చాలాచెప్పి యున్నారు.

శ్లో॥ ఔదుంబరాణిపుష్పాణి శ్వేతవర్ణంచవాయసం।
మత్స్యపాదంజలేపశ్యన్నారీహృదయం నవస్థితం॥

పత్తిపువ్వునైనా జూడవచ్చును, తెల్లకాకినైనా వెదకికన వచ్చును, చాపలజాడ నీళ్ళలో కనిపెట్టవచ్చును. స్త్రీలయొక్క హృదయమును కనిపెంచుట చాలా అసాధ్యంబుగదా.

తే॥ గీ॥ వకనితోఁగూడిభాషింతురొకనితోఁ కనుని ।
జూతురువిలాససంపదసొంపుగులుక ।
మరియునొక్కనిదలతురు మనసులోన ।
కూర్మిప్రియుడెవ్వడో ముద్దుగుమ్మలకును॥

వకనియందు మనస్సుచే మంచిమాటాడు చుందురు, మరివకని నిజూచుచుందురు, మనస్సున నొకని దలంచుచుందురు. కాబట్టి కురూపినైనను యంతనీచ జాతివానినైనను మనస్సున దలంచకయుండరు వారికి ప్రియుడైన పురుషుడెవ్వడో తెలియదు.

శ్లో॥ స్మృతాభవతితాపాయ దృష్ట్వాచోన్మాదకారిణీ ।
స్పృష్టాభవతిమోహాయ సానామదయితాకథం ॥

మనస్సునదలంచిన మాత్రముననే తాపమును, చూడడముచేతనే ఉన్మాదమును, ముట్టిన మాత్రముచేతనే వ్యామోహమును కలుగుచున్నది యిట్టివనిత దయిత యెట్లులాయె.

గీ॥ యంతలోనింతికన్నుల కెదుటనిలుచు ।
నంతలోనింపువాటించున మృతమట్లకాక ।
లోచనమార్గంబు కడచెనేని ।
గరళముకంటె ప్రాణసంకటము జేయు ॥

మనస్సునదలంచుచున్న స్త్రీకంటికి గనుబడిన మాత్రముననే, అమృతమును త్రావినట్లుండును, కనుమరుగా యనేనివిషమును దాగినదానికన్ననూ హెచ్చుగు ప్రాణసంకటము కల్గును.

ఆ॥ గీ॥ పడతియొక్క-దానిని విడిచియుంచుక।
యమృతంబులేదు, భువివిషంబులేదు।
అమృతలతనుబోలు సనురాగవతియైన।
గాకమెలెగెనేని గరళవల్లి॥

అబలతో సమాసమగు అమృతమూలేదు. విషమునూలేదు, పురుషునియందు స్త్రీ బద్ధానురాగయై యుంచిన అమృతప్రాయమే, లేక వికటముగా నుంచిన విషప్రాయము, స్త్రీపురుషుల వుభయమనుస్సులు గలసి మెలశియుంచి వుభయులకు మరివేరే అమృతము గావలెనా లేక, చాలాదినములు వకరిని వకరు విడువక ;అనురాగము కలవారలై యుండి కొన్నిదినంబులుకు వికటమువకరియందు గనుబడినదానితో సమాసమగు విషము వేరేత్రాగవలెనా అదియేచాలును యిట్టి పియ్యూషవిషముచేయుకర్తలగు స్త్రీలనుచూచి.

శ్లో॥ విశ్వామిత్రపరాశరప్రభృతయో ర్వాతాంబుపర్ణాశనా।
స్తేపి స్త్రీముఖపంకజం సులలితం దృష్ట్వైవమోహంగతాః।
శాల్యన్నంసఘృతం పయోదధియుతం యేభుంజతే మానవాః
తేషామింద్రియనిగ్రహోయదిభవేద్వింధ్యస్తరేత్సాగరే॥

ఆకులలములు వాయువే ఆహారముగాకలిగిన విశ్వామిత్ర పరాశరులు మొదలగు ఋషిశ్రేష్ఠులందరూ యవ్వనవంతులగు స్త్రీలను చూచిన మాత్రమునసే. తపస్సును విడనాడి. వారియొక్క- వలలోదగిల యున్నారు. యిట్టిమహాపురుషులే స్త్రీలవలలోజిక్కి-నపుడు. నెయ్యి పెరుగు పాలు మొదలుగాగల వీర్యవృద్ధి పదార్థము భుజించు మనుజులకు యట్లతానే కామోద్రేకము కలుగకయుండును అట్లు కామోద్రేకంబు కలుగకయుండిన వింధ్యపర్వతము సముద్రంబున దేలియాడదా. ఆకులలములు భక్షించుకొనియుండు మహాపురుషులే. స్త్రీల

వలలో జిక్కుచున్నాను యికశాల్యాన్నము పాలు నెయ్యి భక్షించు మనుజులు స్త్రీలచేజిక్కుట హాస్యాస్పదమాయనా, పురుషులు స్త్రీల వలలో జిక్కకయుండను. వింధ్యపరంతెంబు సముద్రంబున దేలియాడ దుగాన.

తే॥ గీ॥ తథ్యమువచింతు పక్షపాతమునుగాదు।
నిఖిల జగములయందిదినిక్కువంబు।
తొయ్యలులకన్న రమ్యవస్తువులు లేవు।
వారలేకష్టముల కెల్ల కారణములు.
స్త్రీలతో సమానమైన రమ్యవస్తువ యీపృథ్వియందులేదు
యీవస్తువకొరకై సమస్తకష్టములకు కాటపట్టై.

చ. తెలియకనాశహేతువగు. తీవ్రతరానలకీలలోపలన్।
శలభముజొచ్చుగాక మరిచాలకమీనముగాలపుఁగొనన్।
గలపిశితంబుదామెసగగాక యెరింగియు ... దోహలవనితాసుఖంబు
విషనాశము మోహము తత్వమెట్టిదో.

నాశహేతువై జ్వాలలచే వెలుంగు అగ్నిలోబడి మిడతనశించు మాట్కి.. గాలముకొనను. దు మాంసముదినుటకై వచ్చి గాలముకొనకు జిక్కుమీనముమాట్కిం జనులు స్త్రీలవలలోజిక్కినశింతురు, యీలాగు నశింతుమనే సంగతిదెలశి దెలశి స్త్రీలను విషనాశమేమోహమనే తత్వ మెట్టిదో. దెలయుటకు అసాధ్యంబుగదా.

వృ॥ పురగముము ట్టినాసకులకుర్విని వైద్యులుధర్మశీలురై।
గరళము నెక్కుడింతురధికంబుగ నాయతమేచకోత్పల।
స్ఫురణవహించివక్రగతిబూనిన మానినిమాపుసోకినన్।
పురుషునకెందుమంత్రములనుపొందవుపొందనువైద్యులెవ్వరున్,

పాముకరచి విషమెక్కిన మనుజులకు లోకములో వైద్యులు విషమును దీసివేసి బ్రతికింతురు. కొనకంటిచేచూచిన తరుణీమణి చూపు సోకిన మాత్రముననే మోహమను విషమెక్కు. తెలివిమాలయున్న వారలకు మందులుపని చెయ్యవు వైద్యులు సహాయేమియును జేయ జాలరుగాన కామముచే పరితపించు రోగులకు ఔషధములేదు హేసో దరులారా. పురుషులేనా కామముకలవారలు స్త్రీలు కామముకల వారు కారా. అనిన శరణాగత రక్షావ్రత దీక్షితులా హావధీసులనిబే కొరిదియుండు ధర్మజ భీమార్జున నకుల సహదేవులయొక్క ధర్మపత్ని యైన పరమ పతివ్రతాశిరోమణియగు ద్రౌపతియే వచించి యున్నది.

శ్లో॥ సుందరంపురుషందృష్ట్వా భ్రాతరంపితరంసుతం।
మోనిర్ద్రవంతి నారీణాం తథ్యంమే బ్రూహి కేశవ.

సుందర వంతుడగు పురుషుని చూచినమాత్రముననే అతడు అన్న, తండ్రి, కొమారుడు అయినా స్త్రీలకు వీర్యపై మనస్సు వికల్ప మొందుననీన్ని.

శ్లో॥ పంచమేపతయస్సంతి మహ్యాంషష్ఠోపిరోచతే
పురుషాణామభావేన సర్వనార్యఃపతివ్రతా ॥

నాకు అయిదుమంది భర్తలుండినప్పటికిన్ని, అరవవాని యందు నామనస్సు పోవుచున్నది, ఏవురు పతులుండునాకే యీలాగు కోర్కె వుండుటచేబట్టి లోకమందు వకవనితకు నొకభర్తయుండు కారణంవల్ల యింకయేలాగు బుద్ధియుండునో యోచించుడి అన్నట్లు పురుషాభావ ముచే స్త్రీలు పతివ్రతలుకాని మనశ్శుద్ధిచే పతివ్రతలేదని భావన. పురుషులు కొందరికి యీవిషయమందు అగౌరవమనే కారణముచేత నో, లేక భీతిచేతనో, సిగ్గుచేతనో, ధనములేని కారణంవల్లనో, పురుషాభావముగా వగిదిగాని పురుషులందు యీభావము లావరింత

బడి సప్పటిలో. పతివ్రతలు లేరు యిదిగాక స్త్రీలు మహామదాంధులు, పురుషునికన్నను హెచ్చైన కామము కలవారలు లజ్జలేనివారలు పరపురుషులయందు వారికి యిష్టము వుంచినప్పటికిన్ని తమయిష్టము ను బయలుపరచక గంభీరముగా నుండువారలు పురుషునికి కొన్నివేళ లయందు అవమానమును గలుగచేయువారలు. పురుషుడు అన్నిదే శములలో మిత్రత్వమును సంపాదించి వుంటున్నాడు అట్టి మిత్రులు యింటికి వచ్చినప్పటిలో. తనపతిని జరిజరజూచి నేను వంటచేయను కావలశివస్తే నీవేజేశిపెట్టుము నీకుకావలశిన వారందరూవస్తే యిక్కడ చేశేవాండ్లు యున్నారు అని బిగ్గరముగా వేసుకొని పరుండేది అప్ప టిలో యీపురుషుడు స్నేహితులు వినరో యేమోయను శం కచే భార్యతో మెల్లగా యిట్లనుచున్నాడట, నాదేవుడా, నాధనమా, నాభాగ్యమా, యీదినమున్న గడ్డకువేయి మాటంపోగొట్టవద్దు యిక మీద యెవ్వరిని యింటికి రానివ్వను. యీదినం మాత్రమున్న కాపాడ వలయునని స్నేహితులు వినకుండా భార్యను బంగిపోయి అవ్వూట స్నేహితులను వుంచుకొని పంపుచున్నాడట, పునహా స్నేహితులు వస్తారనే సంగతి తెలసి పెండ్లము కాటానికోస్కరమై ఆ దినమం తియూ గ్రామములో వుండవట యిక యెవ్వరైనను పరస్థళము వాండ్లు గ్రామానికి వచ్చినారను సంగతి తెలిశి మధ్యాహ్నంవేళ అవల వెళ్ళడట అక్కడికి,పరస్థళమువాండ్లు బలవంతముపైన యింటికివచ్చినట్టై న వాండ్లను సత్కరించి మాటాడడట (యందుకనగా) పెండ్లము భీతి కోస్కరమై. యీలాగు జరిగిజరిగి అన్నదానమనేది లోకములో మొద లంట నాశమైనది. కాబట్టి, మానమువచ్చి నా స్త్రీలచేతనే, అవమాన మయినా స్త్రీలచేతనే. అవమానముదెచ్చు స్త్రీలు 100 భాగములలో 99 భాగములు గలరు మానముదెచ్చు స్త్రీలు 100 భాగములలో 1 భాగము బా స్త్రీగా లేదు కాబట్టి ఓ ప్రియస్నేహితులారా. స్త్రీలు, మహా

నీచులు, మహాఘోరవరాది పాపములన్ జేయువారలు, పురుషుడు యెంత వుదారిమైనను వాని వుదారమును బోగొట్టివానికి పాపహేతు సమ్మంధమగు కార్యములొడగట్ట దలంచునట్లుగా జేయువారలు, యిప్పుడు మన అనుభవసిద్ధములో జూడగా, 3 మంది మగవాండ్లు అన్నదమ్ములు వకయింటియందు వుంట్నున్నారు, జ్యేష్ఠుని భార్యయింటికి వచ్చిన పతికి మర్యోభదలుజేసి వేరేతీయును (లేక) 2-వ వాని భార్యయింటికివచ్చు వరకు అటు ఇటువుండి మూడవవానికి వివాహము కాకమునుపే వేరే బోవుడు ముందునునే వేరేబోక ముగ్గురికి లగ్నములయి మగురాడు వారు వకయింటిలో కలసిన ముగ్గురికీ యీర్ష్యములుబుట్టి కలహము లకు కారణమై.

కం॥ వకతెకుజగములు వణకును ।
అగణితముగయిద్ధమైన అంబుధులొణుకున్ ।
ముగురాడువారుగూడిన ।
సుగుణాకరపట్టపగలు చుక్కలురాలున్ ॥

అని చెప్పివున్నది. ఆడివారుకలశిన యిండ్లే విభాగములు కావలశివుంటు, యిందులో ఆడుదానిమాట యెవ్వడు వినుచున్నాడో వాడుశుద్ధ పనికిరానివాడు, వానికి చేటుకద్దు, వానికిధర్మము నశించి పాపము చేకూడును.

శ్లో॥ ఆత్మబుద్ధిసుఖంచైవ గురుబుద్ధిర్విశేషతః ।
పరబుద్ధిర్వినాశాయ స్త్రీబుద్ధిః ప్రళయాంతకః ॥

అని చెప్పివున్నది గాన స్త్రీప్రాజాపత్యం బలముగావుండే గృహములలో జాడుడి స్వతంత్రముగా స్త్రీలను హద్దులోబెట్టుక యుండువాని ఇంటిలోచూడండి యెంతోరమ్యముగా నుండును, గాన హే మిత్రులారా స్త్రీలుయుండు కూడనికి రానివానినియు, మానంమర్యా

దలేని వారనియు ముందే జెప్పియున్నాను, గాన వార్లను యావద్విష యము లోనునమ్మక నమ్మినను దగ్గరచేర్చక, దగ్గరచేర్చిననూ వాండ్ల ప్రాజాపత్యము జరుగనివ్వక మీగౌరవమును మీయశాపాడు కొనండి.

శ్లో॥ దర్శనాచ్చిత్తవై కల్యం స్పర్శేనాత్మధనక్షయం!
సంభోగాత్కిల్బిషంపాపం స్త్రీణాంప్రత్యక్షరాక్షసం ॥

అని జెప్పియున్నదిగాన వీండ్లు ప్రత్యక్షరాక్షసులు వీర్ల విషయం లో యంతదూషించిననూ చాలదు॥

శ్లో॥ స్త్రీపుంవచ్చ ప్రభవతి యదాతద్ధిగేహంవినష్టం॥
పురుషునివలె స్త్రీ యవ్వనిగేహమందు వర్తించునో యాగృ హము జాగ్రతగా నాశనమగును.

శ్లో॥ అనాయకావినశ్యంతిన శ్యంతిశిశునాయకాః।
స్త్రీనాయకావినశ్యంతి నశ్యంతిబహునాయకాః॥

నాయకుడు లేనియిల్లుచెడును పసిపిల్లకాయ నాయకుడుగాగల యిల్లుచెడును స్త్రీలునాయకులుగాగల యిల్లుచెడును పదుగురునాయకు లుగాగల యిల్లుచెడునని జెప్పియున్నదిగాన, ముఖ్యాంశం, వీండ్లను నమ్మి మోసపోకండి, బాల్యాదిగా భయముగా బట్టుకరాండి, చీటికిమాటకి కొట్లాడి పలచన కావలదండి, వాండ్లు చేతికి బట్టి యిచ్చిన విషమెంచుకో వడము యీ జన్మములో కాదు స్త్రీలను విషవృమని నేను జెప్పను. వాం డ్లుపొందవద్దని నేనుజెప్పను, చాలాహెచ్చరిక కలిగి వర్తించుడని చెప్పు చున్నాను.

## పిండోత్పత్తి లక్షణము.

ధనమువున్నను ముందుజెప్పన రీతిగావర్తించక విశేషముగ, దా నముచేయడముచే మరివక జన్మమునకు రాజైబుట్ట వచ్చును అప్పటిలో యజ్ఞయాగాదిక్రతువులు మోదొపేతచేతచేసి స్వాదిస్సాన్నిధ్యమునొం

మాట ముఖ్యాంశము, అట్లు మోక్షాపేక్షచేత జేయక కేవల స్వర్గసుఖా పేక్షచేత చేసినట్లైన ,,శ్రుతిః,, జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత,, జ్యోతిష్టోమాది యజ్ఞములచే స్వర్గమును పొందుచున్నాడు.

కం॥ క్రతువులు మొదలగు సత్క్రియలతిభక్తిని।
నాచరించియంత్యంబున సద్గతికరిగియతు।
లితసుఖమనుభవించి పుణ్యమరగినమీఁదన్ ॥

స్వర్గమందు రంభాసంభోగమే మొదలుగాగల సౌఖ్యముల ననుభవించుటే కాని శాశ్వతబ్రహ్మానంద పదవిదొరకదు.

శ్లో॥ క్షీణేపుణ్యేమర్త్యలోకే విశంతి।

అచ్చట సుఖము ననుభవించి పుణ్యావసానమందు పునహామను ష్య లోకమును బొందుచున్నాడు. మనుష్యలోకమును బొందుమార్గం బెట్లనిన) పంచభూతికమైన దేహంబు వేరు అందు నివసించియుండు పురు షుడు వేరుఅందు చెప్పినరీతిగా స్వర్గమందు సుఖమనుభవించి యాతే జస్సు చంద్రమండలము చేరి హిమబిందువుతో జతగలసి భూమిపైబడి సస్యమైధాన్యముగా మారిపురుషుని గర్భము చేరి స్త్రీపురుష సంయోగ కాలమందు యోనియందు రేతమైజారి గర్భమునిల్చును. గర్భమందు నిలచినపిండమే పంచభూతాత్మకమైన శరీరమనన్బడు.

సీ॥ పాంచభూతికమైనభవనంబు దేహంబుపురుషుండుపీనిలోబూర్వకర్మ।
వశమునవర్తించుదీపించుదరిరైన నొకవేళదలగిపోవు।
జడమేనిదేహంబుజడుగాని జడదాతనికినింతచేటులేదు।
పురుషునికినిదేహపుంజంబునకు వేరుగానియేకత్వంబుగానరాదు।
దారువులవెలుంగుదహనునికైవడి గాయములజరించుగాలిభంగి।
నాశలీనమైననభముచాట్పున వేరుదెలియవలయుదేహిదేహములకు॥

పృథ్వి. అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశమనే పంచభూతము లతో యుక్తమైన శరీరములో, పురుషుడనగా, ప్రాణిపూర్వకర్మానుగుణ్యముగా ప్రవేశించును. దేహివేరు, దేహమువేరు, దేహియైన ప్రాణికి యీదేహము బడిపోవునదేశంక తోచినేని.

శ్లో॥ వాసాంసిజీర్ణానియథావిహాయ నవానిగృహ్ణాతినరోపరాణి।
తథాశరీరాణివిహాయజీర్ణా న్యన్యానిసంయాతినవానిదేహీ॥

నరుడు ప్రాతబట్టలను పారివేసి క్రొత్తబట్టలను ధరించుమాదిరిగా, ముసలిదైన ఈదేహమును విడిచి క్రొత్తదగు శరీరములో ప్రాణిప్రవేశించును. ఈలాగుపుట్టుట గిట్టుటయందు ఎడతెగనివాడే పురుషుడనంబడును. స్త్రీపురుషుడు,

॥ స్త్రీపురుషసంయోగాచ్చ, మాతృపితృసంయోగాచ్చ, కథమిదం శరీరం।

అనుశ్రుతి ప్రామాణ్యమురీతిగా నురుమువివరించిన రీతి మాతృగర్భమందు జనింపబడమగును.

గర్భము నిల్చుటకు ముఖ్యకారణములు.

శ్లో॥ ప్రథమేహనిచాండాలీ ద్వితీయ్యాం బ్రహ్మఘాతకీ।
తృతీయేరజకీప్రోక్తా చతుర్థేహనిశుధ్యతి।
చతుర్థేహనిశుద్ధిస్యాత్ పతిసంయోగకర్మణి।
పంచమేహనిశుద్ధిస్యాత్ హవ్యకవ్యాదికర్మసు॥

అనువదవ రీతిగా ఋతువైన నాల్గవదినమందు పురుషసంయోగము లేకుండుట సృష్టిపరికి ధర్మలోపమనిన్నీ, బ్రహ్మహత్యాది పాపములతో సమానమగు పాపమనిన్నీ, ఇదియునుగాక పతిసంయోగము చాతనే ఐదవదినమునకు హవ్యకవ్య కర్మలకుగాను నాల్గవదినమందు శుద్ధియగుననియూ, ఋతుస్నానదినము స్త్రీలకు కామము యెక్కువని

యూ, నాల్గవదినము మొదలు తొమ్మిదిదినములలోపల గర్భమునిల్చునని కొందరి వైద్యశాస్త్రిజ్ఞుల మతముగలదు పంతొమ్మిది దినములలోపల గర్భమునిల్చునని కొందరి వైద్యశాస్త్రిజ్ఞుల మతము, ఐనను ఋతుస్నాన దినము మొదలు తొమ్మిదిదినములలోపులనే గర్భమునిల్చునుగానిపిమ్మట నిల్వదని, నాయభిప్రాయము.

## గర్భిణిస్త్రీవుండవలసిన విధానము.

స్త్రీగర్భము ధరించియుండు సమయమందు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను వర్జింపవలయు, ఒకరిచే కొట్లాడకూడదు, చెడ్డవస్తువులను ముట్టకూడదు. క్రోధముచే కడుపులోనుండు బిడ్డవల్లే క్రోధముకలది యగును. లోభముచే లోభగుణము కలదియగును. వివాదమువలన వల్లే బిడ్డకు మొండిగుణము కలుగును. శత్రువులను చూచుటవల్ల అసూయకలది యగుచున్నది. తనకు యిష్టము లేని పదార్థముతాకుటవల్ల వ్యాకులమైనదియగును. దుఃఖోత్పాదన వస్తువులను దినినవల్లే దుఃఖముగలదియగును. గర్భముసందుండు బిడ్డ జన్మించినవంతరం యీబిడ్డ యేవిద్యను అభ్యసించవలనని తల్లితండ్రులకు యిచ్ఛవుండునో గర్భముదాల్చినది మొదలు స్త్రీ ఆవిద్యయందు కాలక్షేపము చేయవలయును. గర్భిణి స్త్రీ, ఎల్లప్పుడు మనస్సు ఉత్సాహముగా శ్రేసుకొనియుండవలయును. తెల్లనిబట్టలేగట్టవలెను. దేహము శుభ్రముగా నుంచవలెను. భయమైనవస్తువులను జూడరాదు. భయపడుమాటలు వినరాదు. మరియొక గర్భిణీస్త్రీ ప్రసవసమయమును జూడరాదు చచ్చినశవము చెంతకుపోరాదు. పరుండుమంచము యెత్తుగాను తగ్గుగాను నుండక సాధారణముగా నుండవలెను. పుష్టికరమైన యాహారమును భుజింపవలయును. గర్భిణీస్త్రీయొక్క మనస్సున కోర్కెపూర్ణము కాకపోయెనేని వల్లే బిడ్డ అపూర్ణావయవములు కలదియ

గును. గుఱ్ఱము, ఏనుగు, బండి, మొదలగు వాహనములనెక్కరాదు. కసరత్తుచేయుట, నీళ్ళలోనీదుట. జాగ్రతగాపారాడుట, కారమైనట్టి, ఉష్ణమైనట్టి, పదార్థములు దినుట, పగటినిద్ర, రాత్రి మేల్కొనియుండుట యివన్నియూ గర్భిణీస్త్రీ విడువవలయును. గర్భమునిలచినమీద పురుషునిచెంత పరుండరాదు, పతితో సంభోగించిన దుర్బలమగు బిడ్డ పుట్టును. ఇంతమాత్రమేకాక, గర్భము చెదరిపోయినను పోవచ్చును. లేక, స్త్రీయొక్క మర్మస్థానమందు అనేకరోగము లుద్భవించి లోపల శిశుదేహము శిథిలమై పుట్టినబిడ్డ తక్షణమే చనిపోయినను పోవచ్చును. గర్భమునిలిచిన వెనుక పురుషుడు స్త్రీసంభోగము మాని యుండవలెను. అది సాధ్యముకాదేని ఐదవ నెలనుంచినైనను ప్రతి[illegible]ంపవలెను. తొమ్మిదవనెల యిందుచుకొందు భయోత్పాతమైన మాటపలుకరాదు. అటు విని పుట్టుబిడ్డ గర్భములోనే చనిపోవును. వేరొకవేళబుట్టిన తక్షణమేచని పోవును. ఒకవేళ బ్రతికియున్న చిన్నవయస్సునందే చనిపోవును. భాగ్యవశమున జీవించిన [illegible]ము, [illegible]లత్వము, [illegible]గుణము, కలదియగును. దేహారోగ్యము లేనికాలమందు సంభోగము మానవలెను. అట్లుమానక గర్భమునిల్పి ప్రసవించిన బిడ్డకు క్షయరోగమైనను, తల్లి తండ్రులే రోగముచే బీడింపబడుచుందురో ఆరోగము బిడ్డకు వ్యాపించును. గర్భమునిల్పిన పిమ్మట పురుషుడు స్త్రీతో బలమైనరతిని విను నియమముల నెక్కువగారతి చేయరాదు. అట్లుచేసిన గర్భముచెదరిపోవును. గాన, యీ విషయములు స్త్రీలు గమనించి ప్రవర్తించవలెను.

ముందుచెప్పిన స్త్రీపురుష సంయోగానంతరం గర్భమునిల్చిన,

శ్రుతి॥ పంచరాత్రాత్పేశీ, సప్తరాత్రాద్బుద్బుదః, పంచవింశతిరాత్రాత్ స్వస్తితో భవతి, మాసమాత్రాత్ కఠినో భవతి, మాసద్వితీయే సగ్రీవాప్యాబధ్యతే, మాసతృతీయేన్వవత్వగ్వ్యాదేశః చతుర్థే మాసినఖరోమవ్యాదేశః, పంచమేమాసిముఖనాశికాక్షిశ్రోత్రం

చ సంపద్యతే, షష్ఠేజీవప్రదర్శనం, సప్తమేచలనసమర్థో౽భవతి, అష్టమేబుధ్యాద్యవశ్యతి, నవమేసర్వాంగసంపూర్ణో౽భవతి.

ఏమదినములకు వక వస్తువువలెనూ, ఏడురాత్రులకు బుగ్గవలెనూ, ఇరవై ఏను దినములకు వృకువైన మాంసము పిండముగను, వక నెలకు కఠినముగను, అయి రెండవనెలకు గొంతుమొనగనుపడి, మూడవ మాసమునకు చర్మముచే ఆవరింపబడి, నాల్గవ మాసమునకు గోళ్లు వెంట్రుకలు మొలచి, ఏదవ మాసమునకు ముఖము, ముక్కు, కండ్లు, చెవులు మొలచి ఆరవ మాసమునకు పూర్వకర్మాను గుణ్యముచే ముందుచెప్పియుండు రీతిగా పంచభూతాత్మకమైన శరీరము ఆరవ మాసమునకు యేర్పడియుండునుగా. పురుషుడకు ప్రాణి అందులో ప్రవేశించి ఏడవ మాసమునకు గర్భములోచలన సమర్థతను వహించి ఎనిమిదవ మాసమునందు జన్మాంతర కర్మను స్మరణజేయును.

"మృతశ్చాహం పునర్జాతః, జాతశ్చాహం పునర్మృతః, నానా యోనిసహస్రాణి, మయోషితానియాన్వై, ఆహారావివిధా భుక్తా, పీతానానావిధా స్తనాః, మాతరోవివిధాదృష్టాః, పితరస్సుహృదస్తథా, అవాఙ్ముఖఃపీడ్యమానః, జంతుశ్చైవ సమన్వితః,"

సాంఖ్యయోగసమభ్యర్చ్య పురుషంవాపంచవింశతిమితి.

జచ్చియున్నాను, బుట్టియున్నాను, అనేక సహస్రయోనుల యందుద్భవించియున్నాను. నానావిధజాతులయందు స్తన్యపానమును జేశి అనేకవిధములైన ఆహారములను భుజించి అనేకులగు తల్లులనుజూచి అటేరీతిగా తండ్రులను, భ్రాతృవులను, బాంధువులను, స్నేహితులను, జూచియున్నాను. ఈగర్భనరకములోబడి అనేకములగు క్రిమిజంతువులచే పీడింపబడువాడుగానున్నాను. అని యీలాగు స్మరించుచు మాతృభుక్తాన్నసారంబులు తన నూత్నరంధ్రంబుల బరిగ్రహించుచు, శతజన్మ

ప్పిక్రింద బడి గర్భములో (డ్రాగుచుండు అమృతమును గురించి క్వా, క్వా, క్వా, అని అరచును (క్వాఅనుట,) ఎక్కడ, ఎక్కడ, ఎక్కడ, అమృతమెక్కడ యని అరచుచు జన్మాంత్రి యజ్ఞానమునాశనమై బాల క్రీడసల్పుచు బాలారిష్టాది దోషములచే పీడింపబడినవాడై పునహాజ చ్చుచు బుట్టుచు, బాలారిష్టాది దోషములే నప్పటికిని బునహాజచ్చి బుట్టుచు,

శ్లో॥ లగ్నాధిపోవాజీవోవా శుక్రోవాయదికేంద్రగః ।
తస్యపుత్రస్యదీర్ఘాయుః ధనవాన్రాజవల్లభః ॥

అను జ్యోతిశ్శాస్త్రరీత్యాలగ్నాధి పతియైనను బృహస్పతియైనను శుక్రుడైనను కేంద్రముల యందుండగా ఉచ్ఛగ్రహములు బలవత్తములై యుండగా, పూర్ణాయుర్యోగమున ననుభవించుచూ ధనవంతుడై యుండునప్పటికిని, న్యాయముగా ద్రవ్యార్జనచేసి వచ్చిన అతిథిఅభ్యాగతులకు అన్నదానముచేయుచూ, పెద్దలగువారలు తనయింటికి వచ్చినప్పటికిని, సత్కరించుచు,

శ్లో॥ నందంతిపితరస్సర్వే నృత్యంతిచపితామహాః ।
ప్రపితామహాశ్చగాయంతే శ్రోత్రియేగృహమాగతే ॥

తెలిసిన పెద్దలు యింటికి వచ్చినప్పటిలో, పితృవులు మహాఆనందముచే తాతగారు నాట్యముచే, ముత్తాతగారు సంగీతముచే నోలలాడుచున్నారు. అభ్యాలగువారలు, ఇంటికివచ్చిన మాత్రమునసే, మనపితృవులు. యీలాగు సంతోషించినట్లైనా, అన్నదానముచే, ఇక యెంత ఫలముండునో యోచించవలెను.

శ్లో॥ నవిప్రపాదోదకకర్దమాని నవేదశాస్త్రధ్వనిగుంభితాని ।
స్వాహాస్వధాకారవివర్జితాని శ్మశానతుల్యానిగృహాణితాని ।

బ్రాహ్మణపాద ప్రక్షాళనచే, బురదకాని, గృహము వేదపురాణములుద్ఘోషించని గృహము, స్వాహాసుధాయనెడు, ఔపాసనాది కర్మలేనిగృహము, ఇవియన్నియు, స్మశానతుల్యములని, చెప్పంబడియున్నదిగాన.

శ్లో॥ నాన్నోదకసమందానం నద్వాదశ్యాఃపరంవ్రతం ।
నగాయత్ర్యాఃపరంమంత్రం నమాతుఃపరదైవతా ॥

అన్నదానములో సమానమైన దానములేదనియు, ద్వాదశివ్రతములో సమానమైన, వ్రతములేదనియు, గాయత్రీ మంత్రముతో సమానమగు, మంత్రములేదనియు, తల్లితో సమానుడైన, దేవతలేడనియు, చెప్పియున్నదిగాన. ముందువివరించిన, పుణ్యకర్మలనే చేయుచూ పాపకర్మకు మనస్సుచొరనీక, మంచికర్మ నాచరించవలసినది, కర్మచాతనే, సమస్తము అనుభవించుట, కర్మచాతనే, సృష్టిస్థితిలయములకు కారణము.

॥కర్మను గురించి.॥

శ్లో॥ నహ్యతిక్రృతంకర్మ, నదాపంచేంద్రియైరిహ ।

ఏమఇంద్రియములచే, చేసినకర్మ, ఎప్పటికిని నశింపదని, భారత ప్రమాణము, కలదు నరుడు, మనోవాక్కాయములచే చేయుకర్మ శాశ్వతముగానుండి చేసినవాని వెంటనంటి జననమరణమునే, కలుగజేయుచున్నది.

శ్లో॥ యథాధేనుసహస్రేషు వత్సోవిందతిమాతరం ।
తథాపూర్వకృతంకర్మ కర్తారమనుగచ్ఛతి ॥

వెయ్యి ఆవులమధ్య, దూడలు, తమతమ తల్లులనెట్లు గనుగొనుచున్నవో, అట్లనే, పూర్వజన్మమున చేసినకర్మ చేసినవానినే మరలజన్మమెత్తినప్పుడు, పొందుచున్నదని, శ్రీ మహాభారత ప్రమాణము కలదుగాన.

శ్లో॥ యస్మాచ్చ యేనచ యథాచయదాచ ।
యచ్చయావచ్చయత్రచ శుభాశుభ ।
మాత్మకర్మతస్మాచ్చతే నచతథాచతవాచ ।
తచ్చతావచ్చతత్రచవిధాత్మ వశా స్త్రైతి ॥

మనుజుడు, యేకారణమువల్ల, ఏ యుపకరణముచేత, ఏవిధముగా ఏకాలమునందు, ఏకార్యమును, ఏస్థలములో జేయునో, అట్టి కార్యము యొక్క శుభాశుభఫలమును, ఆకారణమువల్ల, అదే ఉపకరణముచేత, అదేవిధముగా, అదే కాలమునందు, అదేస్థలములో, ఆవిధమైన, కర్మ, విధివశముగా, పొందును.

శ్లో॥ సుశీఘ్రమపిధావన్తం, విధానమను ధావతి ।
శేతేసహశయానేన, యేనయే యథాకృతం ॥
పాపంతిష్ఠతితిష్ఠన్తం, ధావన్తమను ధావతి ।
కరోతికుర్వతఃకర్మ, ఛాయ యనుగామివిశేయతే

శ్లో॥ యేనయే యథాయద్య, పురాకర్మ సునిశ్చితం ।
తత్రదేవా స్తదంభుంక్తే, నిత్యంవిహితమాత్మనా ।
అచోద్యమానాన్యాపి, యథాపుష్పాణిఫలానిచ ।
స్వంకాలంనాతివర్తంతే, తథాకర్మపురాకృతం ।

శ్లో॥ బాల్యేయువావావృద్ధశ్చ, యత్కరోతి, శుభాశుభం ।
తస్యాంతస్యామవస్థాయాం, భుంక్తేజన్మనిజన్మని ।
యేనయేశరీరేణ, యద్యత్కర్మ, కరోతియః ।
తేనతేనశరీరేణ, తత్తత్ఫల, ముపాశ్నుతే ।

పూర్వకర్మపరుగెత్తువానితో పరుగెత్తునూ పరుండినవానితో పరుండును యువనిచే, యట్లచేయబడినదో అట్లనే పొందుచున్నది, పాపకర్మ నిలువబడినవానితో నిలుచుచున్నది, పనిచేయువానితో

పనిచేయుచు, నీడవలే, వెంటనంటి యంటున్నది. యువకావసు, యేదేది. ముందువెనుక కర్మ జేయునో దానిని ముందువెనుక అనుభవించును, పుష్పములు ఫలములు ప్రేరేపింపవలకనే, యేరీతిని తమకాల మతిక్ర మించక. పుష్పించి. ఫలించుచున్న వో అరీతిని, పూర్వమునచేసిన కర్మ తనకాలమును అతిక్రమింపదు, బాలునిగాని, యవ్వనపురుషునిగాని, యేయేవయస్సునందు, శుభాశుభములను జేయునో, ఆయావయస్సు లందు, తనిం ఫలము అనుభవించును, పై ప్రమాణములను అనుసరించి, సకలమునూ, సంచిత కర్మానుసారముగానే, జన్మజన్మములకు, సర్వదా ప్రాప్తించుచున్నదని, స్పష్టముగా. (సంచితమనగా కూడబెట్టినది) మాస వదేహ మెత్తినప్పటినుండి. మొదలిడుచున్నదని సూచింపబడుచున్నది.

శ్లో॥ నమస్యామోదేవా, న్ననుహత, విధిస్తే, వివశగా ।
విధిర్వంద్యస్సోపి, ప్రతినియతకర్మైకఫలదః ।
ఫలంకర్మాయత్తం, యదికిమమరైః ।
నమస్తత్కర్మభ్యో, విధిరపినయేభ్యఃప్రభవతి ॥

దేవతలకు నమస్కారము జేయుచున్నాము. అటువంటి దేవత లు ఆచర్చిన వాడగు, బ్రంహదేవునకు లోబడి, సంచరించుచున్నారు, గనుక ఆదేవతనువదలి. బ్రంహదేవునకు. నమస్కారముచేయుటమూ, మరియు ఆబ్రహ్మదేవుడుకూడా, కర్మానుసారమైన ఫలమునే కలుగజేయు నుగాని. అధికముగా, తక్కువగా, కలుగజేయదు, కాబట్టి వాస్తవ ముగా, కర్మయే. ఫలమును గలుగజేయునది. ఇతరులైన దేవతలతో యేమిప్రయోజనము, బ్రంహచే, నేమిప్రయోజనము ఉండదూ, గానా అందరినివదలి, సత్కర్మయే, ముఖ్యముగా యొనరించవలయు.

శ్లో॥ బ్రంహాయేనకులాలవన్నియమితో బ్రంహాండభాండోదరే ।
విష్ణుర్యేనదశావతారగహనే క్షిప్తోమహాసంకటే ।

రుద్రో యేనకపాలపాణి పుటకే భిక్షాటనం సేవతే ।
సూర్యోభ్రామ్యతి నిత్యమేవగగనే తస్మైనమః కర్మణే ॥

కర్మచేత బ్రంహాదేవుడు, బ్రహ్మాండభాండములయొక్క, మధ్య యందు, సమ్మరవానివలె నియమింపబడియున్నాడు. కర్మబాధచే విష్ణు దేవుడు కూడా, అధికదుఃఖములను, కలుగజేయునట్టి దశావతారముల నియెడు, గహనములందు ప్రవేశపెట్టబడెను, కర్మపాశముచే, పరమ శివుడు, బ్రంహాకపాలము హస్తమునందు బెట్టుకొని భిక్షాటనమును జేసె ను. సర్వప్రాణారక్షకుడగు దినమణికూడా, తనయొక్క కర్మబాధచే య డతెగని గమనముగలవాడై, సంచరించుచున్నాడు. గాన యిట్టివారే, కర్మచే పీడింపబడినపుడు, మనముపూర్వకర్మచే దిక్కుటయసాధ్యమా, సత్కర్మ మన్ములను, సజ్జనులుగా జేయుచున్నది. మూర్ఖులను పండితులనుగా జేయుచున్నది, శత్రువులనుకూడా మిత్రులుగా జేయుచు న్నది. దూరముగానున్నదానిని దగ్గరగా జేయుచున్నది, విషమును అ మృతముగా జేయుచున్నది. యీలాగు అష్టైశ్వర్యసంపదను కలుగజే యునట్టిదియగు సత్కర్మ కోరినఫలము అనుభవించుట కొరకు, పాటు పడవలయును.

శ్లో॥ నహికశ్చిత్క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతేహ్యవశఃకర్మ సర్వఃప్రకృతిజైర్గుణైః ॥

పురుషుడు క్షణమైనను, కర్మజేయక నుండడు సర్వజనులు, ప్రకృతిలోబుట్టిన, గుణముచేత, స్వాధీనములేనివారై, కర్మను చేయుచు న్నారు.

శ్లో॥ కర్మబ్రంహోద్భవంవిద్ధి బ్రంహాక్షరసముద్భవం ।
తస్మాత్సర్వగతంబ్రంహ నిత్యంయజ్ఞేప్రతిష్ఠితం ॥

కర్మ వేదమువల్ల బుట్టినదిగా తెలియుము. ఆవేదము, పరమాత్మ వల్ల పుట్టినది, సర్వవ్యాపియైన పరమాత్మ యిజ్ఞమునందు, యల్లప్పుడు, ప్రతిష్ఠితమై యున్నది.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చమానవః।
ఆత్మన్యేవచసంతుష్ట, స్తస్యకార్యంనవిద్యతే॥

యెవ్వడైతే ఆత్మయందు రతిగలిగినవాడో ఆత్మయందు తృప్తి బొందినవాడో, ఆత్మయందు సంతోషించువాడో, అట్టివానికి కర్మతో టి పనిలేదూ,

క॥ సుప్తింజెందకనగవక ప్రాప్త బహుశేశమైనపదినేలనుచుశా।
తృప్తింపొందనిమనుజుడు సప్తద్వీపములనైన జక్కగబనునె

అని చెప్పయున్నది. రజోగుణమునందు బుట్టిన యీకామము, తృప్తిలేనిది, యీక్రోధము పాపభూతమైనది. యీరెంటిని శత్రువులు గా నెరుగవలయును. అని యీరీతిగా, శ్రీ కృష్ణుల వారు, అర్జునునకు, ఉపదేశించినారు.

శ్లో॥ మజ్జత్వంభసియాతుమేరుశిఖరం శత్రోన్జయత్వాహవే।
వాణిజ్యంకృషిసేవనాది సకలంవిద్యాఃకలాశిక్షతు।
ఆకాశంవిపులంప్రయాతు భగత్కృత్వాప్రయత్నంపరం।
నాభావ్యంభవతీహకర్మవశతో భావ్యస్యనాశఃకుతః॥

ఉదకమునందు మునిగినను, మేరుపర్వతము మీదెక్కిపోయినను, యుద్ధమునందు శత్రువులను జయించినను, వర్తకవిద్య, కృషి విద్య మొదలుగాగల మరియు, నితరములగు, అరవైనాలుగు విద్యలన భ్యసించినను, అధికమైన ప్రయత్నము చేసి, పక్షివలె ఆకాశమునకు య గిరిపోయినను, కర్మవశమున గాదగినదే యగునుగాని గాదగనిదియేది

యునూ గానేరదు, కాబట్టి హే సోదరులారా, వాడు యీలాగు దుర్మార్గకార్యములను జేయుచున్నాడు. ఈలాగుజారత్వమును, జేయుచున్నాడు. యీలాగు పశులకు హింసజేయుచున్నాడు, సన్మార్గప్రవర్తనయందు ఆశను వదలినాడు, అని మనము, యితరులను, నిందించుచున్నాము, మనయందు నెరసులు యెన్నియైనాయుంటున్నవి. మనదప్పులు మనకు దెలియపురాదా, ఆలాగు నితరుల' నిందించుటచే, ప్రయోజనంబేమి, వారివారి పూర్వకర్మానుగుణ్యముగా, అన్ని దుష్కర్మలు, సంప్రాప్తమగునేగాని, పూర్వజన్మ కర్మలేనిది. యేవదీ మాయన్నింకానేరదు, కాబట్టి, వకడు యీలాగున్నాడు. అని మనము నిందించుటవల్ల మనము కర్మకు బద్ధులగుచున్నాము.

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥

జ్ఞానవంతులుకూడా, స్వకీయమైన జన్మాంతర కర్మవాసనకు దగినట్లు, ప్రవర్తించుచున్నారు సమస్తప్రాణులున్నూ వాటివాటి జన్మాంతరకర్మ వాసనలను బొందుచున్నవి. గనుక కర్మేంద్రియ నిగ్రహము వలన అగునది యేదియునులేదు. అని భగవద్గీతా వాక్యమున్నది సర్వలోకస్థ అనేపాశముచే, పీడింపబడు చున్నారము మనము నకరినిందించుటెట్లు.

శ్లో॥ బుద్ధిః కర్మానుసారిణీ ॥

అనురీత్యా కర్మానుగుణ్యముగా బుద్ధిపుట్టుచున్నది సకల అనుభవములు, తాము పూర్వముచేసిన కర్మతప్ప వేరుకాదు.

శ్లో॥ సర్వమేవేహహి సదా సంసారే రఘునందన ।
సంయక్ప్రయుక్తాత్సర్వేణ పౌరుషాత్సమవాప్యతే ॥

సంసారమందనగా జననమరణములను, యిచ్ఛలు యెల్లప్పటికీ, సర్వాంబునూ అందరికీ పురుషప్రయత్నముచేతనే, లభించుచున్నదని శ్రీ రాములవారికి వశిష్ఠులవారు ఉపదేశించినారు. పూర్వజన్మములందు చేసినకర్మయొక్క, అనుభవభాగమునకు ప్రారబ్ధమని. దైవమని ఉదాహరింపబడి యుండును. అందుకు అనేక ప్రమాణములు గలవు.

శ్లో॥ పూర్వజన్మకృతంకర్మ తద్దైవమితికథ్యతే ॥

అనగా పూర్వజన్మమందు చేసినకర్మ దైవము బడుచున్నదని మాత్స్యపురాణమునందు కూడా యిట్లనే చెప్పియున్నది.

శ్లో॥ స్వమేవకర్మదైవాఖ్యం విద్ధిదేహాంతరార్జితం ॥

యితర దేహములందుగాని, తానుకూడ బెట్టినకర్మ దైవమని పేరు వడబడినది. యీ కారణముబట్టి, ప్రారబ్ధము తాను చేసియున్న దేకాని, వేరుకాదు. ప్రారబ్ధానుసారముగా యిచ్ఛలుపుట్టుట మొదలైనవన్నియు కలిగేటందును గాని, కలగక పోదు.

ప్రారబ్ధమును గురించి.

శ్లో॥ నచాత్మకృతకర్మాణి యీశ్వరేణాపి శక్యతే ॥

ప్రారబ్ధానుసారముగా కలుగునిచ్ఛాదులను వారించుటకు యీశ్వరునకైనను నశక్యము, గీతాశాస్త్రమునందు అర్జునునకు యిదేయర్థము శ్రీ కృష్ణభగవానులు బోధించినారు.

శ్లో॥ సదృశంచేష్టతేస్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
ప్రకృతింయాంతిభూతాని నిగ్రహఃకింకరిష్యతి ॥

శాస్త్రములను చదివి అనేకవిషయముల జ్ఞానము కలవాడైననూ, సర్వభూతములు ప్రకృతిని (అనగా) స్వభావము ననుసరించి, చేష్టలన్నియూ చేయుచూ, నిగ్రహమెట్లు వహించును. యీస్వభావము

ప్రారబ్ధమునుబట్టి కలుగుచున్నదని తెలిశినయంశమే, (దీని ముఖ్యాభిప్రాయమేమన), యవరెంతవిద్యావంతులైననూ, స్వభావమగు ప్రారబ్ధము ననుసరించే. సమస్తకర్మలు, మనోవాక్కాయములచేత, జేయుచున్నారు, 'అట్లుచేయక నెట్లు నిగ్రహింతుస" ఇదియే సిద్ధాంతముగా నంగీకరించినప్పుడు జీవులెల్లప్పటికీ, చెడ్డచేయువారలు చెడ్డయేచేయుచు, మంచి చేయువారలు మంచిచేయుచుండవలసినట్లేర్పడి, జీవుసుమారుట కవకాశములేనట్లు, కనబడుచున్నది. యిది సిద్ధాంతముకాదని. ఈగీతాశాస్త్రమునందలి శ్లోకాంతరశ్లోకమే, వెల్లడిబడుచున్నది.

శ్లో॥ ఇంద్రియస్యేంద్రియస్యార్థే, రాగద్వేషౌవ్యవస్థితౌ।
తయోర్నవశమాగచ్ఛే, త్తౌహ్యస్య, పరిపంథినౌ॥

ఇంద్రియములు విషయములయందు, రాగద్వేషములు కలిగి యున్నవి గనుక ఓ ప్రియస్నేహితులారా, రాగద్వేషములకు వశ్యులుగాకుండునని ముఖ్యాభిప్రాయము. (అయితే) ఇచ్ఛాప్రారబ్ధము బాధించుచుండుసుగదా, ప్రారబ్ధదేవమునే, నొసటవ్రాలని విధియనియు, వాడుదురు.

శ్లో॥ జ్ఞానోదయాత్పురారబ్ధం, కర్మజ్ఞానాన్ననశ్యతే।
అదత్వాస్వఫలంలక్ష్యం, ముద్దిశ్యోత్సృష్టబాణవతు।
వ్యాఘ్రబుద్ధ్యావినిర్ముక్తో, బాణఃపశ్చాత్తుగోమతౌ।
నతిష్ఠతిభినత్త్యేవా, లక్ష్యంవేగేననిర్భరం।
ప్రారబ్ధంబలవత్తరం, ఖలువిదాం, భోగేనతస్యక్షయః।
సమ్యఙ్జ్ఞాన, హుతాశనేనవిలయః, ప్రాక్సంచితాగామినాం॥

గురిపెట్టి విడిచినబాణము, యేరీతి, అగురినితగులుచున్నదో, అరీతినే, ప్రారబ్ధకర్మ తనఫలమునివ్వకపోదు, జ్ఞానోదయమైనతోడనే నశిం, పదు. పులియనుకొని, గురిపెట్టిబాణము విడచినపిదప, పులికాదు. ఆవు

అని తెలిసినపుడు, విడచినబాణము వెనుక తిరుగక. గురిపెట్టిన వస్తువును. ఎట్లు, నీల్చుచున్నదో, అట్లనే ప్రారబ్ధము. కర్మనుయిచ్చి తీరును యెన్నివిధముల యోచించినను, ప్రారబ్ధమనుభవింపవలసనే. యేర్పడుచున్నది. (కొందరిమతమదీనికి ) విరుద్ధముగానుండును.)

శ్లో॥ వివేకీజాగ్రతిసతి, దోషదర్శనలక్షణే।
కథమారబ్ధకర్మాపి, భోగేచ్ఛాజనయిష్యతి ॥

మనుష్యుడు విద్యావంతుడై, వివేకముకలిగి, మిక్కిలిజాగ్రతచే ఇదిదోషము, ఇదిగుణము, అని విమర్శచేయు శక్తివంతుడైనప్పుడు, ప్రారబ్ధానుసారముగా యిచ్చయట్లు కలుగును. మనుష్యుడు, శాస్త్రాది జ్ఞానబలముచే, మంచి చెడ్డలు తెలియుటయందుజాగరూకుడై యుండినపుడు వానికి ప్రారబ్ధానుసారముగా. సంకల్పములు ఎట్లు పుట్టుచున్నవి. యీప్రశ్నకు సమాధానము, యీక్రిందిశ్లోకముచే, తేటబడుచున్నది,

శ్లో॥ ఇచ్ఛానిచ్ఛాపరేచ్ఛాచ, ప్రారబ్ధః, త్రివిధంస్మృతం ।

ఇచ్ఛాప్రారబ్ధము, అనిచ్ఛాప్రారబ్ధము పరేచ్ఛా ప్రారబ్ధమని మూడుభాగములుగా. విభజింపబడినది. (యిచ్ఛాప్రారబ్ధమనగా) పూర్వజన్మానుసరణి నరునికి కోరి కలుబుట్టుట. (అనిచ్ఛాప్రారబ్ధమనగా) మనుష్యుడు తనకు ప్రాప్తమగు కార్యమునుగురించి యేలాటి సంకల్పముగాని. యేలాటి ప్రయత్నముగానిచేయకగా సుఖదుఃఖముల ననుభవించుట,(పరేచ్ఛా ప్రారబ్ధమనగా) ఇతరులసాంగత్యముచే, సుఖదుఃఖానుభవము, కలుగుట. కొందరు యంతచదువరులైనను. దుష్టకార్యములు చేయువలననెడు కోరికగలవారుగానుందురు. కొందరు మూఢులుగానుండినను. పెద్దతలంపులు తలంచక పెద్దకార్యములు చేయుచుందురు, ఇదిలోకమునందు, అందరి అనుభవములోనే ఉన్నది. చదువరులైనను. పెద్దతలంపు కొంద

కి పుట్టుటయందుకు. చదువరులు కాకపోయినను. అట్టితలంపులు పుట్టకుందుటెందుకు. యీవిధమున, వారికిఆలాటి తలంపులు. గలుగుట ప్రారబ్ధబలముతప్ప వేరుగాదు శ్రీకృష్ణులువారు, 8 వ అధ్యాయమందు ఈవిషయము గురించి, అర్జునకు. బాగుగా తేటపరచియున్నారు.

"శ్లో॥ అంత్యకాలేచమామేవా, స్మరన్ముక్త్వాకళేబరం।
యఃప్రయాతిసమద్భావం, యాతినాస్త్యత్రసంశయః॥"

మరణకాలమందు. నన్నే దలంచుచు,యవ్వడు శరీరమును విడుచుచున్నాడో, వాడు నన్నేపొందుచున్నాడు, యీవిషయమందు, సంశయమించుకయును లేదు.

"శ్లో॥ యంయంవాపిస్మరంభావం, త్యజంత్యంతేకళేబరం।
తంతమేవేతి కౌంతేయా సదాతద్భావభావితః॥"

జీవితకాలమందు, యీలోకములో, యల్లప్పటికి యెట్టి తలంపులు తలచుచుందురో, దేహమువిడుచు సమయమందు ఆతలంపులే, స్మరణకు విశేషముగా వచ్చును. వాటిని స్మరించుచు. దేహము విడిచినవానికి. ఆతలంపులు నెరవేర్చుకొనుటకు, తగినదేహములు, సందర్భములు మొదలగునవి కలుగును.

శ్లో॥ తస్మాత్సర్వేషుకాలేషు మామనుస్మరయుధ్యచ॥

అందుచే, నేనే, అవసానకాలమందు, స్మరణకురావలెనని యపేక్షయున్నయెడల, సర్వదానన్ను స్మరింపుము, అనుకృష్ణులవారుక్త ప్రకారము, నరుడు, దేహపాటవము తప్పకుండునప్పుడు. యేకోరికలను, సర్వదాగాని, బహుకాలముగాని, స్మరించుచున్నాడో. వాని మరణకాలమందును. ఆకోరికలే, విశేషముగా స్మరణకువచ్చి దివరకు ఆకోరికలనే తలంచుచు దేహము విడుచుచున్నాడనియు. ఆదేహము విడచిన తర్వాత మరియు యీలోకములో జన్మించినపుడు, తాను పూర్వజన్మమున,

తలంచుచుండిన కోరికలనే, కోరుటకును, ఆకోరికలు నెరవేర్చుకొనుట కును, తగినదేహము, యితరసందర్భములు, కలుగుచున్నవని, విశదమగుచున్నది. యీ జన్మమందు. నరునకు కలుగు కోరికలన్నియు, వెనుకటిజన్మకోరిక లనుసరించే, యుంటున్నావనుట. స్పష్టము, దీనినే యిచ్ఛాప్రారబ్ధమని చెప్పుదురు.

శ్లో॥ అపథ్యసేవినశ్చోరాః పరదారరతాఅపి।
జానంత్యేవ స్వానర్థా ఇచ్ఛాప్రారబ్ధకర్మతః ॥

రోగికి అపథ్యము చెడ్డదని తెలునును, దొంగకు దొంగతనము చెడ్డదని తెలునును, వ్యభిచారికి పరదారాగమనము చెడ్డదని తెలుసును, యివిచెడ్డవని తెలసితెలసి ఆకార్యములు చేయుటచే కలుగు దుష్ఫలములు, కష్టములు, దుఃఖములు, నిందలు, అవమానములు, చివరకు ప్రాణహత్యయు, బాగుగ గోచరముగుచుండినను, అట్టికార్యము ఇచ్ఛయించు వారినిన్ని, మరియుయిచ్ఛను అనుసరించి, కార్యములుచేయు వారిని, మనమంతటను జూచుచున్నాము. చెడ్డవని తెలశియు వాటిని యిచ్ఛయించుటే, యిచ్ఛాప్రారబ్ధము.

శ్లో॥ కర్మణాబాధ్యబుద్ధిర్నబుధ్యా కర్మబాధ్యతే।
సుబుద్ధిరపియద్రామో హైమంహరిణమన్వగాత్ ॥

కర్మచేత బుద్ధిబాధించబడును. బుద్ధిచే కర్మబాధించబడదు, రాముడుమంచి బుద్ధికలవాడైనను బంగారపు లేడివెంటబడెను గాన హే భ్రాతృవులారా మన యత్నమేదియును లేదు అందరూ పూర్వజన్మకర్మచే జిక్కినాము (జిక్కినను) జ్ఞానమువహించి వర్తించవలెను.

## జ్ఞానమార్గమును గురించి.

శ్లో॥ క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి సర్వక్షేత్రేషుభారత।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానమతంమతం

ఓయీ అర్జునా, సర్వక్షేత్రములయందుండు క్షేత్రజ్ఞుడు, నేనే యని తెలిసికొనుము. ఈ క్షేత్రమునున్ను, తదంతర్గతమైన క్షేత్రజ్ఞునిన్ని, విభజించి తెలియుట, యెద్దియో, అదియే జ్ఞానమని చెప్పబడును

శ్లో॥ జన్మకర్మచమేదివ్య మేవంయోవేత్తితత్వతః।
త్యక్త్వాదేహంపునర్జన్మ నైతిమామేతిసోఽర్జునా ॥

ఓయీ అర్జున యెవ్వడైతే నాదివ్యజన్మమును కర్మను, యథార్థముగా, తెలుసుకొనుచున్నాడో దేహమును చాలించినపిదప, పేరజన్మమును పొందక, నన్నే పొందుచున్నాడు.

శ్లో॥ వీతరాగభయక్రోధా మన్మయామాముపాశ్రితాః।
బహవోజ్ఞానతపసా పూతామద్భావమాగతాః ॥

కామమును, క్రోధమును, భయమును, వదలిపెట్టినవారై, నాస్వరూపులైనన్ను ఆశ్రయించిన మహానుభావులు, జ్ఞానయోగముచే తపరిశుద్ధులై, నాస్వరూపమును బొందినారు.

శ్లో॥ కాంక్షంతఃకర్మణాంసిద్ధిం యజంతయిహదేవతాః।
క్షిప్రంహిమానుషేలోకే సిద్ధిర్భవతికర్మజా ॥

ఈ లోకమునందు మనుష్యులు ఫలాపేక్షచాత, దేవతలను పూజించుచున్నారు. ఈ మనుష్యలోకమునందు, కర్మఫలము, శీఘ్రముగ లభించుచున్నది.

శ్లో॥ యస్యసర్వేసమారంభాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుఃపండితంబుధాః ॥

యవనికర్మలయితే, కామసంకల్పములేనివో, యవనికర్మలు, జ్ఞానమనేఅగ్నిచేత దహరింపబడినవో అట్టివానిని, పండితుడని విద్వాంసులని, చెప్పుదురు.

శ్లో॥ శ్రేయాంద్రవ్యమయాద్యజ్ఞాతు జ్ఞానయజ్ఞపరంతప ।
సర్వాకర్మాఖిలంపార్ధా జ్ఞానేపరిసమాప్యతే ॥

ఓయీపార్థా ద్రవ్యసాధనసాధ్యమైన యజ్ఞమునకంటె, జ్ఞాన స్వరూపమైనయజ్ఞము, బహుశ్రేష్టము, సమస్తకర్మలు, బ్రంహజ్ఞానము నందు, లయించుచున్నవి.

శ్లో॥ తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేనసేవయా ।
వుపదేక్ష్యంతి తేజ్ఞానం జ్ఞానినస్తత్వదర్శినః ॥

యిట్టి బ్రహ్మజ్ఞానము తత్వవిదులైన జ్ఞాననిష్ఠులను ఆశ్రయించి వారికి శుశ్రూషలుచేసి, సాష్టాంగ నమస్కారములుచేసి ప్రార్థనచేసి తెలిసికొనుము, వారు వుపదేశమును చేయుదురు.

శ్లో॥ నహిజ్ఞానేనసదృశం పవిత్రమిహవిద్యతే ।
తత్స్వయంయోగసంసిద్ధః కాలేనాత్మనివిందతి ॥

ఈలోకమునం దజ్ఞానముకంటె, వేరేపావనమైనది లేదు, అజ్ఞా నమును. యోగసిద్ధుడు, కాలాను గుణ్యముగా, తానేతనయందు పొం దుచున్నాడు.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్ధదానశ్చ సంశయాత్మావినశ్యతి ।
నాయంలోకోస్తినపరో నసుఖంసంశయాత్మనః ॥

జ్ఞానములేనివాడు, సంశయాత్మ కలవాడున్ను, చెడిపోవును సం శయాత్మకునికి యిహలోక పరలోక సుఖములు కలుగవు.

శ్లో॥ మహాభూతన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవచ ।
ఇంద్రియాణిదశైకంచ పంచచేంద్రియగోచరాః ॥

పంచభూతములయిన పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకా శము,అహంకారము,బుద్ధి. మాయయు, జ్ఞానేంద్రియములయిన త్వక్కు,

చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములున్ను, కర్మేంద్రియములైన, వా
క్కు, పాద, పాణి, పాయు, ఉపస్థలున్ను, మనస్సున్ను, ఇంద్రియ
గోచరములగు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములైన, పంచతన్మాత్ర
లు, అంతూచేరి ఇవరవై నాలుగు తత్వములాయెను.

శ్లో॥ అమానిత్వమదంభిత్వ మహింసాక్షాంతిరార్జవం।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః॥

తన్ను తాను పొగడుకొనక యుండుట, తనధర్మమును తాను ప్రకాశము చేసుకొనకయుండుట, హింసజేయకయుండుట, యెట్టికష్టము సటస్థించినను ఓర్చుకొనియుండుట, కృత్రిమము లేకయుండుట క్షమ, గురుసేవ, బాహ్య, భ్యాంతరశుద్ధి, అచంచలము, మనోనిగ్రహము గలుగుట, ఇతర దేవతారాధనులయందు మనస్సుచెలించక నేనేగతియని నమ్మినాయందు గాఢమైన భక్తిచేయుట, జనరాహిత్యమగు స్థలవాసియగుట జనసమూహమునందు అనురాగము లేకయుండుట, ఆత్మజ్ఞానమునందు, నిత్యభావముగలుగుట, మోక్షప్రాప్తియందే, ప్రయోజన దృష్టియుంచుట, యివియన్నియు జ్ఞానమని పెద్దలు చెప్పుదురు. ఇతరములన్నియూ అజ్ఞానమని చెప్పబడునూ, అని శ్రీకృష్ణులవారు అర్జునునకు ఉపదేశించినారుగాన, ఇట్టి జ్ఞానమార్గమును దెలిసికొని అజ్ఞానములో జిక్కి నశించక, ఎట్టికార్యమునైనను, మనుష్యుడు తప్పక ప్రయత్నము చేయుచుండవలెనని, మనగ్రంథము లుద్ఘోషించుచున్నవి. మనవారందరూ యెప్పుడుచూచినను మంచికార్యములయందు ప్రయత్నము చాయక అదృష్టముండినట్లు, అగుచున్నదని పిచ్చిజ్ఞానమును వహించి చెప్పుచు సోమరులై, దుష్కార్యములయందు మాత్రము సకలయత్నములు జేయుచున్నారు. అప్పుడు అదృష్టమనరు, మరియు ఇది కలియుగము. కలియుగములో అధర్మప్రవాహము, అతివేగముగా

వృద్ధియగుననియూ, జనులందరూ ఆయుగ మహిమచే, అధర్మమందే ప్రేరేపింపబడిన వారలై, అందే వర్తించెదరని, మనపురాణము లందునూ స్మృతులందునూ. చెప్పబడియున్నది. అట్లు చెప్పడము. అవద్ధ మాయని అనేకులు తమ తమస్వకార్యముల యందుండక యట్టి యకృత్యము లయినను. చేయుచున్నారు. దీని నెట్టికర్మయనవలయునో దెలియదు అట్టివారికి ప్రమాణములెట్టివన (పరాశరః).

## న్యాయాన్యాయము

శ్లో॥ జితోధర్మోహ్యధర్మేణా, సత్యంచైవాస్పృతేనవా।
జితాశ్చోరైస్తురాజానః స్త్రీభిశ్చపురుషాఃకదా॥
సీదంతి చాగ్నిహోత్రాణి, గురుపూజాప్రణశ్యతి।
కుమార్యస్యప్రసూత్యంతే, తస్మిఁకలియుగే, సతే॥

కలియుగమునందు, అధర్మము ధర్మమును, అనృతము సత్యమును, దొంగలురాజులను, స్త్రీలు పురుషులను. జయించుచున్నారు. అగ్నిహోత్రములు, నాశమొందుచున్నవి. గురుపూజలేక పోవుచున్నది, స్త్రీలు కన్యావయసునందే. ప్రసవించుచున్నారు. (విష్ణుపురాణమందు.)

"బ్రంహసూత్రధారణమేవ, విప్రత్వహేతుః।
అనృతమేవ వ్యవహారజయహేతుః।
వృపభోగమెవదాంపత్యసంబంధహేతుః।
స్త్రీత్వమేవ ఉపభోగహేతుః, లింగధారణమేవ ఆశ్రమహేతుః॥

యజ్ఞోపవీతము వేసుకోవడము మాత్రముచేతనే, బ్రాహ్మణత్వమును, వ్యవహారమందలి, అనృతమే జయమునకు, కారణమును, దాంపత్యసంబంధమె దేహసుఖమును, స్త్రీజాతియై యుంటమాత్రమునన, ఉప

భోగమును. వివహధారణ మాత్రమున ఆశ్రమమును, కారణములగు నూ. యిప్పుడు యోచించిచూడ, పై ఉదహరించినరీత్యా, అన్ని యు జరుగుచున్నవనుట అందరికి అనుభవసిద్ధమె గదా, ధర్మిష్టు లను. యవరెన్నికకు దిచ్చుకొనుచున్నారు. న్యాయస్థలములందు యంతఅబద్ధము జెప్పినను ధనికులుగానుండిన మాత్రమునన్, వాని మాటలంగీకరింప 'వలెనని, వాదించుట లేదా, మనలో వాడుక న్యాయము, పంచాయతీ, అనుచున్నాము, న్యాయము దెలుసుకొని వర్తింపు పంచాయతిదారు డెవ్వడు. లోకములో న్యాయ ము మొదలంట నాశమైనది గదా, పంచాయతీ చేయుచున్నా ము వాదిప్రతువాదులు ఇద్దరుంటున్నారు కలశిన పంచాయతీదారులలో కొందరికి వాదిపైన యిష్టము. కొందరికి ప్రతివాది పైనయిష్టము. ఈ లాగు బలవంతులు యవరిపరముగా వుంటున్నారో వారిపరమే వ్యవహా రము జయమగును గదా. యిది యనుభవము స్త్రీలు పురుషులను జయించుచున్నారని చెప్పియున్నాను.

## రతి విషయము.

శ్లో॥ పద్మినీచిత్రినీచైవశంఖినీ హస్తినీతథా ।
శశోమృగో వృషోశ్వశ్చ స్త్రీపుంసోర్జాతిలక్షణం ॥

పద్మినియనియు, చిత్రనియనియు, శంఖినిఅనియు, హస్తిని యని యు, స్త్రీలు నాలుగువిధములు కలరు, కుందేలు, జింక, ఎద్దు, గుఱ్ఱ ము, సంజ్ఞగల పురుషులు నాలుగువిధములు కలరు.

## పద్మినీజాతి స్త్రీలక్షణం.

శ్లో॥ భవతికమల నేత్రానాశికాక్షుద్రరంధ్రా ।
అవిరళకుచయుగ్మా చారుకేశీకృశాంగీ ।
మృదువచనసుశీలా గీతవాద్యానురక్తా ।
సకలతనుసువేషా పద్మినీపద్మగంధా ॥

ప్రజరిమృదుసరీలం రాజహంసీవతన్వీ ।
త్రివళిలలితమధ్యా హంసరాణీనువేషా ।
మృదుశుచిలఘుభుంక్తె మానినీగాఢలజ్జా ।
ధవళకుసుమవాసో వల్లభాపద్మినీస్యాత్ ।

చూడుటకు అందమైన కన్నులున్నూ, సన్న నిరంధ్రములుగల ముక్కున్నూ, కమలనాళములోనుండు సన్నటిదారమైన జొనుపుటకు వీలు లేక యేకముగానుండు స్తనములున్నూ, మంచిమృదువైన వెంట్రుకలున్నూ, సన్నదైన శరీరమున్నూ చిలుకపలుకులు పలుకువంటి మాటలున్నూ, మంచి స్వభావమున్నూ, సంగీతమందు యిష్టమున్నూ పద్మమువలనే దేహవాసనయున్నూ మెల్లగా, విలాసముగా నడచునట్టిదియూ మూడగు మడతలచేత రమ్యమైన, నడుముకలదియును, తేలిక యాహారమును భుజించునట్టిదియును, బంగారుచాయ దేహముగల, స్త్రీని పద్మినీజాతియని చెప్పబడును.

## చిత్తినీజాతి లక్షణం.

శ్లో॥ భవతిరతిరసజ్ఞానాతి ఖర్వానదీర్ఘా ।
తిలకుసుమసునాసా స్నిగ్ధనీలోత్పలాక్షి ।
ఘనకఠినకుచాఢ్యా సుందరీబద్ధశీలా ।
సకలగుణసమేతా చిత్రినీచిత్రవక్త్రా ॥

నల్లకలువలబోలు నేత్రములున్నూ, నూలు పుష్పమువంటి నాసికమున్నూ, కఠినమైన కుచములున్నూ మంచిగుణమున్నూ, కల స్త్రీని చిత్తినీజాతిగా యెరుంగునది.

## శంఖినీజాతి స్త్రీలక్షణం.

శ్లో॥ దీర్ఘాతిదీర్ఘనయనావరసుందరీయకామోపభోగరసికాగుణనీలయుక్తా
రేఖాత్రయేణచవిభూషితకంఠదేశ సంభోగకేళిరశికాఖలశంఖినీస్యా ॥

పెద్దవగు కన్నులున్ను గొంతుయందు మూడురేఖలచే అలంక రింపబడినట్టియున్ను రతియందు నిపుణతయున్ను గలస్త్రీని, శంఖినీజా తిగా యెరుంగునది.

## హస్తినీజాతి లక్షణం.

శ్లో॥ స్థూలాధరాస్థూలనితంబ భాగాస్థూలాంగుళీస్థూలకుచాసుశీలా।
కామోత్సుకాగాఢరతిప్రియా యానితాంతభోక్త్రీకరిణీమతాసా॥

పెద్దపెదవి పెద్దకుచములు, గాఢరతియందు ఆసక్తిన్ని, విశేష ముగా భుజించడమున్ను, యిట్టిస్త్రీని హస్తినీజాతిగా యెరుంగునది.

శ్లో॥ శశకేపద్మినీ తుష్టచిత్రిణీరమతేమృగం।
వృషభేశంఖినీతుష్ట హస్తినీరమతేహయం॥

పద్మినిజాతిస్త్రీ, కుందేలుజాతి, పురుషునితోను. చిత్రినిజాతి స్త్రీ లేడిజాతి పురుషునితోను. శంఖినీజాతి స్త్రీ వృషభజాతి పురు షునితోను, హస్తినిజాతిస్త్రీ, తురుగజాతి పురుషునితోను. యీలా గున తృప్తిని తెందుదురు. 16 సంవత్సరముల వరవకు బాలయనియు, 30 సంవత్సరములవరకు యౌవనియనియు, 55 వరవకు ప్రౌఢయనియు పిమ్మట వృద్ధస్త్రీనిగా, తెలియతగును. మంచి మంచి ఫలములచే, బాల వశ్యురాలగుచున్నది. విశేషమైన రతియోగముచే. యవ్వనివశ్యురాల గుచున్నది ప్రేమచేత యిచ్చుటచాతను. ప్రౌఢవశ్యురాలగును. కొట్టు టచే, తిట్టుటచే, వృద్ధవశ్యురాలగుచున్నది.

## సురతసుఖసంధానము.

శ్లో॥ కేశంకరేణసంగృహ్యాదృఢంసంతాడయేద్భగంవదనేచుంబనంకృత్వా
భగంహస్తేనమర్దయేత్ కుచంకరేణసంమర్ద్యపీడయేదధరంగృహాం॥
" రమణంబద్మబంధేన, పద్మినీ, రతిమాదిసేతు "

వెంట్రుకలను హస్తముచే కొందటబట్టినవాడై భగమును ఎడమచేతితో తాడనముచేయుచు, క్రిందిపెదవిని చుంబనముచేసి, పునహ కుడిచేతిచే కుచములను మర్దనచేయుచు అధరమును మాటిమాటికి పుడికిచూచుచు పద్మబంధముచే నఖక్షత దంతక్షతములచే తృప్తిని. పొందించుచు కళాస్థానములను దెలసుకొని, పద్మినిజాతిస్త్రీని, రమింప జేయవలయును.

శ్లో॥ సీత్కారం చుంబనంపీడ గళేహస్తేన చుంబనం ।
కుచేకుచే స్తనేహస్తం చిత్తినీరతి మాదిసేత్ ॥

హాహాహూయను నాదముచే, క్రింద పెదవిని పానము, చేయుచు కంఠమందు చెయివుంచి, మాటిమాటికి హస్తములచే, స్తనములను మర్దించుచు, చిత్తినీ జాతిని రతి చేయవలయును.

శ్లో॥ స్త్రీపుంసయోస్తథా న్యోన్యం, భగేలింగేచచుంబనం।
రమణంతు తథాగాఢం శంఖినీ, రతిమాదిసేత్ ॥

స్త్రీపురుషులు ఉభయులు, అన్యోన్యముగా, భగచుంబనంపురుషున్ను, లింగచుంబనం స్త్రీయున్ను, చేయుచు, గాఢాలింగనముచే, శంఖినినిరమింప జేయవలయును.

శ్లో॥ కేశంకరేణ సంగృహ్యా, పదృశం గజబంధనం ।
భగంకరేణసంతాడ్య, హస్తినీరతిమాదిసేత్ ।

వెంట్రుకలుచేతబట్టి దృఢముగా గజబంధనమువేసి, హస్తముచేత భగమును తాడనముచేయుచు, నఖక్షత, దంతక్షతములను ఎక్కువగాచేయుచు, బంధనములను. ఎక్కువగాదెలసి, కళాస్థానములను, జాతులను. ఎరింగి, స్త్రీలను రమింపజేసిన, స్త్రీలకు ద్రవించును అప్పు, డట్లు పురుషులను స్త్రీలు జయింతురు. యీవిషయములు ఎక్కువగా దెలసి, స్త్రీని ద్రవింప, జేయకుండిన, స్వతస్సిద్ధముగా. స్త్రీలే, పురుషు

లను జయింతురు. హే ప్రియమిత్రులారా, యీవిషయములను చక్కగా గమనించి, స్త్రీలను, జయింతురని, ముఖ్యాభిప్రాయము.

శ్లో॥ అధరస్య మధురిమాణంకుచకాఠిన్యందృశోస్తైక్ష్ణ్యం।
కవితాయాంపరిపాకంహ్యనుభవరసికోవిజానాతి ॥

స్త్రీలయొక్క అధరముసందలి మధురమును, స్తనములయందలి కాఠిన్యమును, కనుగొనలయొక్క చురుకుదనమును, కవితయందలి పరిపాకమును అనుభవరసికుడె యెరుంగునుగాని యితరుడెరుంగడు.

(అయితే) కులస్త్రీలు రతికాలమందు. పురుషుని స్వేచ్ఛాను సారముగా. బాధనములు మొదలగువాట్లచే. వర్తించెదరా. (అంటే.)

శ్లో॥ ప్రాక్ప్రేమతిమనాగనాగతరసం, జాతాభిలాషంతత।
స్సవ్రీడంతదనుశ్లథోద్యమమ, ధప్రధ్వస్త, ధైర్యంపునః ॥
ప్రేమార్ద్రం స్పృహణీయ, నిర్భరరహః, క్రీడాప్రగల్భంతతో
నిస్సంగాంగవికర్షణాధికసుఖం రమ్యంకులస్త్రీరతం ॥

కులాంగనలు. మొదటముగ్ధత్వముచేత, అభిలాషలేనివారివలె. మెల్లమెల్లగా వద్దువద్దని చెప్పుదురు. పిమ్మట కొంచముగా కోర్కెకల వారివలె కనపడుదురు. అనంతరము, భర్తలు, చీరగంటు విప్పుటకు. ఉపక్రమించినప్పుడు, సిగ్గుకలవారగుదురు. పిమ్మట వద్దువద్దని చెప్పక, పూరకుండెదరు. మరియు, భర్తను అడ్డగించుటయందు. ధైర్యములేని వారలై, అంతకొంతసేపటికి. సంభోగౌత్సుక్య, సంతోషము. మిక్కిలి యెక్కువై. అతి మనోహరములగు. రతి ఉపరతినే కాంతక్రీడల నల్పు దురు.

(కోకోక్త శాస్త్రమునందు.)

శ్లో॥ హుంకృతస్తనితసీత్కృతోత్కృతం।
సాత్కృతశ్వసితకోదనాదికం।

ముంచపీడయగృహాణజీవయ గ్రాహిదాధిగిరి సీత్కృతందిమః।
తచ్చలావుకకపోతకోకిలాహంసకేకి సదృశై రుపక్రమైః।

శ్లో॥ ఉరసినిపతితానాం, ప్రస్తథమిల్లకానాం।
ముకుళితనయనానాం, కించిదున్మీలితానాం।
ఉపరిసురత. ఖేదస్విన్నగండస్థలానాం।
మధరమధువధూనాం భాగ్యవంతఃపిబంతి॥

పురుషునియొక్క తొడలపైన కూర్చొని. విడిగిపోయిన కొప్పు కలవారలై, కొంచముగా తెరవబడిన నేత్రములచే యుక్తులై, ఉపరతి నిచేయుటచే, కలిగిన ఆయాసముచేత. చమటతోగూడిన. గండస్థలములు గలవారగు స్త్రీలయొక్క, అధరామృతమును, మిగుల నదృష్టవంతు లగువారు, పానముచేయుదురుగాని. అదృష్టహీనులకు దొరకదు.

(మధురిష్మతి.)

యీశ్లోకము ముందునని చెప్పియున్నాను అయినను కొమ్మున ముష్టితాడనము జేయవలయును (రతికాలమందు చంద్రకళాస్థానమగు హృదయమున ముష్టి తాడనము.చేయుట కళాశాస్త్రప్రసిద్ధము "ముష్ట్యా వక్షసితాడయంతి" అని కొక్కోకుడు చెప్పియున్నాడు, రతికల్లోలము నందు.

తే॥గీ॥ చంద్రకళయుండుచోటుతానరవినెరిగి।
గుబ్బచనుమొనలనునుల్మి కులుకులాడి।
బాహుమూలలగిలిగింతబాగుపరచి।
కొమ్మునను తాడనముసేయగొమ్మకరుగు అని చెప్పబడియున్నది॥

(స్త్రీలయొక్క అధరము చుంబనము చేయవచ్చునా) (అంటే.)

శ్లో॥ రతికాలేముఖస్త్రీణాం। శుద్ధమాఖేటకేశునాం॥

రతికాలమందు, స్త్రీలయొక్క ముఖమును, వేటయందుకుక్కల యొక్క ముఖమును, పరిశుద్ధము. సమస్తజాతి స్త్రీలయొక్కముఖము. రతికాలమందు పరిశుద్ధమూ, కాదు,

శ్లో॥ కశ్చుంబతికులపురుషో, వేశ్యాధరపల్లవంమనోజ్ఞమపి।
జారభట, చోరచేటక, విటనటనిష్ఠీవన, శరావం॥

గూఢపురుషులు, దొంగలు, యోధులు, స్త్రీ పురుషులకు సంధానముచేయు పురుషులు, జారులు, నటులు, మొదలగు వారందరు, చుంబనముచేయు వేశ్యాస్త్రీయొక్క, చిగురుటాకువంటి. యధరోష్ఠము మనోహరమై, నప్పటికిని, చుంబనార్హమైనదికాదు. అయిన ఉత్తమ కులజులు, తమజాతి స్త్రీలయొక్క, అధరము మాత్రము, రతికాలమందు, చుంబనముచేయునుగాని, యితర స్త్రీలయొక్క అధరము. చుంబనముచేయరు. అట్లుజేసినట్లయిన, రోగాద్యుపద్రవములకు. కారణమగుదురుగాన, కులస్త్రీల అధరముమాత్రము, చుంబనము చేయనలసినది.

శ్లో॥ ప్రణయమధురా ప్రేమోదారా, రసాశ్రయతాంగతాః।
ఫణితిమధురా, ముగ్ధప్రాయాః, ప్రకాశిత సమ్మదాః।
ప్రకృతిసుభగా, విస్రంభార్ద్రా, స్మరోదయదాయినూ।
రహసికిమపి, స్వైరాలాపం, హరతి, మృగీదృశాం॥

స్నేహమును చూపించుటచాత, సంతాపమును హరించునట్టిదియును ప్రేమచేత మిగులనొప్పెదియగు, శృంగారరసమునకు, ఆధారత్వమును పొందినవై, సందర్భవిశేషములచేత, మనోహరములైన సౌందర్యముకలిగి. సూచనచేయబడిన సంభోగౌత్సుక్యమువల్ల, విశ్వాసముచేత నిండియుండినవియై. సహజముగానే, ఆనందమును, మన్మథోదయమును, కలుగజేయునట్టివియగు, స్త్రీలయొక్క, యేకాంతమందలి మర్మోక్తులు, ఇటువంటివియని. చెప్పశక్యముగాక, అత్యధికముగా, మనోహరములగుచున్నవి.

కం॥ బంగరుకుండల కెనయగు, నంగనకుచములనునన్న నడుమునునారుఁ ।
రంగారుతొడలయందము, శృంగారము మీరజూచి చిత్రజవశుడై ॥

గీ॥ పూలబంతులకొప్పైనపాలతిగుబ్బ ।
లదిరినను మోవిపలుగంటులానవేళ ।
వారముఁాలము చేనంటి మారకేళి ।
గరగజేశినగాపంను ఘనతవంబు ॥

కాబట్టి, స్త్రీలులోకములో, మంచి వస్తువులనియు, చెడ్డవస్తువు లనియు కూడా చెప్పియున్నాను. అయిన, కాముకులకు స్త్రీలేమంచి వారనియు, విరక్తులకు స్త్రీలు చెడ్డవారనియు సందర్భానుసారముగా, చెప్పవలెనేకాని, స్త్రీలు సర్వదా చెడ్డవారేఅని చెప్పజాలను.

## స్త్రీ విద్యనుగురించి

స్త్రీలు విద్యనేర్వవలెనని. యిప్పటిజనులు, వర్తమాన పత్రికల లోను, ప్రబంధములలోను. చాలారీతులుగా, వ్రాయుచున్నారు, అట్లు నేర్పుటచే, ప్రమాదమునకు కారణమగుచున్నది. లోకములో ప్రతిపు రుషుడు, బుద్ధివంతుడుగా వుండజాలడు, అట్లు విద్యనేర్వక, బుద్ధివంతు డుగాని వానికి, చదువరియైన పెండ్లాముదొరకిన. భర్తను యంతఅలక్ష్య ముగా చూచునో, తెలుసుకొందురు. భర్తను అలక్ష్యముగా జూచుట ప్రకటమేగాక యింటిలోపని పాటలు జేయక శృంగారరసమును తెలు పులుగొన్న పుస్తకములను ముందరవేసుకొని. తనకు సరియగు స్త్రీలను, గూప్పుండ పెట్టుకొని, పుస్తకములను జదువుచు, అనర్థములు బోధించు చు, అహల్యఇంద్రుని బొందలేదా, తారచంద్రుని వరించలేదా, ద్రౌప దికిపదుగు పతులుండినను. ఆరవవాడగు కర్ణునియందు, ఆశయుండలేదా, హేసఖియలారా, ప్రాయమును వృథాయౌల బోగొట్టగొనుచున్నారు సుఖమునకేకదా యౌవనము ముఖ్యకారణము, వీనిని యిట్లైను.

సారముగా, మీకు కావలశిన పురుషులతో, గలసి, భోగించి సుఖించ రాదా, మీకు కావలశినవారికి. లేఖలు వ్రాశిపంపరాదా, మీరుకూడా చదువరులైనారే. చదువు నేర్చినదానికి సార్థక్యమును పొందించుకి, యీల యీజన్మమును, వృథా కడతేర్చుచున్నారని బోధించుచు, అదిమొదలు స్త్రీ సంఘములను చేయుచు స్త్రీ సంఘములలో (ఒక స్త్రీ) పురుషులకన్నను స్త్రీలు హెచ్చగుకామము కలవారని గ్రంథములలో జెప్పియున్నది. మనకుకూడా అనుభవములోనె వున్నది. అట్లుండియు పురుషులు హెచ్చనియీమనము కమ్మిఅనియు యందుకై యోచించవలెను, దేహమంతయు వకటేకదా, తినుపదార్థము లన్నియు వకటేకదా మగవాడు తన స్వేచ్ఛానుసారముగా తనకింటికి రమ్యమైనదానితో సాంగత్యము చాయవచ్చును. ఆడుది చాయరాదా, చూచితిరా యెంత అన్యాయము నామాట మీరువినుకి మీకు ఇష్టులైన పురుషులకు కాకితములు వ్రాసి పంపుడి, వారితో సంభోగాది విషయములలో మనమ్ము సంతోషపెట్టుడి, యీజన్మమును వృథాచేయకుడి, అని యీలాగు మంచి నడతగల స్త్రీలను చెరచుటకు విద్యనేర్పుచున్నారె కాని మరేమియూలేదు విద్యవచ్చినమాత్రమున మంచి పతివ్రతల చరిత్రములు, జదువుచు పతిభక్తి కలిగి పతిసేవచేయుచు, ఉండకూడదా దైవమున కన్నను పతియేము ఖ్యదైవము, వ్రతములతోటి పూజలతోటి మడుగు ఆచారము ఉపవాసములతోటి నేమి ప్రయోజనముండదుగాన, స్త్రీలువిద్యనేర్పుట చాలా అన్యాయమని నాయభిప్రాయము యీ విషయమై కాళిదాసుచరిత్ర 8 పేజి జూడవచ్చును. ఇందుకు విరుద్ధముగా మద్దగిరితాలూకా మిడిగెశి పండితనంజుండ శాస్త్రులవారి కొమారుండగు మ-రా-రా-శ్రీ, చంద్రశేఖరరావ్ గారి యభిప్రాయము, వారి యభిప్రాయమేమన స్త్రీలువిద్యనేర్పుట మంచిదనియు నిపుణత కలవారగుదురనియు, గృహకృత్య

వివయుమై లెక్కపక్కలు మొదలుగాగలిగిన ధనధాన్యములను నాజూ కుగా చూచుకొనుటకు, పతి అజ్ఞానియైనప్పటిలో పతికి గ్రంథములు జదివి బోధించి జ్ఞానవంతునిగా జేయుటకు విచక్షణకలుగుటకు పతివ్రతల చరిత్రల చదువుటకు యెంతవిద్య కావలెనో, అంతయే చాలునుగాని పాశ్యనులై తలవిసురుకొని తిరుగు, విద్యకూడదని వారియభిప్రాయము, నేను సహావిద్య వలదనిచెప్పను. విద్యవచ్చిన దానికై పతిని నారాయణ మూర్తిగా భావించి సర్వకాల సర్వావస్థలయందును పతిమాటకు బదులు చెప్పక పతియొట్ల దువృత్తియుండకుండినను దాని కిసహ్యాపదక పతివ్రత యని పేరొంది, యుండవలయును.

## పతివ్రత లక్షణములు.

శ్లో॥ కోకిలానాంస్వరంరూపం పాతివ్రత్యంతుయోషితాం।
విద్యారూపంకురూపాణాం క్షమారూపంతపస్వినాం

కోకిలకు స్వరమేసౌందర్యము, స్త్రీలకు పాతివ్రత్యమె సౌందర్య ముకురూపులకు విద్యయేసౌందర్యము తపస్వులకు శాంతియెసౌందర్యము పతివ్రత ఉదయమున లేచినలోదన, పతిపాదములకు నమస్కరించి గృహకార్యములుజేయుచు, మధ్యాహ్నమునకు దేవుడిచ్చుదానిని గొప్ప గా భావించుకొని పచనముచేసి, భక్తితో ఆదరణతో, పతికి భోజనము పెట్టి పతిభోజనానంతరం పతికి తాంబూలమునిచ్చి తాను భుజించవ లెను రాత్రివేళ పతిమనస్సుకు సరియగానుండి, పతినిద్రబోవు వరవుకు పతికిశ్రూషజేయుచు పతి నిద్రబోయిన పిదప తాను నిద్రబోవలెను.

శ్లో॥ కార్యేషుదాసీకరణేషుమంత్రీ రూపేచరంభాక్షమయాధరిత్రీ।
భోజ్యేషుమాతాశయనేతువేశ్యా షాడ్గుణ్యయుక్తాకులధర్మపత్నీ॥

అనురీతిగా పోషించడములో తల్లికన్న హెచ్చైన మమకారము కలయుండు వేశ్యకన్నను హెచ్చైన సుఖము నివ్వడము, మొదలు గాగల షడ్గుణములతో యుక్తురాలుగా, వుండవలసినది.

శ్లో॥ సాభార్యాయాపతిప్రాణా సాభార్యాయాప్రజావతీ ।
మనోవాక్కర్మభిశ్శుద్ధా పత్యాదేశానువర్తినీ ॥

పతిప్రాణమును తన ప్రాణమువలనె జూచుకొనునది యాసంతా నము కలదియు మనోవాక్కర్మములచే పతిసేవచేయుచు పతియిష్టా నుసారముగా, నుండునట్టిదియే పతివ్రతయనఁబడును. పతిగ్రామాంతరము బోయిన, మంచి హెచ్చువెలయగు చీరలు ధరించక జడవేసుకోక చక్కగా సొమ్ములన్నియూ ధరించక మలినాంబరమును గట్టుకొని పతినేమనస్సున సర్వకాల సర్వావస్థలయందు. ధ్యానించుచు, పతియాగమనమును. నిరీక్షణ జేసుకొనుచు పతియింటికి వచ్చిన యేమిదెచ్చినను, దెచ్చినను, యల్లప్పుడు పతినిజూచి సంతోషభరితస్వాంతయై పతివ్రత యుండవలసినది.

(విధవకొరకు జెప్పుట.)

శ్లో॥ ఋతుస్నాతాతుయానారీ భర్తారంనోపసర్పతి ।
సామృతానరకంయాతి వైధవ్యంచపునః పునః ॥

ఋతుస్నానవైభర్తను సంతోషపెట్టకయుండుట మొదలగు పాతకములచే మీకు నరకముకలిగినది. ఆనరకమనుభవించి మరల జన్మముకలిగినది ఆ పాతకముచేతనే యీ జన్మమందు వైధవ్యముకలిగినది మరల నరకమునకు ప్రయత్నముచేయక ఓర్పుకలిగి భర్తతోడి స్వర్గమును ఈ మార్గైనను పొందుడు.

## ప్రస్తుత స్త్రీచర్య.

లోకములో కొందరిస్త్రీలయొక్క విద్యమానమేమియన యిప్పుడు చూచినపతిని దుర్భాషలాడుచు, యింటిలో కూర్చుకొనియుంటే మధ్యాహ్నమునకు యట్లవచ్చుచున్నది. సంపాదిస్తావా, సొమ్ములు చేయిస్తావా నీవేమి జేసిస్తావు, నీముఖము ఫలానింటిలోచూడువాని భార్యకు,

యంతసొమ్ములు చెపించినాడు, సిగ్గులేదా అని గద్దికన్నను పలుచనగా చూచుచు కొందరు వర్తించుచున్నారు. మరికొందరి విద్యమానమే మున రాత్రివేళ పరుండుసమయమునందు, ప్రక్కలోకి భార్యవచ్చి పరుండి వీనికోర్కెను దీర్చుచుండా జ్ఞానాకు అడ్డికెలు చేపించుచున్నానని చెప్పితిరి, ఇంకా చేపించలేదు. వంకీలు, నాగబందెలు, మొదలగునవి పెట్టుకొందామని యంతో భ్రమ అవుచున్నది. యెన్ని దినములు చూచిన ఇంతే. అనుచు వీనిమనస్సునకు, యంతటిసుఖము కావలెను. అంతచేసేది, అప్పుడు వీనికి ఆతురసమయముగాన, రేపుచేపించెదను. మర్నాడు చేపించెదను, అనిచెప్పుచు నెలదినములు వరకు గడపెను. వీనికి యక్కడికి యత్నములేక రాత్రిపూట యిల్లుచేరడమే పెండ్లాము దగ్గరపండు కొనడమె సున్నకేసేది. అక్కడనుండి వీనుకామము పట్ట జాలక వేర యింకొక స్త్రీని చూచుకొనేది. మంచివనిత అయితే మంచిమాటలచె, సొమ్ములు రాత్రిపూటనే. అడుగుచున్నది. గయ్యాళియైన పక్షమందున, ముందుచెప్పిన రీతిగా, చూచున్నది. నేను పరపురుషుని సాంగత్యము చాయలేదు. నేను పతివ్రతను అనుకొని యుండేది, పరపురుష సాంగత్యమును చాయకుండిన మాత్రమునను పతివ్రతయగునా, కానేరదు. ముందుచెప్పిన రీతిగా, పతిశుశ్రూషచేయుచుపతినిదైవముగా భావించు కొన్నదే పతివ్రత, యీ విషయములో మ॥ రా॥ రా॥ శ్రీ, ముద్దగిరి తాలూకు మదిగేసి సకలవిద్యాప్రవీణులగు చంద్రశేఖరరావ్ గారి, అభిప్రాయము, తెలపరచెదను. స్త్రీపురుషులు భయులు, వకరికొకరు శుశ్రూషలు చేయవలయును. స్త్రీ అర్ధాంగిగావున, స్త్రీచే, శుశ్రూష చేపించకూడదు. పురుషుడు యావత్కార్యములలో, యేవిషయములలో యావత్సందర్భములలో యావత్సమయములలో, యంతటివాడో స్త్రీ యతని, అంతటిది యే. శాస్త్రపద్ధతిమేరకు సమస్తమైన కర్మలకు సమస్తమగు కార్యములకు స్త్రీసహాయము లేకుండిన యట్టికార్యములైనను

జరుగవు స్త్రీకి, వేదాధికారము. కలదు, ఉపనయనము కలదు బాల్య వివాహము కూడదు, విధవవివాహముగా వచ్చునని, శాస్త్రి సమ్మతిచే వీరి యభిప్రాయము.

ముందు జెప్పినరీతిగా, స్త్రీలు, తెలివిమాలినవారలై, పతిని, రాత్రిపూట, యిల్లుజేర్చకచేసి, అతడు ఇతరస్త్రీలతో సాంగత్యము చేసిన మాత్రముననే, మేహ, చర్మ్యాదుపద్రవములు కలుగ జేసుకొని, వైద్యులను బతిమాలి. ఔషధములు దీసుకొని దానిచే యడతెగని రోగములు గలవారలై. దేహము కృశించి, పురుషునకు రక్తము, వీర్యము చెడి, స్త్రీలకు గర్భకమలము జెడి, సంతానము నిలువక, నిలిచినను మధ్యనే జారిపోయి, లేక నవమాసములై ప్రసవించినను, తత్క్షణమే, పుట్టినబిడ్డ చనిపోవును. అట్లు చనిపోక బ్రతికియుండిన, పుండు, పొక్కులు మొదలగువాటిచే, ఆవరింపబడియుండు అనహ్యముగల, బిడ్డగా నుండును. అప్పటిలో మనుస్సుకు విసుకుజెంది, దేహము స్వస్థతజేసుకొందమని, వైద్యులనాశ్రయించి, ఔషధములు, తీసుకొనుచున్నాడు.

## →→ ప్రస్తుత స్త్రీచర్యలో వైద్యులపద్ధతి ←←

శ్లో॥ నాతిధైర్యం ప్రదాతవ్యం, నాతిభీతిశ్చరోగిణః ।
నైశ్చింత్యా ద్వాదిమదానం, నైరాస్యాదేవ నాస్తితే॥

వైద్యుడు రోగికి వ్యాధితప్పక కుదురునని అతిధైర్యమును నీయ గూడదు, ఇకబొత్తిగా కుదురదని నిరాశను జెప్పకూడదు, అతి ధైర్యముగా జెప్పుటవలన వ్యాధి కుదురునను నిశ్చింతచే వైద్యునకు ధనము నగడు వ్యాధియట్లులైనను కుదురదను నిశ్చింతచేతనైనను ధనమొసగడు.

శ్లో॥ భిషజ్యాతు యథాకామం, పథ్యంతుకఠినంవదేతు ।
ఆరోగ్యంవైద్యమాహాత్మ్యా, దన్యథాత్వపథ్యతః॥

వైద్యుడుమందును, ఇష్టమువచ్చినదానిదేనినైనా ఇవ్వని, పథ్యముమాత్రము, కఠినముగా జెప్పవలయును. వ్యాధిగుణమాయెనా, నా

మందువలన కుదురిన దనవలెను. కుదరకపోయనా, నీవు సరిగా పథ్యము వుండలేదని, తప్పించుకోను చూడవలయును.

శ్లో॥ రోగస్యావక్రమసాంత్యం, మాధ్యాకించిద్ధనవ్యయః।
శనై రనాదరశ్శాంతౌ, స్నాతో వైద్యం, నపశ్యతి ॥

మనుజుడు రోగము బొడమినప్పుడు, వైద్యుని బ్రతిమాలుకొనును, నడుమ వైద్యునకు కొంచము ధనమునిచ్చును, వ్యాధి కుదురగానే, వైద్యుని కొంచము నలక్ష్యము చేయును, స్నానము చేశినపినప, వైద్యుని వంకయెజూడడు, యీలాగు, వైద్యుడు ఔషధమిచ్చినను. కుదరకబోయిన, అక్కడనుండి ఇదిగ్రహచారమని, జ్యోతిష్కులవద్దకువచ్చి మహాత్మాజోస్యులవారు. నాకుగ్రహగతి యేలాగువున్నది. నేను యీ రోగముచే. జచ్చెదనా, లేక బ్రతుకెదనా అని యడుగగా.

## ప్రస్తుత స్త్రీచర్యలో, జ్యోతిష్కుల పద్ధతి.

శ్లో॥ ఆయుః ప్రశ్నే దీర్ఘమాయుః, వాత్స్యంమాహూర్తికై స్సదా।
జీవంతో, మహామన్యంతే, మతాః ప్రత్యంతికంపునః ॥

యీరోగముచేత బ్రతుకెదనా, జచ్చెదనాయని యడుగగా. అం, దుకునీవు, చాలాకాలమే బ్రతికి యుంటున్నావనే, చెప్పవలయును అట్లు చెప్పుటవల్ల. యేమిలాభము, వాడు జీవించెనా, నీవు చెప్పినది వాస్తవమని సన్మాంచుచున్నాడు, లేక. జచ్చెనా, నీవాళ్లు చెప్పితివని. పునహా యవ్వరినడుగును గాన, యవడైనరోగివచ్చి, చస్తానా, బ్రతుకుతానా, అని ప్రశ్నచేస్తె, నీవు బ్రతుకుతావనియే చెప్పవలెను.

శ్లో॥ పుత్రేతి త్యేవపితరి, కన్యేత్యేవమాతరి।
గర్భప్రశ్నే షుకథయన్, దైవజ్ఞో, విజయీభవేత్ ॥

యేశిశువు కలుగునని, ప్రశ్నచేయగా, పురుషునితో, మగశిశువు పుట్టుననియు, స్త్రీతో ఆడిశిశువు కలుగుననియు, చెప్పవలెను.

స్త్రీ శిశువుజనించిన. పురుషుడువచ్చి, జోస్యులువారు. యీలాగు జెప్పితిరే, అబద్ధమాయెనే, అని ప్రశ్న జేయగా, అయ్యా, నీభావనను బట్టి నీకు సంతోషకరముకొరకై, పుత్రసంతానమగునని, హాస్యముగా జెప్పితిని, అప్పుడే నీభార్యతో, యేమి జెప్పియున్నానో విచారించుకో అని యుక్తిగా తప్పించుకొనుచుండవలయును.

శ్లో॥ శతస్యలాభేతాంబూలం, సహస్రస్యతుభోజనం ।
దైవజ్ఞానాముపాలంభో, నిత్యాకార్యవిపర్యయె ॥

యెవరైనను వ్యాపారవిషయమై. లాభమువచ్చునా రాదా అని ప్రశ్న చేసిన లాభమువచ్చునని చెప్పినపిదప. నూరు లాభమువచ్చెనా, ఒక తాంబూలము దొరకుచున్నది. వెయ్యివచ్చెనా, సృష్టుగాభోజనము లభించుచున్నది. చెప్పినది జరుగునెడ, తాంబూలముమాత్రం దొరకును, తాంబూలము దొరకక పోయినను పోవునుగాని, జెప్పినది దప్పునెడ తిట్లుమాత్రము దప్పనేరవు. యీలాగు జ్యోతిష్కులకు జెప్పుదబ్బరలను గ్రహించి. అందుచేత, మనస్సు నిష్కళంకములేక, చాలామద్దు, వ్రయము జేసుకొని. అప్పులవాండ్లు పాలై శ్రమలుజెందుచు.

### ప్రస్తుత స్త్రీచర్యలో అప్పులబాధ.

శ్లో॥ సృతేసీదంతిగాత్రాణి, స్మృష్టిప్రజ్ఞాపినశ్యతి ।
అహోమహాదిదంభూత, ముత్తమర్ణాభిశబ్దితం ॥

అప్పుయిచ్చినవానిని మనస్సున దలంచగ నవయవములు గడగడవణంకుచున్నవి వాడుకనుల కగుపడగనె తెలివియు దప్పుచున్నది, అప్పుయిచ్చిన వాడను పెనుభూతమయగును, వానివద్ద ధనముతీసుకొనినవానికి పెనుభూతమువలనె కనుబడచున్నాము.

శ్లో॥ నపస్యామోముఖేదష్ట్రాం నపాశంవాకరాంచలె ।
వృత్తిమర్ణమవేక్ష్యేవ, తథాప్యుద్విజతేమనః ॥

అప్పిచ్చినవాని, ముఖమునందు. కోరపల్లులు, చేతియందు, నాగపాశముగాని. కనుబడవు, యమలక్షణములు లేవు. అయినను. వానిని చూడగనే, మనస్సుకంపమొందు చున్నది యీలాగు అప్పులవాండ్లచే జిక్కి వాండ్లచే బాధనొందుచు, చాలాకష్టములకు గురియగుట, దుర్మార్గస్త్రీలచేతనేగదా, యిదియునుగాక. ఆడబిడ్డలు విద్యనేర్చి యుంటున్నారు. అట్టిబిడ్డను. విద్యాహీనునకు ఇవ్వడమునకు బుద్ధిపుట్టను. స్త్రీలు, మిక్కుటమైన విద్యనేర్చినగదా. పురుషులు విద్యాహీనులని తెలియుట, అట్లుతెలసి, తమబిడ్డలను యవ్వరికి ఇచ్చుటకు బుద్ధిపుట్టక. లోకములో వరుడు దొరకడమే. మహాదుర్లభముగా నున్నది. కాబట్టి స్త్రీలు అతివిద్యనేర్చుటలో, పురుషుని ప్రయత్నం సాగనివ్వరు. పురుషుని లక్ష్యపెట్టరు, ఇదిగాక మహాప్రమాదములకు కారణములగుచున్నవి, స్త్రీలు విద్యనేర్చిన మాత్రమున. తగ్గినడవరు, అయితే, నేను యీలాగు చెప్పియుండుటవలనట్టి, చాలాస్త్రీలు దీనిని విరుద్ధముగా. దలంతురు, లోకములో, విద్యనేర్చిన స్త్రీలనుజూచి, అనుభవముపైనను. కొంతమంది పురుషుల అభిప్రాయముపైనను, యీలాగు వ్రాసియున్నాను. గాన స్త్రీలు ముందుచెప్పిన రీతిగా తనపతి మనస్సుకు, విసుకుతెందనివ్వక పతి స్వేచ్ఛానుసారముగా, వర్తించిన లోకములో, వచ్చులకుయుండుకు కష్టములు తటస్థించును. ఇది వకటిలో స్త్రీలు పురుషులను కష్టములు తటస్థించునట్లుగా చేయుదురు గాని, మిగత విషయములలో స్త్రీలు పురుషులకు, యేలాటికష్టములును గలుగచేయరు. పురుషులుమాత్రము స్త్రీలను అనేక కష్టముల పాల్పడునట్లుగా, గురిచేయుచుందురు. మనస్త్రప్రాణులు దైవాధీనముతప్ప, ఇతరుల అధీనములేక, వివాహమైననవినహా అందరు, తమతమ దేహములకు స్వతంత్రులే. బుద్ధిలేని చిన్నదానిని, అతిబాల్యములో. విద్యాహీనునకు నిర్ధనునకు ముసలికి ఇచ్చినట్లయిన, వాడు యెట్లు యెదిగిన దానిని, కుత్తరోత్తర, పాలించగలడు.

దటాలున, బాల్యవయస్సునందు బుద్ధిరాని పసిపిల్లలను కొరతకు యి చ్చిన మాద్రిగా, వరగాటికి కట్టివేయుచున్నారు. అక్కడ మేతనీళ్లు, అదృష్టానుసరణిగా, వచ్చునని, దలంచి, యీ క్రూరకార్యమును జేయు దురు. ఆపసిపిల్లలను బాల్యాదిగా సాకి, యిదిమంచి, యిదిచెడ్డ, అను ట దెలియకుండు నప్పుడు వివాహముచేయుట, అన్యాయముగదా చిన్న ది ఋతుమతియై, ప్రస్తుతమై యింటికి బోయిననంతరము. కష్టసుఖము లు, తాను అనుభవించునుకాని, తలితండ్రులకు తెలియునా, తెలియదు, కాబట్టి బాల్యవివాహము అతిదూష్యము.

## ➳ బాల్యవివాహము. ⬅

మనుసంహితయందు అష్టవర్షముల, గౌరికి వివాహమున్నూ నవవర్షముల రోహిణికి, వివాహమున్ను, ఆమోదించు వచనములు కన బడుచున్నవి. ఋతుమతిఅగుటకు పూర్వమందే, కన్యకకు వివాహము. చేయతగినదియని, ఉక్తవచనముల, తాత్పర్యము. దెలియుచున్నది అట్ల నే, అనేకులు సహా చెప్పుచున్నారు. (పరాశర)

శ్లో॥ ప్రాప్తేతుద్వాదశేవర్షే యఃకన్యాంనప్రయచ్ఛతి ।
మాసిమాసిరజస్తస్యాః పిబంతిపితరానిశం ।
మాతాచైవపితాచైవ జ్యేష్ఠభ్రాతాతథైవచా ।
త్రయస్తేనరకంయాంతి దృష్ట్వాకన్యాంరజస్వలాం ॥

12 వర్షములగు టనపిమ్మట, కన్యకకు వివాహము కాకుండినపుడు, వివాహపూర్వమె చిన్నది ఋతుమతియైన, నెలనెలకు బైటబడురక్తము ను. తమ పితృవులు త్రాగుచురనియు, తల్లి,తండ్రి, అన్నకు, యాచిన్న దానిని చూచిన మాత్రమునను, నరకప్రాప్తి కలుగుననియు.

శ్లో॥ యస్తాంసముద్వహేత్కన్యాం బ్రాంహణోమదమోహితః ।
అసంభాష్యో, హ్యాపంక్తేయః, సవిప్రోవృషలీపతిః ॥

అట్టి చిన్నదానిని, మదముచేత యుక్తుడై, యువకు వివాహము చేసుకొనుననో, అతను మాటలాడుట కైనను, సపంక్తి భోజనమున కైనను, యోగ్యుడుకాదని చెప్పియున్నారు. యందుకు చెప్పియున్నారనగా, రుతుమతిఅయితే కన్యాప్రాప్తియు ముందు భోగలాలస బుట్టుటకాకనె, అప్పుడు పెండ్లిచేయక పోయినట్టయిన ధ్వానిచరిత్ర, భ్రంశమునకు, ఆశంక బుట్టుచున్నదని.

శ్లో॥ అతోప్రవృత్తిరజసీ కన్యాందద్యాత్పితాసకృతు।
తస్మాదుద్వాహయేత్కన్యాం యావన్నర్తుమతీభవేత్॥
ప్రాకృతోస్తస్యాపూర్వ్వంకుర్వాఞ్ సదోషభాక్॥ ఇత్యాది.

అనేక వచనములలో రుతులాభమునకు పూర్వము, కన్యాదానమునకు కాలనిర్దేశము గలిగియుండదను గాకనె, రుతువైన బిడ్డటను సహా కన్యాదానముచేయుటకు విధాయకమైన, శృతియేప్పడియున్నది. మరియు రుతుమతియైన, బిడ్డట, కన్యకకు వివాహము చేయుట అధర్మ జనకమైనదనియు చెప్పియున్నది. అవన్నియు, వచనములను పట్టుకొని, యభిమానములేకనే యోచన చేసినట్టయిన, ఎనిమిదిసంవత్సరముల చిన్నదానికిగాని, తొమ్మిదివర్షముల చిన్నదానికిగాని, వివాహము చేయుట శాస్త్రసమ్మతమని అంతగా చెప్పుటకు అవకాశములేదు.

"శ్లో॥ అష్టవర్షాభవేద్గౌరీ॥ అను ఇత్యాదివచనములకు, రజోయోగానంతరం వ్యభిచారశంక, గలుగుచున్నదని, కారణముచె, రజోలాభమునకు పూర్వమె, కన్యాదానము ప్రశస్తమని, అర్థము చేయవలయును. గౌరీ, రోహిణి, యనుపదములకు, యనిమిది వర్షములలోగాని తొమ్మిది వర్షములలోగాని, యని అర్థముగాదు, స్మృత్యాసంగ్రహమను గ్రంథమందు.

శ్లో॥ అప్రాప్తరజసాగౌరి ప్రాప్తేరజసిరోహిణీ।
అవ్యంజితాభవేత్కన్యా కుచహీనాచనగ్నికా॥

అనుకర్త్రార్థము నిరూపితమైనది రజోయోగమునకు పూర్వమై గౌరి యనియూ, రజోయోగానంతరం రోహిణియనియు, యవ్వనవిశేష చిహ్నములు, ఉద్భూతమగు పర్యంతరము కన్యయనియు, కుచోద్భవము నకు పూర్వము నగ్నికయనియూ, తాత్పర్యము. ఇప్పుడు "అష్టవర్షా భవేద్గౌరి" "నవవర్షాతురోహిణీ" యని చెప్పియుండు వచనములయందు, పయిన చెప్పబడిన సంగ్రహకారుల వచనములను చేర్చి ప్రకృతార్థము యేమనుచున్నది. "గౌరి" రోహిణీ" యులవివాహమనిన రజోయోగమునకు పూర్వమై, చేయవలశిన వివాహమని, మొదలుయోచించితిమి, ఇప్పుడు పైవచనముచె, అది సరికాదని, చెప్పవలశివస్తున్నది కదా. "ప్రాప్తేరజ సిరోహిణీ" రజస్వల వివాహమనిననూ, "రోహిణీ" వివాహమనిన, వగటే అర్థమును, సూచింపబడుచున్నది. తొమ్మిదివర్షములు గలదానికి "రోహిణి" యనియు అపూర్వవయస్సు గలదానికి "గౌరి" యని మనువుచెప్పడము. సమన్వయము కాచాలను, బాల్యవివాహ పక్షపాతముగల వారలు ఉక్తవచనములను మనువుయొక్క నోటిలో, వేశినట్టుగా దోచబడుచున్నది. అదేమనువు మరివక స్థలమందు.

శ్లో॥ త్రింశద్వర్షోవహేత్కన్యాం హృద్యాంద్వాదశవార్షికీం ॥

ముప్పై సంవత్సరముల వాడు పండ్రెండు సంవత్సరముల చిన్నదానిని వివాహము చేసుకొనవలయును. యని చెప్పియున్నాడు, సాధారణముగా, ఆడిచిన్నవాండ్లు, పండ్రెండు సంవత్సరములలోపల ఋతుమతులై యుంటున్నారు. అప్పుడు వాండ్లకు, వివాహము చేయవలయునని మనువు పైవచనమందు. చెప్పియున్నాడు. మరివక వచనప్రకారము పది సంవత్సరముల నంతరం, ఆకన్యరజస్వలయని, అట్టిదానికి వివాహము చేయడము మహాపాపమని, చెప్పియున్నాడు యివి పరస్పర విరోధవచనములుగావా. అష్టవర్షా" మొదలైన. వచనములు, ప్రక్షిప్త

వచనములుగాక, మనువుయొక్క వచనములు అయితే, కన్యా, రజోయోగమునకు పూర్వమందు, అథవా, దానికి అవ్యవహితముగు, పరమందు. వివాహము చేయవలయునని. ఆవచనములకు, అర్థము చేసినట్లయిన, అప్పుడు అవి సార్థకమగుచున్నవి. అట్లు అర్థమునుచేసి, వచనములను, సార్థక్యతను బొందించితే, బాల్యవివాహము, మనువు ఆమోదించి. యుండలేదని స్పష్టముగా చెప్పినట్లు, అగుచున్నవి. మహాభారతమును జూచితే, ముప్పైసంవత్సరముల పురుషుడు, పదియారు సంవత్సరముల "నగ్నిక" యను. దానిని. వివాహము చేసుకొనవలయునని, వేదవ్యాసరుషి, వచనములు చెక్కుచున్నవి. "నగ్నిక" యనుశబ్దము, అక్కడను, ప్రయోగమైన కారణముచే, "అనాగతార్థమే" (ఋతుమతియైన కన్యా,) యని అర్థముచేసితే, స్మృతికి విరోధముగా, నుండునని కొందరు చెప్పుదురు అదియుసరియని, తోచదు కోగటీకితరాలై. నుండదముకాకనే. పదహారు సంవత్సరముల చిన్నది. ఋతుమతి, కాకుండదు. అసంభవము, మరికొందరు "కుచహీనాచనగ్నికా" యను వచనమువలనే, "నగ్నిక" శబ్దార్థమును చేయవలయునని, "భారత" మందు చిన్నవాండ్లకు, పదునారు సంవత్సరముల ప్రాయమందు, రజోయోగముగాని, స్తనోద్భేదముగాని, అగుచుండలేదని, అభిప్రాయపడుదురు. శాస్త్రము, పురాణము, కావ్యము, మొదలైన పురాతన గ్రంథములను జూచితే, పదునారు సంవత్సరముల చిన్నవాండ్లు, వయస్సుకలిగిన స్త్రీలవలనే, వర్ణనచేయబడియున్నారు. "నగ్నికా" యను సామాన్యపదమునకు యావదర్థమును, కల్ప చేయవలసినదైనను, వయస్సును సూచింపబడు సంఖ్యావాచకమైన, పదునారు. అను దానికి అర్థాంతరమును. కల్పనచేయడము. గాచాలదని, దోచుచున్నది. ఆకారణముచే. పదునారు సంవత్సరముల పర్యంతరము. కన్యకకు వివాహము చేయవచ్చునని, శాస్త్రరీత్యా చెప్పవచ్చును. "మహాభారతమందు"

"షోడశవర్షాం భార్యాం, విందేతనగ్నికాం" యను "వ్యాసవచనము" స్పష్టమైనది. గాంధర్వ వివాహమునందు మాత్రమె, ఋతుమతికి వివాహము, ఉక్తమైనదనియు. తదితరమైన, బ్రాహ్మ్యాది. వివాహములందు, అదినిషిద్ధమనియు, అనేకులు జెప్పుచున్నారు, "పూతికూశ్మాండాయితమైన; యీమతమును. గూర్చి, ఆలోచనజేయుటకు సమయము లేదు. బ్రాంహ్యాది విధానములయందు, రజస్వలవివాహము. నిందితముగాదు, వైవాహికమైన వేదమంత్రము. రజోయుక్తమైన. దాని వివాహమును, సమర్థన చేయుచున్నది. "సోమః ప్రథమోవివిదె గంధర్వో, వివిదఉత్తరః తృతీయో, అగ్నిష్టేపతిః తుర్యాస్తే, మనుష్యజాః" యని, ఋగ్వేద, వైవాహికమందు, ఉక్తమైనది, సోముడు, మొదటిపతియనియు. అనంతరము గంధర్వుడనియు, అగ్ని మూడవవాడనియు, నాల్గవవాడగు, మనుష్యుడు, సోమ, గంధర్వ, అగ్ని, వీరు సంభోగముజేసిననంతరము, మనుష్యుడగు వరుడు, కన్యను, సంభోగముజేయును. ఆకారణముచే వారు నాల్గవపతి, సోమ, గంధర్వ, అగ్ని, సంభోగకాలము, శాస్త్రమందే ఉక్తమయినది. పైన చెప్పబడిన సంగ్రహమందలి,— "వ్యంజనేతు సముత్పన్నే, సోమోభుంజేతు కన్యకాం" పయోధరైస్తు గంధర్వో, రజసాగ్నిః ప్రకీర్తితాః ॥ వ్యంజనోపలక్షితకాల పరియంతరము, సోముడు, పయోనకోద్భేద కాల పరియంతరము, గంధర్వుడు, రజోయోగ కాలపరియంతరము, అగ్నియు, కన్యకను సంభోగము జేయుచున్నారు. అగ్ని సంభోగకాలము రజోయోగ మనగా బహును. అగ్ని మూడవపతి నాలగవవాడు, వరుడైనందునుంచి, రజోయోగానంతరం, కన్యను సంభోగముజేయు వాడాయెను. యీవిషయము, గర్భాధాన కాలమందు జెప్పవలసినదనియు దానికి మొదలు వివాహమగునేగాని, సంభోగముగా జాలదనియు కొందరు జెప్పుదురు. అటువంటిదియుక్తికి. అవకాశము లేదు మంత్రము

వివాహమునకు అంగమగును. వరుణ్ణి నాగ్నిపతియని చెప్పబడే, మంత్ర విశేషత్వము, పతిత్వమే, వివాహమునకు ఆత్మభూతమైనది. సంభోగముగాదు, సంభోగకాలమును, మంత్రము తెలుపునదైతే, యావలింగబలముచే, వివాహప్రకరణమందు ఉక్తమై, ఉండవచ్చు ననుట, పండితులే, శోధించి చెప్పవలెను, వివాహాంగమైన, హోమమంత్రమందు. "సోమోదదతు గంధర్వాయ గంధర్వో, దదదగ్నయే, రైంచపుత్రాంశ్చాదద ;దగ్నిర్మహ్యా, మథోఇమాం" యనియున్నది. సోముడు యీచిన్నదానిని, గంధర్వునకు ఇచ్చియుండెను., గంధర్వుడు అగ్నికి యిచ్చియుండెను. అగ్ని నాకుయిచ్చెను, నాకు పుత్రులను ధనమును యివ్వగలడు, 'అని హోమమంత్రముయొక్క అర్థము, అగ్ని తనకుదానముచేసెనని వరుడు చెప్పుచున్నాడు. అగ్ని రజోయోగ పరియంతంవరకు సంభోగము. చేయుచు, తత్పరమే ఆ చిన్నదానిని దానముచేశినాడు, దానప్రవృత్తియిచ్చట, పరిస్ఫుటమైన, భావముచే, విద్యమానమైనది. సంభోగకాలముయొక్క, ప్రవృత్తిమైతే నో, అపరిస్ఫుటమైనది. వివాహమంత్రము, వివాహప్రకాశికమైనది మంత్రము చిరకాల కర్మప్రకాశకమైనది. కర్మప్రకాశమైన, ఆమంత్రము ఆకర్మప్రకరణమందే, యుక్తమైనది, శాస్త్రజ్ఞులైన పండితులు, దీనిని తెలిశినవాండ్లుకాలేరు. యీకాలము పండితులు, వైవాహిక మంత్రములను వేరెవిధముగా తెలుసుకొని వర్తించుచున్నారు. అవిధము, యీప్రబంధమందలి, విచార్యమాణమైనదిగాదు. సోమ, గంధర్వ అగ్ని, వీండ్లు యవ్వరైనది. యిక్కడ ఆలోచనచేయతగ్గ, విషయము కాదు. యిక్కడ చెప్పునది యింతే, యేమనిన. రజోయోగానంతరము, వివాహమని. తెలుసుకొనదగినది. రజస్వలయైన చిన్నదాని, వివాహమందు, ఉక్తమగు దోషనివృత్తి, ప్రాయశ్చిత్త విధిముఖముగా. నివారితమగును. ఋతుమతియైన కన్యకకు వివాహము, దోషావహముగాదు,

" నిర్ణయసింధు " అను గ్రంథమందలి; రజస్వలయినదానికి. బ్రాహ్మ వివాహము. నడవవచ్చునని, చెప్పబడియున్నది. అయితే, ప్రాయశ్చిత్త పూర్వకముగా నడవవలయునని చెప్పినది. బాల్యవివాహ సాంప్రదా యము. ప్రారంభమైన పిమ్మటనే, ప్రాయశ్చిత్త ప్రకరణము స్పష్టమైన దని వ్యక్తమగుచున్నది. క్షత్రియాది యితరవర్ణముల కన్యకల వివా హము, యవ్వనమునందు, గావచ్చుననియు, బ్రాహ్మణులకు మాత్రం అది యుక్తముగాదనియు, కొందరు చెప్పుదురు. ద్రౌపతీ, కుంతీ, సావి త్రి, శకుంతల, మొదలైనవారలు, పెద్దవారైనమీదట వివాహములై రనియు, బ్రాహ్మణులకు, అలాగు కాకూడదనియు, ఉదాహరించెదరు. అట్లుచెప్పు మహాత్ములభ్యాపకార్థముకొరకై, " భవిష్యత్పురాణ " విష యములను ఉదాహరించెదను. శీల, కౌండిన్యఋషిభార్య, సుమంత రుషికొమార్తె. అమెవయస్సునందు అనుమానముంచువారలు పురా ణమునందుంచు, శ్లోకమునే, జదవవచ్చును.

" దృష్ట్వాసుమంతః తాంశీలాం, కదాచిత్ ప్రాప్తయవ్వనాం, తాందృ ష్ట్వా చింతయామాస, వరాళావిగణయాన్భువి॥ ఇటువంటి దృష్టాంతము లేమో, అభావములేక యున్నవి, దేవయాని అహల్య, మొదలైన వా రల అనేక దృష్టాంతరములు గలవు. వేదాది శాస్త్రములయందు, యువకులవివాహము, అను బోధింపబడియున్నది, మంటియందు అడు కొనుచుండు పిల్లకాయల వివాహము యచ్చటను, చెప్పబడియుండలే దు. యింకా కొన్నిదృష్టాంతములు, ఇచ్చట వివరించుచున్నాను. "తై త్తిరీయ్యో కాగ్నికాండ" గృహ్ణామితే; సుప్రజాస్త్వాయ, హస్తంమయా పత్యా, జరదష్టర్యథా సహ "సత్సంతానము కొరకున్ను, మీపతియగు నేను జీవితకాలమంతయు, గడపుటకొరకు, మీహస్తమును చేకొని నాను. " వీరసూర్దేవకామ స్యోనశన్నోభవ " శూరులగు, పు త్రులన్ను జనియించి దేవతలకు ప్రియురాలవై, మాకు సుఖములొసం

గుము, అని యీలాగువరుడు వివాహముగు కన్యకు జెప్పుటకదా, యీ విషయమున చిన్నది వయస్సురాక యీ విషయమును, దెలుసుకొనక యుండిన యేమిప్రయోజనము, యీవిషయముచే, యుక్తవయస్సు కలిగియుండవలయునని, స్త్రీలకు సహావేదాధ్యయ నాధికారము, కలదని, సూచింపబడుచున్నదో లేదో శాస్త్రజ్ఞులైన వారలే యోచించవలెను. "సఖా సప్తపదాభవ సఖాయౌసప్త పదాబభూవ" యేడడుగులు నడచి, మిత్రురాలవుకమ్ము, ఏడడుగుల నడచి, స్నేహితులమైనాము. జైమిని గృహ్యాసూత్రమందు" "తామేవసంభవావ, సహరేతోదధావ హైపుంసే పుత్రాయవేత్తవే" రమ్ము మనమిద్దరము. పుత్రసంతానము కొరకు తగుప్రయత్నము చేయుదము. అని ఈలాగు, జెప్పుటవలన, యుక్తవయస్సు వచ్చియుండడము చేతనేకదా, యీలాగు చెప్పుట మను "ఉత్కృష్టాయాభి రూపాయ వరాయ సదృశాయచ, అప్రాప్తామపితాంతస్మయి, కన్యాందద్యాద్యథావిధి" ఉత్తమమై రూపవంతుడై, సమానుడైన, వరునకు యుక్తవయస్సురాలు కాకుండినను సమానుడగువరునకు కన్యనిచ్చి యథావిధిగా వివాహము జరిపింపవచ్చును, యుక్తవయస్సురాలు కాకుండినను, అని జెప్పుటవలన సమానుడై రూపవంతుడైన, వరుడు దొరకినప్పటిలో, అట్టివరుడు ఇట్టి సమయమును విడిచిన, పునహా దొరకడను భావనచె, యుక్తవయస్సు కాకుండినను. వివాహము చేయవచ్చునని మనువే జెప్పియున్నాడు. యుక్తవయస్సనగా రజోదర్శనము పిదప. ముందు జెప్పినటువంటి వరుడు దొరకనిచతీమంను, యుక్తవయస్సగుట వరమకు, వరునివెదక వచ్చునని, యుక్తవయస్సయినను, వివాహము జాయవచ్చునని, స్పష్టమగుచున్నది. "త్రీణి వర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీసతీ, ఊర్ధ్వంతు కాలాదేతస్మాత్, విందేతసదృశంపతిం" కుమారి ఋతుమతిఅయిననంతరం మూడు సంవత్సరములు నిరీక్షించి పిమ్మట సమానునకు పతినిజూచి, యిచ్చి వివాహ

ముచేయవలసినది. యీలాగు మనువు స్పష్టముగా జెప్పియుండుటస్బట్టి సందేహము కించితయును లేదు. ఋతుమతియైన మూడుసంవత్సరముల పిదపైనను తండ్రి సమానుడగు వరుని, విచారించి దన్ను యివ్వకుండిన.

శ్లో॥ అదీయమానాభర్తారం అధిగచ్ఛేద్యదిస్వయం।

నయనఃకించిదవాప్నోతి నచయంసాధిగచ్ఛతి॥

ఋతుమతియైన మూడుసంవత్సరముల బిదప సమానుడగు వరుని జూచి, తండ్రి, యివ్వకుండిన, తానే, స్వతంత్రముగా, వెళ్ళి సమానుడగు వరునిజూచి, వివాహము చేసుకొనవచ్చుననియు ఇందుచె దోషము కలుగదనియు, మనువె జెప్పి యుంటున్నాడె. మనపూర్వీకులు, పురుష పక్షపాతము కలవారని జెప్పుటకు సందేహించు కయిననులేదు, అతి బాల్యవివాహములు జేసిజేసి, లోకమునయంతయు, వితంతువులు మెండుగా నుండుటచే, యీలోకము. సంతానాభి వృద్ధి లేకా మనస్సునకు ఉత్సాహములు లేక యున్నది యీవితంతువులు కామము బట్టజాలక, పురుషసాంగత్యము జేసి,గర్భముధరించి, బిడ్డట శిశుహత్యకు బాల్పడుచురు యహాహా! జూచితిరా యట్టి క్రూరకార్యముయిట్లు లోకములో రహస్యగర్భ స్రావములు జరిగిజరిగి, శిశుహత్యకొల లోకమందంతట జుట్టుకొని అధర్మ ప్రవాహములబలమై, వర్షమునకు ప్రతిబంధకములై యున్నవి వితంతువు కామబాధచే, కుమ్మించుట ఒకటి. శిశుహత్య వకటి క్రూరకార్యములుగు యివిరెండిటిచే లోకమునకంతయూ వారిగోషు జుట్టుకొని నానాటికి భరతఖండము క్షీణదశకు వచ్చియున్నది. అతిబాల్య వివాహముచే, గ్రహచారవశాత్తుగా, బాల్యములోని వితంతుకావడము వకటి (యిందుకు దృష్టాంతము) ఒకభూమియందు విత్తినవిత్తులు విత్తగా విత్తనములన్నియు కోమలముగా బుట్టునట్ రాగరాగ నానాటికి వకటివకటి చనిపోవును పదిసంవత్సరములు అయ్యేవేళకు యీవృక్షములు బాల్యమందె చాలా చనిపోవును. 100 ఏండ్లు అగువేళకు నిల్చు

మును. 4 భాగములలో 1 భాగమే, బాల్యమందున్న చనిపోవువా రలు. బహుమంది చాలాకాలము జీవించియుండు వారు కొంతమంది గాన బాల్యమందె వివాహముచేయరాదు.

బాల్యమందు స్త్రీపురుషసంభోగముచే, గర్భమునిల్చి ప్రసవించిన వారిగతి యేమయియున్నదో, తెలిసికొనియున్నారా? బాల్యమందనగా, పదునాలుగు వర్షములలోపల స్త్రీకి సంభోగము, దూష్యమనియు పదునెనిమిది సంవత్సరములలోపల, పురుషునకు సంభోగము దూష్యమనియు, చెప్పియున్నది. 11-12 సంవత్సరముల పురుషులు స్త్రీలు, యిట్టివయస్సునందే, సంభోగమునకు మొదలిడుచున్నారు యిందుకై దేహపాటవము దప్పి బాల్యమునను, దారుణము మిక్కుటమై చర్ది మొదలగు, రోగాద్యుపద్రవము లుద్భవించి నానాటికి ఆయువు క్షీణించి. స్త్రీపురుషులు దుర్బలులగుచున్నారు "తలితండ్రులు దుర్బలులైనప్పుడు, వారికి జనియించు బిడ్డ, అట్టి దుర్బలత్వముతో గలదియగునని, మున్నుదే గర్భిణీ విధానమునందు, చెప్పియున్నాను. అట్లు బాల్యవివాహములుచేసి కట్టిబొమ్మలు పూర్వాదివారిని జూచి సంతోషించి వారిబలము నానాటికి క్షీణించి. వారిసంతానముకూడా బలరహితమైనది, మనభరతఖండము, ఆయుస్సు మెక్కువగానుండు వారలేకయు క్షీణదశకు వచ్చియున్నది.

(యిందుకు దృష్టాంతము.)

ఒక వృక్షమునుంచి ఫలమును యివ్వవలెనని మనకు కోర్కెయుండిన మొదట యావృక్షము వేయుభూమి సారవంతమై సత్తువగలదిగా యుండవలయును. సత్తువలేని భూమియందు విత్తనము వేసిన మొలకలెత్తవు, ఒకవేళ మొల్చినను బలహీనమై యంతవరకుగా చూచు కొన్నను కాష్యములు మొండై చెసునిలువక చనిపోవును. ఒకవేళ బ్రతికినను మంచిఫలములివ్వకపోవును అట్టిచెట్టునందు పుట్టువిత్తనములు భరల

విత్తినట్లయిన దుర్బలమైన చెట్టుబుట్టి హీనమైన ఫలమునిచ్చు బొత్తిగ విత్తనములేకయే నశించి చెట్టుతాపము లేకయేపోవునుగాన ప్రాయము వచ్చి శరీరదార్ఢ్యము కలిగిన నంతరం వివాహముచేయవలెను.

“అయ్యో” మనమెంత బుద్ధిహీనులు, మనపూర్వపువారలు ఎంత తెలియనివారలు, యీవిషయములను పండితులైనవారలు గమనించి, స్త్రీలు రుతుమతులగుటకుమునుపే వివాహముచేయుట వాండ్లకు యిదిమంచిది యిదిచెడ్డఅని, దెలయుట వరకు నిదానించి యుండవలెను యాచినదాని తలి తండ్రులు మాభారము మేము దెంచుకొంటే చాలును. అను, పిచ్చియూహానువిడచి. వారుస్వతంత్రించివరుని, వప్పుటవరకు, లగ్నముచేయుకుండురనియు నమ్మి, జెప్పియున్నాను. “యిట్లువ్రాయుట అన్యాయమనియు. దూష్యమనియు. పితురాచారము, కాదనియు, స్త్రీపక్షపాతియనియు. నన్ను దూషించక యిచ్చటవ్రాసియుండు విషయములను కన్నులారనుజూచి, సంతోషించి, బాల్యవివాహములువదలి స్త్రీక్షేమాభివృద్ధికి, పాల్పడుదరని, ప్రార్థనచేయుచున్నాను. యికనూమీకు సందేహముండిన మాకు జాబులు వ్రాసినపక్షమున చాలా ధర్మశాస్త్రములు జూపుచున్నాము. యీవిషయమై సందేహపడక వర్తించెదరని నమ్మియున్నాను.

## బాల విధవా వివాహము.

మునుచెప్పినరీతి విరోధమై వర్తించిన బాల్యమునందే. యుక్తవయస్సురాకనే. యిల్లుతెడునా దేమాయను శంకలేగ యుండవలెనది యీకాలమునందు. తూయమాయమ్మ కలవారలుగానున్నారు. లోకములో. అధర్మప్రవాహముచే. ప్లేగు, మారికామ్యవద్రవములు. మెండుగా వ్రబలి జనులను అపమృత్యువు పాలుగా. చేయుచున్నవట. అందరికి అనుభవసిద్ధమే అట్లు తెలిసి తెలిసి బాల్యమునందు వివాహముచేసి

ఘూర్భిన్నదానిపతి అపమృత్యువు నొందబడగ చిన్నది. దిక్కు-దరిదాపు లేక యుండగా, పైకనపరచియుండు విషయములను గ్రహించి, అను మానములేక యీవిషయములు. వకరికొకరు చూచుకొని పదిమంది వకకంఠోక్తిగా, నిలచిననేను చెప్పియుండు అంశములు జారిలోకి వచ్చు చున్నవి. పిమ్మట వకరికొకరు చూచుకొని దేశమందంతటను. వ్యాపించు చున్నది. ఇప్పుడే దేశమంతటను వ్యాపించియున్నది. మనమధ్యరాష్ట్రము నందు మాత్రము, తెలివిలేక, దిక్కు-దోచకాపితురాచారము, పితురా చారము అని అన్యాయముగా జెడిపోవుచున్నారు. ఏమిపితురాచారమో తెలియను పితురాచారమునకు. వ్యతిరేకముగా, నడచుట నిషిద్ధమని,కొం దరంనును, మనము యిపుడు నడచునవన్నియు. నిషిద్ధములుగా వానద్యాః వివాహ ప్రకరణములో జెప్పియుండునీతి ఉపనయన ప్రకరణములో, జెప్పి యుండునీతి, సంధ్యావందన, ఔపాసనాగ్ని కార్యనిత్యనైమిత్తిక కర్త లుజేయువారెవ్వరు ధర్మశాస్త్ర విషయములను దెలసి, ప్రవర్తిం చువారెవ్వరు. నిషిద్ధములగు మనము దినపదార్థములలో కొన్ని విడచియుండు వారెవ్వరు, సముద్రయానము, దూరదేశప్రయాణ ముల, విషయములలో ఆచారములు సరిగా జరుపుచున్నవారలా నల్లీలు మొదలగువాట్లలో నీళ్లుద్రాగక యుందురా, అజాతిబిడ్డతో సమానమగు హొటలు మొదలగువాట్లలో, భుజించక యుందురా, పరనారీసోదరుడై, పరధనముల కాసపడక, ॥యదృచ్ఛలాభసంతుష్టః॥ యంతదొరికితే, అంతలో దృప్తినిజెందుదురా, కోపములేకయుందురా, యివన్నియు, శాస్త్రనిషిద్ధములుగావా, ॥ఇవన్నిటినీ, సరిగా, ప్రవర్తిం చగల, మహాత్ములు వున్నారా. వారికి యీ విషయములు, తెప్పనేల, ॥కలియుగ మహాత్మ్యమును జరుపు, మనకుమాత్రము యీ విషయము ను తెప్పియున్నాను॥ యీలాగు శాస్త్రనిషిద్ధములగు పనులన్నియుజే యుచు, అబలలగు స్త్రీల విషయములో, ధర్మని ర్ధూపణజేయుచున్నా

ము, వారు దిక్కులులేని వత్తులుగానుండిన గదా, మనము యీలాగు జేయుచుండుట, మనకు రెండు, మూడు, నాలుగు, వివాహములు గావచ్చును. స్త్రీలకుగారాదా, స్త్రీలకు వెదాధ్య యనాధికారమున్ను వుపనయమున్ను, వివాహమున్ను, యివన్నియు గావచ్చునని, చెప్పియున్నది పురుషులకెన్ని విషయములలో, ప్రవేశతకలదో, అన్నివిషయములలో స్త్రీలకు, ప్రవేశతకలిగి అట్లుండియు, విధవకు, పునర్వివాహ విషయమై, పురుషులు, మనస్సుకుదెచ్చుకొనక, పురుషపక్ష పాతులమై వాండ్లకుగుల్ల చెల్లుపాలుజేసి సంకటపడునట్లుగా, జేయుచున్నాము అహాహా యంతఅన్యాయము, యంతఅన్యాయము. బాల్యమునందె, వివాహమై, విధవయైన, వనిత, విషయములో, మనువు యీలాగు చెప్పియున్నాడు.

శ్లో॥ కామంతుక్షపయేద్దేహం పుష్పమూలఫలైశ్శుభైః।
నతునామాపిగృహ్ణీయాత్ పత్యౌప్రేతేపరస్యత్ ॥
మృతేభర్తరిసాధ్వీస్త్రీ బ్రంహచర్యేవ్యవస్థితా।
స్వర్గంగచ్ఛత్యపుత్రాపి యథాచేబ్రంహచారిణః॥

కామము బిగబట్టిన దేహముకలదై, శుభమగు పుష్పఫలములను దినునాడి, మరియొక వరుని నామము నైనను, మనస్సున దలంచక, బ్రంహచర్య వ్రతమునునుష్టించిన, పుత్రులు లేనిదైనను, స్వర్గప్రాప్తికలుగునని, మనువు చెప్పియున్నాడుగాని, బ్రంహచర్య వ్రతమునే, అనుష్టించవలెనని, కంఠోక్తిగా చెప్పలేదు. ఈ విషయమందు అనుమానమింతకయు లేక పారాశరలు సహా॥.

నారద॥ శ్లో॥ నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచపతితేపతౌ।
పంచస్వాపత్సునారీణాం పతిరన్యోవిధీయతే॥

పతినష్టుడును అనగా దేశాంతర గతుడును, మృతుడును, సన్యాసియు, నపుంసకుడు, పతితుడును అయిన యీఅయిదాపదలయందును అన్యుడుపతిగా విధింపబడుచున్నాడు.

శ్లో॥ అష్టవర్షాణ్యుదీక్షేత, బ్రాహ్మణీప్రోషితంపతిం।
అప్రసూతాతుచత్వారి, పరతోఽన్యంసమాచరేత్ ॥

నష్టభర్తృకయగు బ్రాహ్మణస్త్రీ పతిని ఎనిమిదేండ్లు యెదురు చూడవలయును, అప్రసూత నాలుగేండ్లు వెనుక నింకొకని నాశ్రయింప వచ్చును.

శ్లో॥ క్షత్రియాషట్సమాస్తిష్ఠే, దప్రసూతాసమాత్రయం।
వైశ్యాప్రసూతాచత్వారిద్వేవర్షేత్వితరావసేత్ ॥

క్షత్రియ స్త్రీ ఆరేండ్లుండవలయును, అప్రసూత మూడేండ్లు ప్రసూతవైశ్య నాలుగేండ్లు అప్రసూత రెండేండ్లు యీనష్టభర్తృకులకు చెప్పినకాలము శూద్రస్త్రీకి చెప్పబడలేదు, బ్రతికియుండిన సమాచారము తెలిసియుండినా యీవిధిద్విగుణమగును అటువెనుక భూత ప్రవృత్తి నిలచిపోయినయెడల అన్యుని వివాహమాడవచ్చును.

శ్లో॥ అతోఽన్యగమనేస్త్రీణాం। యేవదోషోనవిద్యతే।

తేఅ అటువెనుక అన్యునితో సంగమించిన స్త్రీలకు దోషము లేదు అయితే నిర్ణయము రెండేండ్లు మూడేండ్లు అత్యల్పకాలము గావున యీవిధిమాత్రము పునర్వివాహమునకు అనర్హము,

యిట్టివిషయమునకే పునర్వివాహము చెప్పియుండినప్పుడు భర్త మృతుడయిన పునర్వివాహము నిషేధమా, కాదు.

"యస్యయివాచాదత్తాన వివాహమంతరేణాస్యాః పతిరిత్యనేనాహమ్యతే" యవనికొరకు కన్యావాచాదానము చేయబడెనో వాడు వివాహములేకయే దానికి పతియని యీవచనముచేత తెలియపడెనని విజ్ఞా

నేశ్వర భగవత్పాదులవారు వివరించియున్నారు వాగ్దాన మాత్రమున పతియగుటవలన బట్టి అట్టి స్త్రీని వాగ్దానముచేసినవాని కివ్వక మరియొక నికి యిచ్చుటలేదా, యిది పునర్వివాహప్రశంసకాదా (యికను నార దులవారు.)

శ్లో॥ ప్రతిగృహ్యతుయఃకన్యాం, వరోదేశాంతరంవ్రజేత్ ।
త్రీనృతూన్‌సమతిక్రమ్య, కన్యాన్యంవరయేద్వరం ॥

వివాహమాడినవాడు దేశాంతరముపోయిన మూడు ఋతువులు చూచి ఆకన్యయన్యుని వివాహము చేసుకొనవలయును, అని నారదుల వారు జెప్పియుండుటను జూడగా విధవ కతువైన బిమ్మటను వివాహ ము గావచ్చునని సూచింపబడుచున్నది.

“కౌమారా పూర్వవచనే” పాణినీయము 4 వ అధ్యాయము 2 పాదము 13 వ సూత్రము, ఇందులవృత్తి సిద్ధాంతము (కౌమారే త్యవిభక్తికో నిర్దేశః అపూర్వత్వే నిపాత్యమిదం అపూర్వపతిం కుమా రీం పతిరుపపన్నః కౌమారపతిః) అపూర్వపతియయిన (అనగా) అదివరకు పతిలేనటువంటి కుమారిని పొందినపతి కౌమారపతి, స్త్రీలకు కౌమారపతి యనగా ప్రథమపతియొక్కచే ధర్మ్యమైన అపకలయందు నియోగము చేత సంతానముకొఱకు అన్యుడు చెప్పబడియున్నాడు.

శృతి। సోవాంశయుత్రా విధవేవదేవరం,
మర్యంనయోషాకృణుతేసధస్థఆ.
యీరుక్కుపునర్వివాహమును సూచింపబడుచున్నది.

శృతి॥ యదేకస్మి న్యూపేద్వేరశనే పరివ్యయతి ।
తస్మాదేకోద్వేజాయే విందతే ।
యన్నైకాగ్ం రశనాంద్వయోర్యూపయోః
పరివ్యయతి తస్మాన్నైకా ద్వౌపతీవిందతే ॥

యుందుచేత నొకయూపమునకు రెండురశనలను జుట్టుదురో అందుచేత నొకడు ఇద్దరు భార్యలను నేకకాలమందు వివాహము జేసికొనును, యొందుచేత నొకరశను రెండుయూపములకు జుట్టరో అందుచేత నొకతె ఇద్దరు భర్తలను యేకకాలమందు వివాహముజేసికొనదు యీశ్రుతియొక్క అర్థమును బట్టి భిన్నకాలమందు మరియొక భర్తను వివాహముజేసికొనవచ్చునని సూచింపబడు చున్నది.

(అధర్వణవేదము) యాపూర్వంపతిం విత్వా అథాన్యంవిందతే పతిం, పంచౌదనంచ తావజందదా నవియోషితః, సమానలోకోభవతి పునర్భువాపరఃపతిః, యోజనం పంచౌదనం దక్షిణా జ్యోతిమగ్ందదాతి) అజాపంచౌదన దానమువలన పునర్భువు, ధిధిషువును, సమానలోకము నందురని యర్థము ఇది విధవా వివాహమును సూచింపబడుచున్నది.

(వ్యాసులవారు.)

కన్యాన్యస్మయిప్రదాతవ్యా, వాగ్దానేతుకృతేవరే।
మృతేన్యస్మయి ప్రదాతవ్యా మృతేనసప్తపదాత్పురా॥

వాగ్దాన మాత్రమునకు పిమ్మట వరుడు మృతిబొందిన ఆకన్య యన్యుని కీయవలసినది, సప్తపదమునకు ముందు మృతిబొందిన ఆకన్య నన్యుని కీయవలసినది.

(వశిష్ఠులవారు.)

శ్లో॥ పాణిగ్రహే మృతేబాల, కేవలంమంత్ర సంస్కృతా।
సాచెదక్షతయోనిస్యా త్పునస్సంస్కారమర్హతి॥

మంత్ర సంస్కార మాత్రమయిన యక్షతయోనికి మరల సంస్కారమును చేయవచ్చును అని చెప్పియున్నారు.

శాస్త్రప్రదీపమందు.)

శ్లో॥ కన్యాన్యస్మయి ప్రదాతవ్యాత థాసప్తదావత్పురం॥

అనుటవల్ల, సప్తపది అనంతరముకూడా పునర్దానము చేయవచ్చును.

(బ్రహ్మపురాణము.)

శ్లో॥ అశ్వాలంబంగవాలంబం, సన్యాసంపలపైతృకం ।
దేవరేణసుతోత్పత్తిః, కలౌపంచ వివర్జయేత్ ॥

మనుధర్మ శాస్త్రమందు విశేషముగా విధవలు సంతానము కొరకై దేవరునితో సంగమముచేసి సంతానము కలుగజేసుకొనవచ్చును అనిచెప్పియున్నది (బ్రహ్మ) యిది కలియుగమున విరుద్ధమనినారుయిందుచే దేవరునికాక వేరెవానిని విధవ వివాహ మాడవచ్చునని సూచింపబడు చున్నదిగాని కలియుగమందు విధవా వివాహము కూడదని బ్రహ్మపు రాణమందు యచ్చటను చెప్పియుండలేదు మనువు వహాచెప్పియుండ లేదు. ఇంకయు, అనుమానముండిన, విధవయగు స్త్రీ, బ్రంహచర్య వ్రతమునను ష్ఠించితే, సంతానహీనురాలైనను, స్వర్గప్రాప్తిగలుగునని, చెప్పియున్నది.

శ్లో॥ స్మరణం కీర్తనం కేళి ప్రేక్షణం గుహ్యాభాషణం ।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృతిరేవచ ॥

పురుషుని స్మరణచేయకయుండుట, నోటిచేత, పురుషునిరొుక్క చర్యలను ఇతరులచే, అనుకొనకయుండుట, పురుషసంయోగ లేక యుండుట, పురుషుని జూడకయుండుట, రహస్యముగా పురుషునిచే, మాటలాడక యుండుట, నమ్మకముగా, వకనిమీాద మనస్సుచేయక యుండుట పరపురుష సాంగత్యమందు ప్రయత్నము జేయకుండుట, సాంగత్యము చేయుట, మనస్సున వ్యాకులము నొందుట, ఇవేమొదులుగాగలిగిన, (అష్టవిధమై థునాభావాత్ప్రశస్తా, వర్ణిలింగి (బ్రంహచారి) యనబడు చున్నదిగాన. అష్టవిధమైథునములచే, ప్రశస్తమైనదే; బ్రంహచారి యనబడుచున్నది, యిప్పటికాలములో బ్రంహచర్య వ్రతమున నుష్ఠించక

యుండు పవిత్రతంతువులకు నరకప్రాప్తి తప్పునుకదా. యట్లయినను నరకప్రాప్తితప్పదు అని భావనచేసుకొని ఇట్లుప్రవర్తించకూడదా, ఇట్లు ప్రవర్తించుట, యిహలోక సుఖము జరుగును, పరలోక సుఖము నహా, జరుగుననుటకు (పరాశరుల) వాక్యమేకలదు. వుభయ భ్రష్టత్వమునకు పాల్పడక దేహపోషణకలుగ జేస్తుకొనవలయును. అయితే యవరెవరిమతము. యేయేయుగములందు ఉపయోగపరచవలెననగా,

శ్లో॥ కృతేతుమానవాః ప్రోక్తాః త్రేతాయాం గౌతమాస్మృతాః।
ద్వాపరేశంఖలిఖితౌ కలౌపారాశరస్మృతాః॥

కృతయుగమునందు, మనుధర్మశాస్త్రమున్ను, త్రేతాయుగమునందు, గౌతముల ధర్మశాస్త్రమున్ను, ద్వాపరమందు శంఖలిఖితులధర్మశాస్త్రమున్ను, కలియుగమునందు పరాశరుల ధర్మశాస్త్రమునున్ను, అనుసరించి వర్తించవలెనని చెప్పియున్నది. కొన్నివిషయములు, అట్లను చెప్పియున్నారు. ఇట్లను సహా చెప్పియున్నారు. అటుయిటు చెప్పియుండు కారణముచే, మనకిష్టమైన దానియందు, మనము ప్రవర్తించవచ్చును ఈ విషయమై, ఇంకాఅనేక పంక్తులుగలవు. ఇచ్చట గ్రంథవిస్తర భీతిచే, కొన్నిమాత్రము చెప్పియున్నాను. వెలనాడు వారు ములికినాడు, వారు వంగిపురము వారు తెలగాణ్యాం, వారు ఈనలుగురు పరస్పరము ఇచ్చి తీసుకోవడము. చాయవచ్చును. ఈ విషయముగా అనేక పంక్తులు దృష్టాంతములు గలవు. వెలనాడు ములికినాడు, వంగిపురము తెలగాణ్యాం ఈనాలుగు గ్రామములు వకటేస్థలమునందుండినవి యనియు, కాలానుసరణి, ఈనాలుగు తెగలవారు, వారి వారి కిష్టమైన స్థలములయందు వచ్చి చేరియున్నారనియు ఈ నలుగురికి పరస్పర వివాహములు జరుగుచుండెననియు, చాలా, పురాతన గ్రంథములయందు తేటగానున్నది. జగద్గురువులగు శ్రీ శృంగేరి సచ్చిదానంద భారతీ స్వాములవారు 2 సంవత్సరములక్రింద మనభరత ఖండ

నివాసులగు బ్రాహ్మణులకు అనుజ్ఞ యిచ్చియున్నారనివిన్నాను, (యేమన) పంచనాడులవారు (అనగా) వేల్నాడు, ములికినాడు, బడగనాడు, సీర్నాడు వేగినాడు. వీరు పరస్పరవివాహములు జేసుకోవచ్చుననియు, పంచకంబులు, పంచద్రావిడలు, వీరందరు, పరస్పర వివాహములు చేసుకోవచ్చునని అనుజ్ఞ దయచేసినారు. ఈ విషయములు మరికెవ్వరికిని తెలియకనె పరస్పర వివాహకార్యములు జరగడము, అనుచితములని, కొందరు పెద్ద వాదములు, జేయుచున్నారు. ఈ విషయమందు, ఇంచుకైనను సందేహములేక ఈ నాలుగు తెగలవారు, పరస్పర వివాహములు జేసుకొనవచ్చును. ఈవిషయమును గమనించి, ఈనాలుగు తెగలవారు పరస్పర వివాహముచేసుకొని, భరతఖండమును వృద్ధిపరచుటకు ముఖ్యోద్దేశమిదియె, ఇప్పుడు ప్రస్తుతము, బెంగళూరు, మహిసూరు, ఈ ముఖ్యపట్టణములయందు వెలనాడు ములికినాడువారు, పరస్పర వివాహములు, జేసుకొనియున్నారు. ఈ విషయమందు, పరస్పర వివాహములు, జేసుకొనవచ్చునని, నిర్దేశించిన. బ్రం ॥శ్రీ॥ మద్దగిరి, స్కూల్ హెడ్‌మాస్టరుగారగు వేదాధ్యయన సంపన్నులైన, సమస్తభాషల యందు పురాణేతిహాసములను ప్రవర్తించు, మహానుభావులైన భూలోకమునందు, గొప్పకీర్తి సరస్వతియని కీర్తివహించి యుండునట్టి, శ్యామశాస్త్రులవారికి, వ్రాసి తెలుసుకొనవచ్చును. ఈ విషయమున ఇంచుకైనను సందేహములేక, నమ్మకముగా, ఈనాలుగు తెగలవారు ఈ పంచనాడులవారు పరస్పర వివాహములుచేసుకొనవచ్చునని, వారి యభిప్రాయముగలదు. భరతఖండనివాసులగు, ఓ భ్రాతలారా ముందునేను చెప్పియుండు బాల్యవివాహము. వితంతు వివాహము, క్రింద కనువరచియుండు వారికి పరస్పర వివాహములు. మొదలైనవి, చూచి, అందలి విషయములను గ్రహించి యివిదూష్యములని యెంచక, దేశాభివృద్ధికొరకు, పాటుపడుమరని, మిక్కిలి విధేయుడై, ప్రార్థ

నాస్వాతంత్ర్యకముగా జెప్పియున్నాను. దేశము గోవుల ధర్మశాస్త్రము లంతయు వకటేకదా, యీదేశమునకు వేరు ఆదేశమునకు వేరు కలదా, ఈరీతి వచనములు జెప్పియుండుట చూడ, వకరుపి వివాహము కాకమునుపే రుతుమతి అయి దురాచారము నడచుచుండిన స్త్రీనిచూచి అతనికి సహింపులేక అది దూష్యమని అతడు చెప్పివుండవచ్చు, మరి వకరుపి సహింపుకలిగి అతడు అట్లు చెప్పివుండవచ్చునని యోచించవచ్చును గదా. యిదిగాక పూర్వమందలి మనపెద్దలు ధప్పము గుడ్డలు గప్పుచు గట్టుచు. మంటిపాత్రలలో వంటజేయుచుండిరి యిపుడు అవిపోయి మంచిబట్టలు వచ్చినవి మంచిపాత్రలు వచ్చినవి అలాగుననే పితురాచారమని వాట్లనె మనము అనుభవింపరాదా పితృవులు ఆచరించుచుండిన విషయములన్నియు మనము పునహా వారిలోకి దెచ్చినట్టయిన మన పిదితురాచారమె అదికాక స్త్రీలయందుమాత్రము పితురాచారము మాయందులేదా దేశమందంతటను వకటేశాస్త్రము వుండగా దేశములో యన్నివిషయములు మారినవి మనకుమాత్రము బుద్ధితక్కువవారై వర్తించుచున్నాము. అట్లు వర్తించక బాల్యవివాహము విడచి, రుతుమతి వివాహములు బాల విధవావివాహములు జేయుచు ఐకమత్యము కలిగి దేశాభివృద్ధికై పాటుపడుచుండవలెను బాల్యవివాహముజేయక రుతుమతి వివాహముజేసిన సంతరం విధవరాలైన వనితకు పునర్వివాహము జేయకూడదు బాల్యమందు వివాహమై రుతుమతికాకముందు బతి చనిపోయినను రుతుమతియైన బిమ్మటను పతి సంభోగములేని ముందు బతి జనిపోయినను పునర్వివాహముగావచ్చును. పతిసంభోగానంతరం పునర్వివాహము దూష్యము మంటియందు అను పిల్లలకు బతి చనిపోయిన పునర్వివాహముజేసి సత్కులమునందు పనిబాటులకు ;గలుపుటకు యిష్టములేనియెడల ఆ తెగను వేరె వుంచవచ్చును భోజన ప్రతిభోజనములు గావచ్చును అది సహా వారివారి యిష్టానుసరణి గావచ్చునుయీలాగునవర్ణాలుగమనించిప్రవర్తించవలెను.

## పురుషవిద్యా.

స్త్రీలువిద్య నేర్చిన పురుషులను విద్యాహీనులని, దూషించుచు న్నారని చెప్పియున్నాను. యీ కారణమునుబట్టి పురుషులు విద్యను చక్కగా అభ్యసించవలనే కాని స్త్రీలు కొంచెముగా విద్య నేర్వవలెను,

శ్లో॥ విద్యానామనరస్యరూపమధికం ప్రచ్ఛన్నగుప్తంధనం ।
విద్యాభోగకరీయశస్సుఖకరీవిద్యాగురూణాంగురుః ।
విద్యాబంధుజనోవిదేశగమనేవిద్యాపరాదేవతా ।
విద్యారాజసుపూజ్యతేనహిధనం విద్యావిహీనఃపశుః ॥

విద్యపురుషునికి మంచిరూపమునిచ్చును రహస్యముగాదాచిన ధనముగాను, భోగము నిచ్చునదిగాను, మంచికీర్తియుతునిగా జేయు దగినదిగాను, మంచిసుఖమును జేయదగినదిగాను, సమస్తమైన వారిని శిష్యులనుగా జేయదగినదిగాను, దేశమందరిని బంధువులనుగా జేయద గినదిగాను, సమస్తదేశములను జూపించునదిగానున్న ముఖ్యమైన దేవత సహాయముగా నుండినట్లుండును. రాజులచేత సహాపూజింపబడును. ఎంతధనము వుండినను ప్రయోజనము లేదు, విద్యలేనివాడు పశువుతో సమానము.

గీ॥ త॥ విద్యయొసగును వినయంబువినయమునను ।
బడయుపాత్రత పాత్రతవలన ధనము ।
ధనమువలనను ధర్మంబుదానివలన ।
నైహికాముష్మిక సుఖంబులందునరుడు ॥

విద్యనేర్చిన వినయముకలుగును, వినయముచే, యితరులచేత మెప్పించుకొనుటకు శక్తుడగును. యిప్పించుకొనుట శక్తుడగు కారణ మున, ధనముకలుగును, అధనముచే, ధర్మబుద్ధి పుట్టును. ధర్మబుద్ధిచే, యిహలోక పరలోకసుఖములు పొందగలడు,

శ్లో॥ రూపయవ్వనసంపన్న విశాలకులసంభవః ।
విద్యాహీనానశోభంతే పాలాశకుసుమంయథా ॥

మంచిరూపవంతుడైనప్పటికిని, యవ్వన ధనవంతుడైనను, మంచి కులమందు జన్మించినను, మోదుగ పుష్పమువలనే, విద్యలేనివాడు ప్రకాశించడు.

శ్లో॥ ఏబాలభావేనపఠంతివిద్యా కామాతురాయవ్వననష్టచిత్తాః ।
తేవృద్ధభావేపరిభూయమాన దహంతిగాత్రంశిశిరేయథాబ్జం ॥

బాల్యములో యవ్వడు విద్యనేర్వక పోవుననూ, యవ్వనమునందు కామాతురముచే, మనస్సు చపలమైనవారలై, వర్తించుచున్నారు, వృద్ధత్వమున మంచి సభలకుపోయిన ద్రోప్పించుకొనినవారలై, అప్పటిలో బాల్యమందు విద్యనేర్వక పోతినే, కుంతికాయి అయితినే దైవమా నాయొక్క జన్మకీర్తికి కారణముకాకపోయనే, అని హృదయము కుల్లుచున్నది, కాబట్టి హే మిత్రులారా, విద్యతో సమానమైనది. యావదిలేదు, సర్వప్రయత్నములలో, విద్యయే ముఖ్యకారణము.

శ్లో॥ మాతేవరక్షతిపితేవ హితంనియుంక్తే ।
కాంతేవచాభి రమతిత్యపనీయ్యఖేదం ।
కీర్తించదిక్షువితనోతి తనోతిలక్ష్మీం ।
కింకింనసాధయతి కల్పలతేవవిద్య ॥

విద్య తల్లివలెను సంరక్షణ చేయుచున్నది. తండ్రివలనే, హితమును బోధించుచున్నది. భార్యవలనే, సుఖము నిచ్చుచున్నది, ఖేదమును బాపుచున్నది, దిక్కులయందు, కీర్తిని ప్రచురము చేయుచున్నది. లక్ష్మిని యిచ్చుచున్నది, యేమిటినికాని అసాధ్యముగా చేయును, అన్నిటిని సాధ్యముగా చేయును కల్పలతతో సమానమైన, విద్యను సాధింపవలెను.

శ్లో॥ గాంధర్వంగుణవలీవిద్యా సముదేవినయంవినా ।
మాఖార్జవమదేభూయా స్మహాత్మవినయాన్వితా ॥

హెచ్చైనగుణము కలిగినవిద్య, వినయములేకున్న ప్రకాశిం చదు విద్య ఉండినవానివద్ద వినయముండిన, అందరివద్దను శోభించ బడును, గాన విద్యయే, ధనమునకు ముఖ్యకారణము ధనముచేతనే, సర్వకార్యములు జయప్రద, మగును.

## ధనము దానిచెడుపు.

శ్లో॥ ప్రకాశయత్యహంకారం ప్రవర్తయతితస్కరాన్ ।
ప్రోత్సాహతిదాయాదాన్ లక్ష్మీఃకించిదుపస్థితాః ॥

సిరికొంచెము వచ్చినదై, అహంకారమును పెంపుజేయును, దొం గలును రప్పించును, జ్ఞాతులను, ప్రోత్సాహపరచును.

శ్లో॥ శృణ్వంతివవపృచ్ఛంతి పశ్యంతోపినజానతే ।
విడంబనానిధనికాః స్తోత్రాణీత్యేవమన్వతే ॥

ధనవంతులు విన్నదానినే అదియేమని యడుగుచుందురు కని యుం తెలిసికొన జాలకుందురు. తమనుయితరులు, పరిహాస్యజేయుచుండిన ను, స్తోత్రము జేయుచున్నారని, తలంచుచుందురు, ధనమురాగానే వివే కము పోవునని యభిప్రాయము.

శ్లో॥ తృణమాత్రంగ్రహావేశో యామమాత్రంసురామదః ।
లక్ష్మీమదస్తుమాఖారా మాదేహమనువర్తతే ॥

గ్రహముయొక్క ఆవేశము తృణమాత్రమై యుండును, కల్లు యొక్క మదము, జాముసేపుమాత్రము యుండునుగాని, మూఢులకు, సిరివలన గలిగిన మదమైననూ, దేహముండువరకు నివర్తింపనేరదు గాన ధనము వుండినపుడు, పొగుడుచేత లోభిగానుండక దానధర్మ పరోపకా

రములు శేయుచు ప్రవర్తించవలెను, లోభివిషయము కొంచెముగా ముం దుజెప్పియున్నాను. ఇచ్చటను జెప్పబోవుచున్నాను.

లోభి.

శ్లో॥ కుపోష్యోపవాసోధర్మేషు భైషజ్యేషుచలంఘనం ।
జపయజ్ఞశ్చయజ్ఞేషురోచతే లోభశాలినాం ॥

లుబ్ధులకు సకలవ్రతములలో కటిక యుపవాసముండు వ్రతమే శ్రేష్టము, సకలచికిత్సలలో, లంఘనమే పరమౌషధము, సకల యజ్ఞ ములలో, జపయజ్ఞము. సర్వోత్తమమని, దోచుచుండును. ఇంచుచే, లుబ్ధాగ్రేసర. చక్రవర్తులకు, అన్నివిషయముల, ధర్మము బోవునవేవి యు సరిపడవు.

శ్లో॥ కింవక్ష్యతీతిధనికా ద్యావమద్విజతేమనః ।
కింప్రవక్ష్యతీతిలుబ్ధోపి తావదుద్విజతేతతః ॥

ధనములేనివాడు ధనమడుగుటకై, ధనవంతుని యింటికివచ్చి, అడిగిన నేమనునోయని, భయపడుచుండును, వీనిని చూచిన, ధనికుడును, వీడేమడుగునో యని, భయపడుచునే యుండును. లోభి ధనము విడుచు టకు, ప్రాణము విడుచువానివలె, భయపడుచుండును.

శ్లో॥ సర్వమాతిథ్యశాస్త్రార్థం సాధవశ్చక్రుర్వంతిలోభినః ।
భిక్షాకబళమేకైకం పశ్యంతిమేరువత్ ॥

అతిథికి పెట్టు పెక్కకబళము మేరుపర్వతముతో సమానమని, శాస్త్రములందు జెప్పబడియున్నది. లుబ్ధులు పక్కకబళమును మేరుప ర్వతము సమానముగా జూచి, భిక్షము పెట్టజాలకుండుటచేగాన, యాశా స్త్రార్థము వీరికి ప్రత్యక్షముగా గనబడుచున్నది.

శ్లో॥ లుబ్ధానాంయాచకశ్శత్రు శ్చోరాణాంచంద్రమారిపుః ।
జారస్త్రీణాంపతిశ్శత్రుః మూర్ఖాణాంబోధకోరిపుః ॥

లుబ్ధుడు యాచకుని శత్రువుగాచూచును, దొంగలు చంద్రుని శత్రువుగాచూతురు. జారస్త్రీ పతిని శత్రువుగాచూచును, మూర్ఖులు బోధచేయువానిని, శత్రువుగాజూతురు. ధనమువుండి, లోభియైన వానికి లేకా, ధనముకలవానికే, సంపద్రోగమను, వకరోగముకలదు.

శ్లో॥ వికృతయతిగాత్రయష్టిం వాచంమూకయతి నయనమంధయతి।
బధిరయతికర్ణకుహరం సంపద్రోగోయమద్భుతంజగతి॥

సంపత్తుకలవాడు, వికారముగా చేష్టలుజేయుచు, దేహమును యేదో వకరీతిగా, కదలించుచుండును. యవరైననువచ్చి మాట్లాడించిన తటాలున మాటలాడక యేదోవక విధమైన, మదముచేత, మాటలాడక మూగివానివలె వుండును. యన్నిమారులుచూచిన మనుష్యులనైనను యేదోవక విధమైన గర్వముచే, యన్నడో నిన్నుచూచినట్లుండెనని చెప్పును. చెవటివానివలే, విన్నదానినే తిరిగి యేమనియడుగును, గాన సంపద్రోగములచే యుక్తమైన, వారల చెంతకుబోయి, యాచించుట మహానీచపు పనికదా.

## యాచ్ఞాదూషణ.

శ్లో॥ దీనాదీనముఖైస్సదైవ శిశుకై రాకృష్టజీర్ణాంబరా।
క్రోశద్భిక్షుధితై ర్నిరన్నవిధురా దృశ్యానచేద్గేహినీ।
యాచ్ఞాభంగభయేనగద్గదగళ త్రుట్యద్విలీనాక్షరం।
కోదేహీతివదేత్ స్వదగ్ధ జఠర స్యార్థే మనస్వీపుమాన్॥

దరిద్రులగుటచేత, దీనమైనముఖము గలవారలై, అకలిచేత, బాధింపబడుచు రోధనముచేయుచున్న బాలురచేత, లాగబడుచున్న, వస్త్రముకలదియును, (అనగా) "అమ్మా అన్నమే అమ్మా పొప్పలే" అనునట్టి బిడ్డలతోగూడుకొనిన, భార్యయందు, ప్రియముచే లోకములో ధీరుడైన యేపురుషుడు, పొట్టకొరకై యాచించినయడల, వ్యర్థ

మైపోవునేమోయను భీతిచేత, భిన్నభిన్నములై, మధ్యమధ్య నిలిచి పోవుచున్నవియును, అయిన యుత్తరములు కలుగునట్లుగా, దీనుడై అయ్యానాకు యేమైనా సహాయము చేయుమని యాలయకుగును, అడు గకుండుటయే మంచిదైనందువల్ల,—

శ్లో॥ ఉత్తమామానమిచ్ఛంతి ధనమానౌహిమధ్యమాః ।
అధమాధనమిచ్ఛంతి మానోహిమహతాంధనం ॥

ఉత్తములు గౌరవమును గోరుదురు మధ్యములు, గౌరవమును ధనమును గోరుదురు. అధములు ధనమునే గోరుదురు. ఉత్తములకు, గౌరవమే ధనముకదా. (అయితే) మనమిట్లు చెప్పుటవలన ప్రయోజన మేమి.

శ్లో॥ నబంధుమధ్యే ధనహీనజీవనం ॥

బంధువులమధ్య నిర్ధనుడై బ్రతుకియుండుట, శ్రేష్ఠమైనదికాదు, అయినను.

శ్లో॥ త్యజంత్యసూన్ శర్మచమానినోవరం ।
త్యజంతినత్వేక మయాచిత వ్రతం ॥

మానవంతులు, ప్రాణమైనను విడుచుచున్నారుగాని అయాచిత వ్రతమును విడువరు. పైనచెప్పినవారలు బంధువులనైనను యాచించు దురు. వారికి యీప్రమాణములు చెడ్డవేకదా. చెడ్డవైనను వారిస్వభా వము పోవునా.

శ్లో॥ స్వభావాశ్రాయాత్కృశోయస్య నజహాతికదాచన।
అంగారశ్శతధౌతేన మలినత్వంనముంచతి ॥

“ఇతి చాణిక్యధృతం” యెవ్వడు వానిస్వభావమెట్టిదో దానిని విడవను బొగ్గునూరు పర్యాయములు కడిగినను వానినలుపు పో వదు.

శ్లో॥ అర్థాతురాణాం నగురుర్న బంధుః ।

ధనార్జనము జేయువారికి గురువుబంధువని, దెలియక యాచింతురు అటుయాచించి కూడబెట్టిన.

శ్లో॥ అర్థానామార్జమనేదుఃఖం ఆర్జితానాంచరక్షణే ।
నాశేదుఃఖంవ్యయేదుఃఖం కిమర్థందుఃఖభాజనం ॥

ధనము సంపాదించునప్పుడు దుఃఖము సంపాదించిన, కాపాడునప్పుడు దుఃఖము, అదిపోయినయడల దుఃఖము, కర్చగునప్పుడు దుఃఖము, యిట్టి దుఃఖమునకు పాలగుటయేటికి, అనిన ధనమువలదనుటకాదు. ధనము వుండుట మంచిదే.

శ్లో॥ మాతానిందతినాభినందతిపితా భ్రాతానసంభాషతే ।
భృత్యఃకుప్యతినానుగచ్ఛతిసుతః కాంతాచనాలింగతి ।
అర్థప్రార్థనశంకయానకురుతే ప్యాలాపమాత్రం సుహృత్ ।
తస్మాదర్థముపార్జయశ్రుణుసఖే చార్థేనసర్వేవశాః ॥

"ధనము" చేత లేనివానిని, తల్లిదిట్టును, తండ్రి సంతోషించదు సోదరుడు మాటాడడు సేవకుడు కోపగించును. కొడుకు వెంటరాడు భార్య కౌగిలించుకోదు, స్నేహితుడు డబ్బడుగననే యూహతో, కండ్లకగపడడు, కావున నామాటవిని, "యోమిత్రులారా" ధనము సంపాదింపుడు, ధనముచేతనే యల్లవారలు, వశులవుదురు, లోకములో దరిద్రుడైనను కష్టమే, ధనవంతుడైనను కష్టమే, యని కదా చెప్పియుండునది, ధనవంతుడైనప్పటిలో, లోభిగానుంటేనే కష్టము, లోభిగాలేక దాతయైయుండిన కష్టము లెంచుకుగలుగును, దాతృత్వముచే కష్టములన్నియు జారిపోవును, అందరు బంధువులే, అందరు దగ్గరవచ్చువారలే, రాజాధిరాజునైనను వశ్యము జేసుకొనవచ్చును, యిచ్చటలో యింకొకటి వున్నది.

## దత్తాపహారము.

శ్లో॥ అవదత్త కురుతే వదత్త కురుతే వదన్న పినకురుతే।
ఉత్తమ మధ్యమ నీచాః పనసాంమ్రముఃపాటలీవృక్షాః॥

చెప్పకనేయిచ్చువాడు, చెప్పియిచ్చువాడు, చెప్పియివ్వనివాడు, ఉత్తమ, మధ్యమ, నీచులనియు, పనస, మామిడి, దాసాన, చెట్లతో సమానులనియు చెప్పుదురు "అవియట్లులనగా" రుతువాసన్నమైనతో డనే పనసచెట్టు, పుష్పమువేయకనే, కాయకాచును, చప్పకయిచ్చు వాడు పనసచెట్టుతో సమానమని చెప్పుదురు. మామిడిచెట్టు, రుతు వాసన్నమవుతూనే పుష్పమువిడచి కాయకాచును. చెప్పియిచ్చువాడు, మామిడిచెట్టుతో సమానమని చెప్పుదురు. దాసానపుచెట్టు, పుష్పము విడచి, చూచుటకు అందముగా నుండును. అదియెప్పుడు వుదిరిపోవు నో, యెవ్వరికిని తెలియకనే, వుదురిపోవునుగదా, చెప్పినను యివ్వ నివాడు దాసాన చెట్టుతో సమానమని, చెప్పుదురుగాన, నిర్భాగ్యులైన నీచులు, యిస్తామని, ఆశను కల్పనచేశి,యివ్వకుందురు. యిది యట్టిక్రూర కార్యమో యోచించుడి, (ఇదిగాక) యిచ్చినదానిని వెనకకు దీసుకోవడ ము, మాటయిచ్చి తప్పడము. మహారౌరవాది, నరకమనిశాస్త్రమునందు చెప్పబడియున్నది, (యితిహాసము) వైకుంఠవాసుడగు, నారాయణుండు లోకకంటకులగు రావణ కుంభకర్ణులవధార్థమై దశరథ రాజుగర్భంబున కోటిసూర్య ప్రకాశమానుడై, సంపూర్ణాంశచేత జన్మించి తాటకిని వధి యించి, అహల్యాశాప విమోచనంబుచేసి, సుబాహునిహావసది, విశ్వా మిత్ర యాగంబుగాచి, మునులకు మోదంబుబుట్టించి, హరవిల్లువిరచి, సీతను పెండ్లియాడి, పరశురాముని భంగపరచి, అయోధ్యప్రవేశించి. తండ్రియాజ్ఞచే, భార్యాతమ్మునియుతుడై, దండకారణ్యంబు ప్రవేశించి మునులకు దర్శనంబిచ్చి తమ్మునిచే, శూర్పణఖముక్కు చెవులుగోయించి ఖరదూషణ త్రిశిరాది రాక్షసుల సంహరించి లోకకంటకుడగు రావణు,

చే, భూజాత అపహరింపబడినదికాగ, మాయామృగమను మారీచుని సంహరించి, సీతను వెదకుచు, జటాయువునకు అగ్నిసంస్కారముగావించి, శబరికి కైవల్యపదవినొసగి, సుగ్రీవునిచే సఖ్యంబుగావించి, వాలిని వధియించి, సుగ్రీవునకు కిష్కింధ రాజ్యపట్టాభిషిక్తముజేశి, ఆంజనేయులచే, సీతక్షేమమరశి, డెబ్బదిరెండు వెల్లువల కపిసైన్యముచే, దండువెడలి. వారిధిగట్టించి. మేఘనాథ, కుంభకర్ణ. అతికాయ, మహాకాయ, మహోదర, మహాపార్శ్వ విరూపాక్ష, అకంపన, రక్తాక్ష, హరినాక్ష, రావణుడే మొదలుగాగలగిన, సంఖ్యకు మిక్కుటమైన, మూలబలమును రావణుని వధియించి, సీత అగ్ని ప్రవేశంబు చేశినపిదప సీతతోగూడి. విభీషణసుగ్రీవ, ఆంజనేయ, జాంబవ, దంగద, నల, నీల, మైంద, ద్వివిద, శరభ, రుషభ, కేసరి, గవాక్ష, హరిరంభ, సుషేణ, గజ, గవయులతో గూడుకొన్నవాడై, రామచంద్రుండు, లంకాపట్టణమును, జూడవలెనను వుద్దేశముతో, పూర్వద్వారమున, మొదట కోట.—

శ్లో॥ శతయోజనవిస్తీర్ణం త్రింశద్యోజనమాయతం।
అష్టద్వారంపురీంలంకాం॥

అనునట్టి విస్తీర్ణముగల యిట్టి లంకాపట్టణముయొక్క మొదటి కోట పూర్వద్వారమును, ప్రవేశించిన వాడుకాగా. పూర్వద్వారముననే రావణాసురుడు, పౌర్ణమియందు పండువెన్నెలలో, సురకామినులతో, సురతదేల్చు వజ్ర, వైడూర్య, మాణిక్య, గోమేధికంబులచే, చెక్కబడియుండు. పుష్యరాగశిలనుజూచి, శ్రీరామచంద్రుండు, తనమనస్సున నిట్లని దలంచె, "యహాహా" ఇదియంతరమ్యంబు, దీని చూచినమాత్రముననే, జాలువాభాష్మవలె నామనస్సు దీనియందు ఆవరింపబడియున్నది, పూర్వద్వారముననే, యిట్టి రమ్యమగు వస్తువునుజూచి తినియికలంకయంతయూ జూచిన పట్టణమును విడిచిపోవ బుద్ధిపుట్టుచున్నదో, లేదో, యీపుష్యరాగ శిలను దీపించుకొనిపోయి అ

యోధ్యాపట్టణ పూర్వద్వారమందుంచిన, యంతకాళాయమానముగా నుండునని దలంచుచుండగా చిరంజీవియయి బహుకాలము వాడగు జాంబవంతుండు. శ్రీరాములు మనస్సున దలంచినది. తెలుసుకొన్నవాడై, వేగిర, శ్రీరాములను సమీపించి, శ్రీరాముల యెదుటనిలచి, చేతులు జోడించుకొని, యిట్లనుచున్నాడు. శ్రీరామచంద్రా, తాము యీలాగు యోచనచేయుట యుక్తమా.

శ్లో॥ ఇంద్రందృష్ట్వాత్ర మయంథ పూర్వజలధింపంచాననంపద్మజం।
శైలాన్పక్షయుతాన్ హయానపితథా లక్ష్మీపతింపింగళం।
వార్ధింశుద్ధజలం శివంశితిగళం కామంచసద్విగ్రహం।
జానేసర్వమిదం రఘూద్వహపతే దత్తాపహారంవినా॥

ఇంద్రునకు రెండుకండ్లు వుండగా జూచియుంటిని యిప్పుడు వెయ్యికండ్లు కలవాడుగానున్నాడు. బ్రంహకు అయిదు ముఖములుండగా చూచియుంటిని, యిప్పుడు నాల్గుముఖములై సముద్రమును దరువక ముందు జూచియుంటిని, సముద్రమును దరచియున్నారు, కొండలకు, గుఱ్ఱములకు రెక్కలువుండగా చూచియుంటిని, యిప్పుడు లేవు, లక్ష్మీపతియగు నీవు పచ్చనైన వన్నెగా నుండినప్పుడు చూచియుంటిని, యిప్పుడు పచ్చనైన శరీరము గలవాడుగానున్నావు. సముద్రమందుదకము మంచినీళ్లుగానుండ జూచియుంటిని, యిప్పుడు క్షారోదకముగా నున్నది. పరమేశ్వరుని కంఠము తెల్లగానుండ చూచియుంటిని, యిప్పుడు నల్లగానున్నది, మన్మథుడు మనుష్యునివలనే, సద్విగ్రహముగా నుండడము చూచియుంటిని, యిప్పుడు మన్మథుడు ఆకార రహితుడై నాడు రామచంద్రా, యివన్నియు నేను చూచినాను. యిచ్చిన దానిని వెనక్కు తీసుకొను పటువంటివానిని, మాటయిచ్చి లేదు అనువానిని, నేనుగానను మహాత్మా, తాము సముద్రంగట్టునన్నే, విభీషణునికి. లంకా రాజ్యము పట్టాభిషేకమును జేసి, లంకను విభీషున కొసంగియున్నారు.

అతనికి తాము దారబోసినట్టుగా లేదా లంకలోనున్నవన్నియు, అతని విగావా, తాము పునహా వెనుకకుతీసుకోవలెనని యోచించడము. మంచిదిగాదు రవరవాది నరకములకు కారణముగదా, తాము యీలాగు యోచించకూడదని చెప్పగా శ్రీరాములవారు లంకాపట్టణముకో ప్రవేశము జాయకనే, వెనక్కు వెళ్ళిరని, మన గ్రంధములలో జెప్పియున్నది, గాన యిచ్చిన దానిని వెనక్కుతీసుకోక ఆడినమాట తప్పక, సజ్జన సహవాసముజేయుచు, దుర్మార్గులలో సహవాసముచేయక యుండవలెను సజ్జనులగు మిత్రులు మంచిసమయమునకు బనికివచ్చుచుందురు.

## మిత్రతత్వము.

శ్లో॥ వాగ్వాదశ్చార్థసంబంధః పరోక్షేదారభాషణం।
యత్రమిత్రత్వ మిచ్ఛంతి తత్రత్రీణినకారయేత్ ॥

మిత్రతత్వముంచుచోట మూడు విషయములు, విడవవలయునని జెప్పియున్నది. వాగ్వాదము చేయరాదనియు, లావాదేవి చేయరాదనియు, మిత్రులులేని సమయమందు, మిత్రునిభార్యతో, మాటలాడుచుండరాదనియు, జెప్పియున్నది "హెసోదరులార" మిత్రతత్వ ముండుచోట, యీ మూతుజాబులు విడిచిపెట్టుడి. యిది విడువక మిత్రుల యొక్క భార్యలతో సహవాసముజేయుట యంతక్రూరకార్యమో. యన్నిపాపములకు మూలమో యోచించుడి, అయితే యీవిషయము. కొందరు స్త్రీలు గమనించరు, నాభర్తకు యితడు మిత్రుడే, నేను యితనిని మోహించితే, వారిద్దరికి తవ్వ్యాజములుబుట్టునే, అనియోచించరు. మీరైనను యీవిషయమును గ్రహించి, వర్తించుడి. యిదియునుగాక, కొందరి పద్ధతులును జెప్పుచున్నాను. వొకడు దరిద్రుడు, వానికి మంచిరూపవంతురాలగు భార్యగలదు. వానికి అందరు మిత్రులే, అందరు సహాయము చేయువారలే.

శ్లో॥ శూరాశ్చ కృతావిద్యాశ్చ రూపవత్యశ్చ యోషితః।
యత్రయత్ర గమిష్యంతి తత్రతత్రకృతాదరాః॥

శూరులైనవారలు, విద్యనేర్చినవారలు రూపవంతులగు స్త్రీలు యచ్చటికి బోయినను సన్మానింపబడుదురు. రూపవంతురాలగు, అతని భార్యకొరకై, అతికామముచే, అధిస్నేహితుఁడుగా నుందురు.

శ్లో॥ అతిదానాద్ధతఃకర్ణః అతిలోభాత్సుయోధనః।
అతికామాశద్ధగ్రీవః అతి సర్వత్రవర్జయేత్॥

అతియగు దానముచే, కర్ణుఁడుచనిపోయెను, అతిలోభముచే, దుర్యోధనుఁడు నాశమొందెను. అతికామముచే రావణుఁడు మృతినొందెను. కాబట్టి, యీలాగు తెలియక, అతిగా అతనితో స్నేహితము. ఆమెయందు అతికామము కలిగి, కన్నుమిన్ను తెలియక స్నేహితము చేయుచున్నాఁడు. అట్టిసమయములో, యావనితపతివ్రత భావమువహించి యుండవలసినది ముఖ్యాంశము.

## ✦ స్త్రీ ధైర్యము. ✦

శ్లో॥ అశక్తస్తస్కరస్సాధుః కురూపాచేత్ పతివ్రతా।
రోగీచదేవతాభక్తోవృద్ధా వేశ్యాతపస్వినీ॥

శక్తిలేని దొంగ యోగ్యుఁడు, కురూపముగల స్త్రీ పతివ్రత రోగముగలవాఁడు దైవభక్తుఁడు, ముసలిభోగముది తపశ్శాలిగా నుందురు. రూపువంతురాలగు స్త్రీ పతివ్రతగానుండడము ముఖ్యముకదా, "లజ్జాస్త్రీభూషణం" యామె సిగ్గుఅనే భూషణముచే, అలంకరింపబడినదై మొగునికి స్నేహితులైనవారితో మాట్లాడక, మాట్లాడినను ఎంతయో, అంతియే అట్లుఉండక విశేషముగా మాట్లాడుటచే, యాకామపురుషుఁడు, అనుకొనుచున్నాఁడు, నాయందు చాలాఅనురాగము కలిగియున్నది, నాతో బాగమాట్లాడుచున్నది, అనుకొనుచు మరింత మాటి మాటికి ఇంటికి రావడమున్ను, యామెను తను పైగమొదలు

గాకల సైగలు చేయడమున్ను, యీలాగు వర్తించుచుంటున్నారు. అప్పటిలో యీపతివ్రత యీవిషయములు మనస్సునకు వచ్చినదై, చాలా వ్యసనపడుటకు కారణమాయె, చూచితిరా పేతల్లులారా హేసోదరీమణులారా, మీరు పాతివ్రతలక్షణములను తెలిసికొని, పతిని యెల్లప్పుడు మనస్సున ధ్యానించుచు యుండుడి, పరపురుషుడు యెవడైనా, నీపతి ఉన్నాడా అని ఏకవచనముగా, అడిగిన, ఉన్నాడప్పా, లేడప్పా అని చెప్పండి. అప్పుడు, దురుద్దేశముతో వాడు వచ్చినను, గర్వభంగమగుచున్నది లేక మీరునహా అట్లనే మాట్లాడిన, వానికి మరింత ప్రోత్సాహము యిచ్చినట్లగుచున్నది. వాడు పోకిరి మాటలేకాని కనుసైగలేకాని, చేసిన యింకాచూతాము అని ఉంచవద్దండి తక్షణమే ముఖముమీద కొట్టండి, అప్పుడే ముఖముమీదగొట్టి నట్లయిన పురుషునకి ధైర్యముచెడును. లేక చూతామని ఉంచిన రాగా రాగా.

చ॥ ముదితనుచూచి మోహముసమోముగ మోమునుగూర్పనెంచుచున్ ।
కదసినవేళ గీటను కంతునిరంతుల దేల్పనెంచుచున్ ।
సదితరనీలవేణులకు తన్మృదులీలలు పన్యసించుచున్ ।
మదవతిపై నిరంతరము మాననిప్రేమము దాల్చునంతిలన్ ॥

యిట్లుమోహము మిక్కుటమయి పురుషునికి ధైర్యముజాస్తీ అగును ధైర్యముజాస్తీ అయినపిమ్మట. మీరు ముఖముమీద గొట్టినను వాడు యేమికూశినా కూయుచున్నాడు. మగవాండ్లు వదిజనము ఉండుచోటికి బోకండి, శృంగారనాటకములు చూచుటకు బోకండి, శృంగారగ్రంధములను జదువక పతివ్రత చరిత్రలే, జదువుచు ప్రతిదినమును తులశిపూజను జేయుచు, మీసామ్మును మీపతి అపహరించి, పాడుచేసినను. మిమ్ము గొట్టిదిట్టినను యెట్టి కురూపవంతుడైనను, యెంత బుద్ధిహీనుడైనను. అతనిని దిరస్కరించక అతని కనుగుణ్యముగా నడచుకొన్నను. వచ్చిన అతిథి అభ్యాగతులను ఆదరించి అన్నముబెట్టుచు

పతి అనుజ్ఞనుమీరక పతికి యిష్టురాలయి పతిసేవజేయుచు, పతివ్రతలై వర్తించవలెను "సోదరీమణులారా" మీకు మరియొకవిషయమును భోధించుచున్నాను, మీపతి ఉండినను లేకుండినను, మధ్యాహ్నకాలమునకు ఆకలిచే, పీడింపబడుచు యెవరువచ్చినను, మాయింటిలో అయ్యేదిలేదని, చెప్పవద్దండి. ఒకవేళ మీపతి యింటియందుండి, వచ్చినవారిని కోసరువేసి అయ్యేదిలేదు అని అతడు చెప్పినా పతికి మంచి మాటలచే, భోధించి, వచ్చినవారిని సత్కరించండి (యీవిషయమై మీపతికి ఐదులాడినట్టు కానేరదు) వడ్డించు సమయములో ఒక పిడికెడన్నము పాత్రలో దెచ్చి "వేతునావద్దా, వేతునావద్ద" అని క్రేష్టలు చేయక భోజనము చేయువారి భావనచూచుకొని, కడుపు నిండునట్టుగా వడ్డించండి, లోకమునందు యింకా నొకటి జేయుచున్నారు. యితరులు, తనవారు ఒకపంక్తిలో కూర్చొని యుండగా, తనవారికి వడ్డించు విధమే వేరు, యితరులకు వడ్డించువిధమె వేరు, చూచితిరా యెంత క్రూరకార్యమునకు పాల్పడుచున్నారు. ఈలాగు కడుపు నిండువరకు వడ్డించక యుండినను. పంక్తిలో ఒకరికి ఒకరీతి, ఒకరికి ఒకరీతి, పంక్తిభేదము చేసినను, పురుషుడేకాని, యువతియేకాని, తాను మంచిమంచి పదార్థములను దినుచు, యితరులకు కదాన్నము ఇడినట్లయిన, మహారౌరవవాది నరకప్రాప్తియనియు యింకా విశేషపాపమును చెప్పుచున్నారు.

("నరకప్రాప్తి విషయ ముల్లండని.")

మీరు పంక్తిలో కూర్చొనియుండగా మీకు యితరులు అలాగు కడుపు నిండకుండునట్లు వడ్డించిన, మీపరమాత్మకు యెంత సంకటము కలుగుచున్నదో సూచించుడు. తల్లులారా పంక్తిభేదముచేయక, యెవ్వరు వచ్చినను మాయింటిలో భోజనానకు వసతిలేదని చెప్పక వచ్చినవారల ఆదరించుచు పతివ్రతలై వర్తించండి. నేనివా ముందుచెప్పిన విషయములు యిప్పుడు చెప్పువిషయములు ముందు

చెప్పబొయ్యొ విషయములు మీరు దెలుసుకొని, పతివ్రతలై వర్తించు విషయములే, చెప్పితిని, యికముందు సహా చెప్పెదను, మీరు వినకుండిన.

శ్లో॥ కింకరిష్యతివక్తారః శ్రోతాయత్రనవిద్యతే।
నగ్నక్షపణకేదేశే రజకఃకింకరిష్యతి॥

వినువాడు లేనప్పటిలో, చెప్పువారు యేమిజేయుచున్నారు. మానము మర్యాదలు విడనాడి, బట్టలు లేకనే పారాడుదేశములో, చాకలవాడు యేమిచేయుచున్నాడు నేను చెప్పినవిషయములు, మీరు చక్కగా గ్రాహ్యముచేసుకొని, వర్తించుచు, కీర్తిని వహించి, అపకీర్తి పాలుగాక, స్వర్గమును, బొందండి, కడకు మీరు రెండు మూడు మాటలు; పురుషుని జక్కగా ద్రిష్టించి జూచిన, పురుషుని మనస్సు వికల్పమగుచున్నది. మీరు ధైర్యమిచ్చిన, పరపురుషుని ప్రయత్నము సాగుచున్నది. మీరు ధైర్యమీకున్న రాజాధిరాజైనను, మిమ్ము నేమి చేయజాలడు. మీరు పురుషులకు కొంచం మనశిచ్చినట్టుగా దోచిన కార్యము జెడును మీరు మనస్సీయకున్న, యట్టి బలవంతుడైనను, యట్టిధనవంతుడైనను, దిగులుబడి, మీరోమమైనను గదలించలేడు, ఇది నిశ్చయము. ఇది ప్రమాణము. పురుషులు బలాత్కారముచే, స్త్రీని చెరచనని లోకములో వాడుక కలదు యిది అనృతము ఇది అప్రమాణము.

శ్లో॥ సబంధుర్యోహితేషుస్యాత్ సపితాయస్తు పోషకః।
సఖాయత్రవిస్వాస స్సాభార్యా యత్రనిర్వృతిః॥

యవడు హితకార్యములయందు దుముకివచ్చునో, వాడు బంధువు. యవ్వడు పోషించునో అతడు తండ్రి. యవనియందు నమ్మకముండునో, అతడేమిత్రుడు యేస్త్రీయందు సౌఖ్యముండునో అదియే భార్యయని చెప్పియున్నది గాన మీరు మీపతిచేత భీష్టమునకు బదులుచెప్పక మిక్కిలి కనికరముతో ఆదరించిన, మీపతి వేరేసతితో,

పొందు యందుకు జేయుచున్నాడు. జాయదు " సాధ్యమయినంతమట్టుకు జాయదు ". నేను ముందు జెప్పినరీతిగా, వర్తించుచు, సాధ్యమైనంతలో విటపురుషులు జేయుచర్యలు, మీపతితో జెప్పకండి. జెప్పిన మహా ప్రమాదములు జరుగబోవును. యక్కడికి సాధ్యముగాక మిక్కుటమైన, మీవతులతో జెప్పవచ్చును. ప్రమాదములకు కారణమయ్యేటట్టుగా జెప్పకండి అట్లు జెప్పిన, మీపతి యేమి జేయవలయునంటే, ఇంత మి మిత్రులగా యుండినవారిని యేలాగు విడువవలయును.

శ్లో॥ తస్కరస్యవధోదండో దాసీదండస్తుముండనం।
భార్యాదండ పృథక్శయ్యా మిత్రదండమభాషణం॥

అనునట్టుగా అంత విశ్వాసముగా నుంటిన మిత్రునితో, మా ట్లాడకయుండుటయే, దండన యనబడుచున్నది. కొట్టుట తిట్టుటచే, ప్రయోజనంబులేదు, ఆ ట్టిమిత్రునితో మాట్లాడకుంటిన, యింటికివచ్చుట విడచిపెట్టును. ముందుగనే మీరు తెలివి గ్రహించియుండుట మంచిది కాదా, యిదిగాక మీరు మంచి మనస్సువిడనాడి, చెడ్డమనస్సు జేసు కొన్న మీపతి కనిపెట్టునా, కనిపెట్టజాలరు. యితరులు యేమిచేయ జాలరు. మీరు మంచిబుద్ధి కలిగియుండిన కైవల్యపదవిని మీరు పొందు దురు. యితరులకు మీరు దిగులుపడి యుండజాలరు. యితరులకు దిగులుపడి ఉండక నీమీస్వభావములతో, మీపతికి కీర్తియే కాని పతియంతవరవకు కాచుకొని ఉంటున్నారు, మీమనస్సంపూర్తిగా పరపురుషసాంగత్యం చేయరాదన్న అగుసేకాని, యితరులకు భయపడి యు, పతికిభయపడియు మీరు వుండజాలరు ఇదినిశ్చయము, ఇంతమా త్రము, పురుషులకు సాధ్యముగాకుండినప్పటిలో, పురుషుడుయంతబలా త్కరించినను వాణిప్రయత్నమేమిజరుగును. దానికిదృష్టాంతములుజెప్పు చున్నాను వినండి (లోకకంటకుడైన రావణాసురుడు శీతను యెత్తుకొని పోయి, వశ్యరాలవుకమ్మని యంతబాధించినాడు, సీతాదేవి వశ్యరాలా

యైనా ద్రౌపతిని, కీచకుడు, సైంధవుడు, యంత వేధించినారు. పత్నీవ్రతా లాయనా లోపాముద్రను, యూశ్వరుడు యంత మోసగించినాడు, పత్నీవ్రతాలాయనా, దమయంతిని కలియగు జోయవాడు, యంత వేధించినాడు పత్నీవ్రతాలాయనా, శచీదేవి వృత్రాసురునికి పత్నీవ్రతాలాయనా సప్తరుషుల భార్యలలో, అరుంధతిసహా మిగత అర్గురు, అగ్నిచేత యంత వ్యామోహింపబడినారు. ఇదిమీకు తెలుసునుగదా, యిట్టి వీర్లను తొందరచేసిన వారిగతియేమాయెను మీరు నకరే యేకాంతస్థలమందు, దిక్కులేక యున్నప్పుడు, పరపురుషుడు. బలాత్కరించగా, మీరు ధైర్యము నవలంబించిన, వారేమగును, యిందులో మీకు.

శ్లో॥ స్త్రీణాంద్విగుణమాహారం బుద్ధిశ్చాపిచతుర్గుణాం।
సాహసంషడ్గుణంచైవ కామోష్టగుణముచ్యతే॥

పురుషునికన్నను భోజనము రెండుపాళ్లు, బుద్ధి నాల్గుపాళ్లు, సాహసము ఆరుపాళ్లు, కామము ఎనిమిదపాళ్లు, యని చెప్పియున్నది.

శ్లో॥ స్త్రియశ్చరిత్రంపురుషస్యభాగ్యం। దేవోనజానాతికుతో మనుష్యః॥

. స్త్రీలయొక్క చరిత్రమును పురుషులయొక్క భాగ్యమును, దేవతులెయరుగరు. మనుష్యులెట్లు తెలియుదురు. అని చెప్పియున్నది మీచేతనే, విశేషమైన భారముగల, యీభూమిని ఆదిశేషుడు మోసియుండుట, సూర్యుడు తడబడలేక తిరుగుచుండుట, చంద్రుడు క్షీణించినను పునహా పూర్ణమగుట భూమియు. ఆకాశము లోకములు నుండుట ప్రజావృద్ధియగుట యివన్నియు తెలసి పతివ్రతలై వర్తించండి మిమ్మును దేవుడు సన్మానించుచున్నాడు, లక్ష్మీదేవి పరిచర్య జాయవచ్చును, పతిభక్తి కలిగిన అనసూయకు లక్ష్మి పార్వతి సరస్వతిసేవచేశినారు. సావిత్రి తనపతిని బ్రతుకించుకొనినది. కబీరుదాసు భార్యయు జనాబాయి, మీరాబాయి, సక్కూబాయి మొదలుగాగలరీ, యీకాలము "పతి

వ్రతల చరిత్రలు" విన్నారుగదా, పతివ్రతలకు సాధ్యముకాని పనులెవ్వి, పతివ్రత సూర్యుడు బుట్టకూడదనగా పుట్టకనిలుచు వాయువు వీచకూడ దనగా వీచక నిల్చును, అగ్నిచల్లగా గావలెననగా చల్లగానగును. లంకా పట్టణమందు ఆంజనేయుని తోకకు, రాక్షసులు లగ్గ అంటించినవారు కాగా యీసంగతి పతివ్రతయగు సీతకు దెలిసి.

శ్లో॥ ఉపతస్థివిశాలాక్షీ ప్రయతాహవ్యవాహనంయద్యస్తిపతిశుశ్రూష।
యద్యస్తిచరితంతవ యదిచాస్త్యేకపత్నీత్వం సీతోభవహనూమతః॥

నేను పతిభక్తిగల దాననైతినేని శ్రీరామచంద్రుడు ఏకపత్నీ వ్రతుడాయనేని హేఅగ్నీవా ఆంజనేయుని బాధించక చల్లగానుండుము అని సీతప్రార్థనచేసుకోగా, అగ్ని చల్లనై ఆంజనేయుని బాధించక యుండలేదా, సీత, దండకారణ్యంబున నొంటిగానుండగ, రావణుడు, పది తలలు ఇరువదిచేతులతో సీతకు కనబడి, దుర్మార్గపుమాటలు ఆడగా, సీత యిట్లనలేదా.

శ్లో॥ యదంతరం వాయసవైనతేయయో ।
ర్యదంతరంమద్గు మయూరయోరపి ।
యదంతరం సారసగృధ్రయోర్వనే ।
తదంతరందాశరథే స్తవైవచ ॥

కాకికిని గరుత్మంతునకును, నీరుకాకికిని, నెమలికిని, గద్దకును, హంసకును. యెంత హెచ్చుతక్కువకలదో, రావణా నీకును, రామునకును, అంతభేదముకలదు. మహాత్మా అవతలపొమ్మని, అరణ్యంబున వక్క తెయున్న సీత భయములేక యారావణుని తుచ్ఛముగా మాట్లాడ లేదా, మీరుగూడా, ముందుచెప్పిన సమయములు తటస్థించిన, ధైర్యమునవలంబించి, మీరు తుచ్ఛముగా చూచిన వాడు యెంత మోహముచే, కన్నుమిన్ను దెలియకవచ్చినను ధైర్యముచెడును యిదినిజము,

యితర పురుషులను నమ్మక వర్తించండి పురుషులు మంచివారనియు అటువంటివారు కాదనియు, నమ్మవద్దండి, యీవిషయమందు పురుషులు యెంత మంచివారైనను, యెంతనిబ్బరశాలులైనను, ఏకపత్నీవ్రతులైనను నమ్మవద్దండి యీ విషయములో పురుషులు నిష్కళమైన బుద్ధిగలవారుగాను, పరనారీ సోదరులుగానూ, ప్రమాణముగా లేరని నేను చెప్పుచున్నాను. స్త్రీలు యీ విషయములను చక్కగా గమనించి ప్రవర్తించవలెను, మనమత్యరాష్ట్రమందు, కొందరిస్త్రీల చరిత్రలువిన్నాను. జూచియున్నాను నేను చూచినదానిలో, లోకమాతలతో సమానమగు జగదభిమానదేవతలను పతిసేవయందును, అన్నదానములోను, (ఆత్మవత్సర్వభూతాని,) అను వాక్యము రీతిగా తమవలెనె అన్నిప్రాణములని, సమస్తప్రాణులయందు దయకలిగి, యెట్టికష్టములు తటస్థించినను వోర్పుకలిగియుండు పతివ్రతలు మన భరతఖండమున నేనుచూచినంతలో కొందరుకలరు. వారెవరన మా॥రా॥రాశ్రీ, పావగడతాలూకు మురాద్రాయన పల్లిలో సుఖవసతిగానుండు, బ్రాహ్మణ, బడగనాడు, వెంకట రామప్పగారి భార్య సౌ॥ కుం॥ శోభితురాలైన హనుమక్కగారు.

కం. చిత్తేశుడన్యవనితా యత్తుండైయున్న నప్రియంబులునుప ।
లెత్తక బల్కకయెప్పటి చిత్తములో భక్తికలిగిసేవలు జేయుః ॥

హిందూపురం తాలూకా కల్లూరు గ్రామంమే॥మా॥రా॥రాశ్రీ, వెంకట్రామప్పగారి భార్య సౌ॥ కుం॥ రాలగుభీమక్కగారు.

హిందూపురం తాలూకా కగ్గల్లు రెడ్డిమిరాశీదార్ రామప్ప భార్య సౌ॥ కుం॥ గుండమ్మగారు. వీరు పతిభక్తిన్ని, పరులకు కష్టములు తటస్థించినప్పుడు కనికరముచే తోడ్పడి వుపకారమును చేయగలవారలు.

పావగడ తాలూకా గుమ్మగట్టలోనుండు స్కూల్‌మాష్టర్ మ-రా-రాశ్రీ, పావగడ శ్యామరావుగారి, భార్య, సౌభాగ్యవతి, కుం॥ శోభితురాలగు కామాక్షమ్మగారు,

యిదేతాలూకు గుమ్మగట్ట పంచాగం. బ్రహ్మశ్రీ, నరసప్పగారి, భార్య, సౌభాగ్యవతి, కుంకుమ, శోభితరాలగు పార్వతమ్మగారు. నేను చూచినంతవరకువీరలే మహాతల్లి గారు.

ఉ॥ రామవిశాల వైఖరుల రంభయనన్ దగినాథుకార్యముం।
దేమరశిష్టమంత్రి తెరగేర్పడ భోజనవేళమాత్రమే।
భామహితంబుచెన్నొనగుచున్ రతితంత్రము వారకామినీ।
శ్రీమెరయంగదాల్చిపతిసేవనగుంధతిబోలు భామినుల్॥

కం॥ గౌరీవ్రతంబులక్ష్మీ వారముఖవ్రతము సారసప్రభుచంద్రా।
చారవ్రతిములునోములు వారకసల్పిన సభోజనసలువీరల్॥

వీరలవలనే, మిగతవారందరు నడచుకొని, కీర్తిమహింతురని నా యభిప్రాయము.

పైకనుపరచియుండు మిత్రత్వవిషయము, స్త్రీధైర్యములో చెప్పియుండు సందర్భములు దరిద్రులకే కాక, ధనవంతులకునహా, అదియే యభిప్రాయముగా యోచించవలెను.

హేస్నేహితులారా, స్నేహితులయిుండ్లయందు, పరస్త్రీలను గోరక; స్నేహితులయందు నమ్మకము చెసుచుకోక, వర్తించండి, అయితే పరస్త్రీలను గోరినవారియొక్క తాపమును పరస్త్రీసుఖమును, జార పురుషచర్య జారస్త్రీచర్యను, యిచ్చట కొంచముముచ్చటించుచున్నాను.

## జారపురుష జారస్త్రీ చర్య.

చం॥ తలపకులాంగనా రతిసుఖప్రదమేమి సుఖంబువేశ్యతో।
గలయుట ద్రవ్యహానికిని గారణమింతియె సంశగొందుయిం।
తులయడబొంకులన్న నతిదూష్యమగున్ బహుయత్నలభ్యతన్।
దలకొనుచన్యభామల రసాంబెరతంబు జగన్నుతంబుగన్॥

చం॥ గరగరికైనదై నెనరుగల్గినదై నెరనీటుకత్తెయై।
పరువపునిండుజవ్వనపు బాగరినాగరికంపు ప్రోడయై।
మురువగునవ్వుమోముదయి ముద్దులగుమ్మయి ముచ్చటైనదై।
సురతకళాప్రవీణయగు సుందరియందరికిన్ లభించునే॥

యిట్టిస్త్రీ లభించిన కొన్నిదినములు ఒకస్థళమందు ఐక మత్యముచే, హెచ్చైన మమత కలవారలై యుండగా, వియోగము ఉభయులకు సంభవించిన అప్పటిలో, స్త్రీ, వియోగదుఃఖము బట్టజాలక.

సీ॥ కొండపై బడినట్లు కొంతసేపేమియు ననలేక మిన్నుకన్నెను చునుండు। మిపలవెక్కసమైన మీనాంకుశిఖిపాగల్ పెలికిదాల్చినరీతి వెచ్చనూర్చు। విరహంపుపెనుమేటి వెల్లువకెదురీదినట్లుగా చేతులట్టిట్టువైచు। ధనముగోల్పోయినదారిగాపుప్పాడిమేసంటవిరిపాన్పుమీద బొరలు। కొలుకులను జారుకన్నీరు గోటమీటు। తొడరియడరెడు నిట్టూర్పులతో డమాడు। చింతచేజేర్చి చెక్కిటచెయ్యిమర్చు। నలుకవిలుకానిపటుధాటి నవ్వధూటి॥

గీ॥ యింకనమ్మన్న మాటలచందమన్న।
నదికొనెలనాక లెంతపెన్పాయయనిన।
రాజభోగంబులిన్నే నారాజవదన।
సమణుపెరనిమది నెంచి భ్రమవహించు॥

సీ॥ విభుడుమారాకుచో వెనకి తప్పులబట్టు పొలయల్కయవల మోముగబరుండు। గోనగోటబ్రియుడు చెక్కుచురక్కునదీర యిదియేమిసరసమంచీనడించు। ముచ్చటైనాథుండు మోవిపల్మనొక్కవెలయాలనాయంచువీడనాడు। తమకానధవుడు కందర్పకేళికెనంగ నెంతసేపనితీవరించసాగు। యక్కడమనంబటన్నను చిక్కురమను। యాలసేకోపమనిన నేమేమొగోణగు। మేనుపతిచెంత మానస్థయావిటునిచెంత। నిలిపియాసేమ విరహంబు నెలుగునోన॥

సీ॥ పతిపిల్వబిల్వదా పలుకక వెడవెడ బనులచేగాలయాపనమొనర్చు। మాటికిమాటికి మగనితోఁబిండ్దొడ్డి చలపాదితనమున నలిగియుండు। మమతతోనాథుండు మాట్లాడియించుక యటుమొగంబైనవో మింటికవిరుచు। రతిగాంచధవుడు చీరచెరంగుమానె నంచవ్వాల కేగు నిరాశగాగ। నెల్లగృహకృత్యములుతీయందుపేక్షసేయు। సకల భోగంబులను వ్యర్థమనుచురోయు। జారవిభుమీాది మోహంబుసారి కంటి। కాపురము నెల్లకుండు నాకలునాకొంతి॥

ఉ॥ భామలజాతిచేష్టితవిభావములెల్ల నెఱుంగుకామసం।
గ్రామకిరీటియైనవిటరాయుడు మోహనమూర్తియంతయుఁ।
నామదిచల్లజేయుప్రియనాథుడు సన్నడబాసెనయ్యయో।
యీమగడేలయీసరసమేటికి తక్కినవేమియేటికిఁ॥

ఉ॥ కోరికెకొన్నినాళ్లుమదికొంక దొరంగకకొన్నినాళ్లుచే।
కోరకకొన్నినాళ్లుజనకూర్మి విటుండొకడబ్బెనబ్బెనఁ।
వారకపేరులేనిప్రతిబంధము పెన్నిటినంచువచ్చినా।
దారకపోరిబాపెనకటా మగనాలయిపుట్టజల్లున॥

సీ॥ అలయించునొకవేళపాలయల్కదిక్కుల నెలయించునొకవేళసొగసు వగల। కరగించునొకవేళ కళలయింపులంట మరగించునొకవేళమె రగుమోవి। పలికించునొకవేళపావురపల్కులు కులకించునొకవేళకొ సరినవ్వు। యూనించునొకవేళనరిదిమోమున మోముపూనించునొక వేళపురుషరతికి। చిగురువిలుకానినైన నాసొగసుకాని। రొప్పలేద న్నయుదియుది దప్పినట్టి। యీమగండేడ నేనేడయేడకేడ। నేటికీపో రుమీని పొందవతెకోరు॥

ఉ॥ ఆశికలైననేమిమగడా రడిబెట్టిననేమిచుట్టముల్।
వాడకయున్ననేమి పరివారలునవ్విననేమికాపురం।

బూడిననేమినాదగుప్రియుండెడద వాసిచనంగనేనునుర్ ।
తోడనెబోవనై తిమదిదోచక పోయెనికేమినేయుదుర్॥

గీ॥ యేకరణినైనవానితో నెనయుటొకటి। కానిచో మేనిపైయాననుమానుటొకటి । యింతయేకాకమగడంచుని తనిమొగము । చూచిపైరింపలేను త్రికరణశుద్ధిగోన్ను ॥

చ॥ అనియనిశంబునెంచు మదనాశుగమదిరాసకుందనంబునన్ ।
ఘనమగుమూర్ఛగాంచువగ కానివగల్గణియించుకై జవున్ ।
వెనిమిటినీసడించుమది పెక్కుత లంపులనించువాడువ ।
చ్చెననితలంచునెచ్చటను! చీమచిటుక్కనిన జలింపుచున్॥

అని యీలాగు యాస్త్రీ విరహవేదన సహింపజాలక తనకిష్టమగు నొక సన్నాహకత్తెను బిలచి యిట్లనుచున్నది.

చ॥ ఏవంకన్ జనెనోమదీయ దయితుండెచ్చోటనున్నాడోనే ।
నేవెంటన్ బ్రియమోముగాంతు యికనేనెవ్వారితో దెల్పుదు ।
న్నీనవ్యాజవరోపకారవుగదేనెమ్మిన్ నమన్ బ్రోవవె ।
పోవేవానికినావ్యథల్ దెలుపవేపుణ్యంబునీకయ్యెడిన్ ॥

అని యాతేమసన్నాహకత్తెను విటునివద్దకు బంపిన యిచ్చట విటుండుతన ప్రియురాలియందు విరహంబు తాళజాలక నొక్కచోదిక్కుతోచకకూచుండెను.

చ॥ భ్రమగొనినట్లుమిన్నువిరిగిపైబడినట్లుగ్రహంబుసోకిన ।
ట్లమితధనంబుగోల్పడినయట్లు ప్రపంచముగ్రుంకినట్లుచి ।
త్తమువికలత్వమొందమది దాలిమిఃడిందగమేనుకందగా ।
భ్రమగొనియుంతరంగమున దానిదలంచిదలంచియిట్లనున్॥

ఉ॥ చక్కదనాలకేమిరుచినంపదచిత్తము లొప్పుయున్ గదున్ ।
జక్కనగాదెఇంతనెరజాణతనంబొకచోటగానగా ।

మక్కువలోకమందెనహో మాటలపోడిమిదానికేతగుఁ ।
దక్కనభామినీమణులుదాని శతాంశముబోలనేర్తురే ॥

సీ॥ నునుపంటనావాని నొక్కిచక్కనిసామి నొచ్చెనోయనుచు నాను
చును నొక్క । సమరిపంతగబల్కు మనుచుచెక్కిలగొట్టి కందె
నోయనుచు చన్నవనుజేర్చు । సందీక కౌగిటయందుచేర్చిచె మర్చె
నోయనిపయటచే నొనరవిసరు।తెనవుగాపడకిచ్చి బడలితివోయంచు
సయముగా పైకొని బయలులాగు । నట్టిచెలిబాశితలపోసి వెలపిఘా
సి । దాల్మినెడచేసివెడడాసి తనుపురోసి । తల్లడింపగనా మొహాది
వమాయ । ఏదిగతిశేరవిరహాగ్ని కేదిమేర ॥

సీ॥ బటువుగుబ్బలనొత్తిపక్కకుహత్తి నావసనచెల్లించినయందికత్తె ।
కొనగోరునాటించికూర్మిపాటించిన తమకంబుకెరలించుతలిరుబోణి ।
వాతెరపాలించివగలదేలించిన నలవులీడేర్చినవన్నెలాడి । పావురావు
గబల్కి పటుకొనిచెక్కునాముచ్చటలసమకూర్చుఁ ముద్దుగుమ్మ ।
మక్కువనొసంగి కోరకినమనుపొసంగి । గారవించినకొమ్మ బంగారు
బొమ్మ । ననవిల్తులకునొజ్జ నాపెపజ్జ । నెన్నడొకచోటజేరునా నంత
లెవ్వుడదీసు ॥

చ॥ యొసగిననయ్యపుఁగినుక నెంతయు మోడిముసుంగుబెట్టియా ।
కుసుమసుగంధియున్నపుడు కొంకుచునేచెయిదాచనిద్రచె।
గనరియట్లుమక్కరము గబ్బిచనుంగవపైకిదాల్చిమయి ।
నుసులుచునీవిజార్చిన మనోహరలీలలనెన్నశక్యమె ॥

చ॥ వకతొడసందిటఁజొనిపి యొక్కతొడఁవెలిజేసియొక్కచే ।
రకమగుగుబ్బచన్నొకకరంబున వెన్నిరికొప్పుబట్టిత ।
త్తరలకతాళమానములదారిగ గూడెమనన్నుజూచుచుఁ ।
బకపకనవ్వునావలపులంగసుబొమ్మను జూచు టెన్నడో ।

సీ॥ వెనుదియ్యకుమటంచు వెడవిల్తుఁడాడించు జంత్రిపోలికకీలు జడనటిం
ప । స్మరసంగరంబున గురియుపువ్వులవాన క్రమముననుసరులముత్య
ములురాల । మరుడనుజగజెట్టిబిరుదు దక్కియుచూట్కిగళరవం
బులుఘణత్కారమెసగ । చిత్తంబురాజ్యాభిషేకాంబువులభంగిదొ
డరినచెమటబిందువులు చెలఁగ । మదనపరదేవతాధ్యాన మహితని
ష్ఠ । బోలి యరమోడ్పుకనుదోయి పలుకుమిగుల । మగసొగసు
జాణయాయింతిమదినిదంతి । పగడసాలనుగెల్చిన పంతమునను ॥

శా॥ ఏమాటాటిన జాళువాకు నమృతంబేయం గమిరాకించినా ।
హేమంపుందళుకుల్ తళుక్కను బలెన్ యేదిక్కుముద్దాడినా ।
నేమోచక్కెరలప్పలంటినటులౌ లెచ్చోట చైజాచినా ।
ప్రేమన్ బెన్నిధి యబ్బినట్లగునయారే యామోయ్యారేతగున్ ॥

సీ॥ దళుకుబంగరుఛాయగాజులల్లనమ్రోయుగులకిపక్కుహత్తికొంతసేపు
తనివిచాలకపేర్చి తనపైకినను దార్చి వంతుగానమరతి గొంతసేపు ।
వదిచాలకెమరెక్కయనురాగమునమ్రొక్కివింతహత్తింపులకొంతసేపు
గసిదీరకటులేచి గ్రక్కున తమరేచి కుంచగోరింతల కొంతసేపు ।
గొనముకోకిలరవముల గొంతసేపు ।
గొనమువగగుల్కుఫల్కుల కొంతసేపు ।
కరిగికరిగించు వలపులకలికిమెలకి ।
సొలసిసొలయించు నాతినేజాణనైతి ।

చ॥ కలిగినకొప్పుతో జటిలుగంధముతో విసబద్ధగైకతో ।
తలములవిల్తుపాళి వొక తట్టుతళుక్కను కట్టుకొంగుతో ।
సొలపులకన్నులన్ న్నిదురసొక్కులతో విరిపాన్పుడిగ్గనీ ।
చెలమినివచ్చుతీవి మదినెన్నముసూమదహంసగామినీ ॥

ఉ॥ పంతమిదేలనే పెదవిపానకమానక తాళజాలనే ।
యంతటిదిట్టవేక కసరకిప్పుడు నాకొకముద్దుపెట్టవే ।

శంతలసై చోకేమఁగదివాణము జాతునటన్న దాచకే।
ఇంతుల రేని, యింతచలమేటికి చీటికిమాటికి మాటిమాటికిన్ ॥

చ॥ అరిదిక డాణిబొమ్మ మనముందవుటద్దపుటింటిలోపులన్ ।
సరసతమీరఁ బెందొడల సంకులపొందుల మోవివింకులన్ ।
సిరిమెచలంగిగూడి ప్రతిబింబిములన్, గనుపట్టినట్టియా ।
గుసుతులు వేట్క నెండొకులకుర్ గనుపింప గనుంకుకొన్నదో॥

సీ॥ ఆకాంత నాచెంతరాకున్న నక్కటాయీకంతు తాపంబు లెట్టులడఁగు।
యామందయానయనామంద నిలకున్న ఈమందమారుతం బెట్టులడఁగు ।
యాలేమయాభామ నాసీమ రాకున్న యీకామతాపంబు యెట్టులడఁగు।
యాతారసమనారి నాతావు రాకున్న యీతారతాపంబు లెట్టులడఁగు
కలికి ఈయెడ లేకున్న కలతజెంద। జేయపుకుగులతాపంబుమాయు టెట్లు
తాపకారణమైన యాతగుణిరాక ।
మానధరియించి ప్రాణంబు బూనుటెట్లు ॥

శ్లో॥ కదాకాంతాగారే పరిమళమిళితత్సుష్పళయ సెళయానః ।
శ్యామాయాః కుచయుగభరం, మకుసివహాన్ ।
అహొస్నిగ్ధముగ్ధ చటులనయనే చంద్రవదనే।
ప్రసీదేతిక్రోశన్ని మిషమివనేష్యామిదివసాన్ ॥

వకమనోహారమగు పదకటింటిలో మంచివాసనలు ఘుమాఘు మాయించు పూలపాన్పుమీద బరుండి నిండు జవ్వనియగు కాంతయొ క్క స్తనద్వంద్వమును నారొమ్ముమీద నొత్తుకొని నానెయ్యంపుచెలి యా, నాముద్దులగుమ్మ నాచంచలాక్షి నాచంద్రవదనానామరువంపు ములకా, నన్ను కౌగిటజేర్చి, నీయధరసుధారసంబానవిచ్చి మకుసంగ రంబుల నేలవేళ్లామానినీమణి, ఓవలపులసరణీ, ఓపచ్చికస్తురివీణాళ్ల

నెరజాణాయని నిత్యాదుల ననునయించుచు నాదినంబులెల్ల సౌకర్యాటి ప్రాయంబుగా జెప్పుచు గడుపుమనూ.

అని యీప్రకారంబుగా విటపురుషుడు, విటస్త్రీ, విరహావేద నను సహింపజాలక విలపించుచున్నారు లోకములో పరస్త్రీసాంగత్య మున కన్నను హెచ్చగుసుఖము లేదనియు అట్టిస్త్రీ అనురాగవతియైన అదియే అమృతమనియు పూర్వీకులు గ్రంథములయందు వొగడి యున్నారు నా యభిప్రాయము సహా అదియే.

## పరస్త్రీసాంగత్యముచే చెడుపు.

పరస్త్రీసాంగత్యమే సుఖమని జెప్పినకులస్త్రీ సాంగత్యము సుఖ మునివ్వదా పెద్దలు జెప్పియుండునది వెర్రితనము పరస్త్రీసాంగత్యము "యేమిసుఖమునిన" అన్నహారములులేక అవమానము నొసిగట్టి లోక నిందకు లోబడి ద్రవ్యనాశనము చేసుకొని బంధువుల తల్లితండ్రుల విడ నాడి అపకీర్తిపాలై దేహము కృశించి రోగాద్యుపద్రవములుకలుగ జేసుకొనుటయే సుఖముగాని మరేమియు సుఖములేదు దీని అనుభవ శాలుల కేయిది తెలుసునుగాని దీని అనుభవములేనివారికి తెలియదు పరస్త్రీసాంగత్యము, సుఖములేదనియు చాలాకష్టములు తటస్థించున నియూ నా అభిప్రాయము "హేసోదరులారా పరస్త్రీని గోరిన స్వతం త్రములేక అతంత్రమగు కూడుగుడుచుచున్నాము, చాలాకష్టనష్టములు తటస్థించును చాలాధన వ్రయమగును, చాలా అవమానమ్మయును కలు గును, అపకీర్తి పాలగుదుము.

శ్లో॥ స్వల్పస్నాయువసావశేష మలినం నిర్మాంసమప్యస్థిగా ।
శ్వాలబ్ధ్వాపరితోషమేతి న చ తత్తస్య క్షుధాశాంతయే ।
సింహోజంబుకమంకమాగ తమపిత్యక్త్వా నిహంతి ద్విపం ।
సర్వః కృచ్ఛ్రగతోపి వాంఛతి జనస్సత్వానురూపం ఫలమ్ ॥

చక్కస్వల్పమగు సరములతోడను మేదస్సుతోడను కూడుకో నియుండు మలినమైన యెముకనుపొంది మిక్కిలిగా సంతోషమును పొం దుచున్నది. ఆయెముక ఆజంతువుయొక్క ఆకలిని దీర్పజాలదు, మరి యు సింహము, సమీపముననున్న లేక సమీపమునకువచ్చిన నక్కనువ దలి దూరమందున్న యేనుగనుచంపును కావున లోకములోని జనులం తయు, నీచమైన పరస్త్రీని కోరక తమతమ భార్యలతో సుఖంచుడీ.

శ్లో॥ రమ్యాంకులస్త్రీరతం ॥

కులస్త్రీరతియే సౌఖ్యము, యిదిగాక పరస్త్రీని గోరుటచే.

శ్లో॥ సుఖంబిందుమాత్రేణదుఃఖంపర్వతమేవచ ॥

అన్నట్లు సుఖముబిందు మాత్రము కష్టములు చూడగా కొండలకొద్ది.

శ్లో॥ స్వప్నే వ్యన్యావధూకథామ్ ॥

స్వప్నమునందైనను పరస్త్రీని గోరవద్దండి, యిన్నియు జెప్పనేల "అనుభవమువైననే దెలుసును" యేమో వ్రాసినా కవి శాస్త్రారంచా యవద్దంతి ఇవన్నియు అనుభవ విషయములుగాన వ్రాశినాను. పరస్త్రీ సాంగత్యము జేయక సజ్జనసాంగత్యముజేయుచు, సజ్జనసాంగత్యముచే.

## సత్సాంగత్యము.

శ్లో॥ జాడ్యంధియోహరతిసించతివాచిసత్యం ।
మానోన్నతిందిశతి పాపమపాకరోతి ।
చేతఃప్రసాద యతిదిక్షుతనోతికీర్తిం ।
సత్సంగతిఃకథయకింనకరోతిపుంసాం ॥

సజ్జనసాంగత్యమువలన మూఢత్వము బోవుచున్నది సత్యమగు మాటలాడుట సంభవించుచున్నది, బహుమానాతిశయముఖను గలుగజే యుచున్నది, పాపమును తొలగించుచున్నది, చిత్తము నిర్మలమునుగా

జేయుచున్నది, దిక్కులయందు కీర్తిని గలుగజేయుచున్నది కావున సజ్జనసాంగత్యముచే యేమి తానేకలుగదు.

శ్లో॥ ఆరంభగుర్వీక్షయిణీక్రమేణ లఘ్వీపురావృద్ధిముపైతిపశ్చాత్ ।
దినస్యపూర్వార్ధపరార్ధభిన్నా ఛాయేవమైత్రీఖలుసజ్జనానాం ॥

దుర్జనులస్నేహము ప్రొద్దుటిపూటనీడ వలెపొడుగానుండి క్రమక్రమముగా క్షీణించిపోవును. సజ్జనులస్నేహము మొదటకొంచమై రాగారాగా వృద్ధికాబోవును సాయంత్రినీడవలె అధికమగును గాన సజ్జనసహవాసము జేయుచు స్నేహితులను మోసబుచ్చక నమ్మినవారిని చెరపక, (అనగా) స్త్రీలునమ్మినను చెరచవద్దండి, పురుషులునమ్మినను చెరచవద్దండి నమ్మినవారిని చెరచిన మహాపాపమందురు తాను చెడినను చెడవచ్చునుగాని మరియొకరిని చెరపరాదు నమ్మినవారిని విడువగూడదు (యట్టివాడు నమ్మినను విడువగూడదు. వుత్తమస్నేహితులు సమయమున ప్రాణమునను ఇత్తురు, (ఇందుకు దృష్టాంతము.)

సుబుద్ధి, దుర్బుద్ధి, యని ఇద్దరు ధనవంతులుగలరు, ఇద్దరూవడ్డివ్యాపారము జేయుచుండిరి. సుబుద్ధియనువాడు భూతదయ పశ్చాత్తాపము కలిగినవాడు, దుర్బుద్ధియనువాడు మహాదుర్మార్గుడు కఠినచిత్తుడు, యిట్లుండగా సర్వజనులు సుబుద్ధివద్దనే లేవాదేవి విశేషముజేయుచు దుర్బుద్ధి దగ్గరకు జనులు పోవడమేలేక పోయెను, లేవాదేవి యెప్పుడు నిలచెను నానాటికి వాని ధనమునకు క్షీణగతి ప్రాప్తించెను, ఇట్లు తనధనము వృద్ధిలేనిది జనులు తనవద్దకురాక మానుకొన్నది దుర్బుద్ధి తెలుసుకొని సుబుద్ధియందు ద్వేషమును పెంపుచేసి సుబుద్ధిని చంపదలంచియుండె, ఇట్లుండగా, సుబుద్ధికి సుమతియను నొక అత్యంత మిత్రుడొకడు కలడు. అట్టిమిత్రునికి వివాహమగువేళ సమీపించెను, సుమతియను మిత్రునికి వివాహమగు చున్నది 100000 పదిలక్షలు ద్రవ్యముకలది,

సుశీలయని నామెపేరు, సుమతిపట్టణమునకు యామె పట్టణమునకు 400 మైళ్ళదూరము యామె తలిదండ్రులకు పుత్రసంతానములేదు. ఇట్టి చిన్నదానిని వివాహమాడువేళ సమీపించినది కాగా సుమతియను మిత్రుడు సుబుద్ధి దగ్గరకువచ్చి, మిత్రుడానాకు వివాహవేళ సమీపించి నది నాచేత ద్రవ్యములేదు నీవు యిప్పుడు 10000 పదివేలు రూప్యము లిచ్చిన నాకు లగ్నమగుచున్నది పదిలక్షల ద్రవ్యమునహా లభించుచు న్నది యని ప్రస్తావముజేసెను సుబుద్ధి దగ్గర అప్పటిలో ధనములేనందు వల్ల చింతాక్రాంతుడై మిత్రుడా నీవుచింతిల్లవలను లగ్నముచేసుకొని, నీవు భార్యతో సుఖముగానుంటే చాలును నాప్రాణమైనను ఇచ్చి పది వేలుద్రవ్యమును దెచ్చియిచ్చెదను అని తనపట్టణమంతయు విచారిం చెను పదివేలురూప్యములు ఇచ్చువారు లేకపోయిరి. అప్పుడు సుమతి, అయ్యో నామిత్రునికి లగ్నమువేళ సమీపించినది యిదిగాక పదిలక్షల ద్రవ్యము సహాదొరుకుచున్నది యిట్టిసమయము విడచిన నామిత్రునికి లగ్నము కావడము కష్టసాధ్యమాయని యోచించి తనయందు ద్వేషము పూని చంపదలంచి యుండినట్టి దుర్బుద్ధిదగ్గరకుపోయి, ధనవంతుడా నీవు నాకు యీసమయమున పదివేలు రూప్యములిమ్ము నీకుబాండుబ్రాశి యివ్వగలను అనిచెప్పగా అప్పుడు దుర్బుద్ధి నాకోర్కె యీడేరెను యీ విషయమును గురించియే వీనిని జంపవలెనని యోచించి అయ్యో సు బుద్ధీ నీవు అడిగినట్టుగా ధనమునిచ్చెదను పది దినములలోపుల నాధన మును యివ్వకుండిన నీడొక్కయందు 2 శేర్లు మాంసం నేనుకోసుకొన వచ్చునా, అట్లు ఇచ్చుబుద్ధియుండిన కరారు వ్రాశియిమ్మని అడుగ సుబుద్ధి, నాప్రియమిత్రునికి లగ్నమయితే చాలును నాప్రాణముపోయి నను చింతలేదు నామిత్రుడుసు ఖముగానుంటున్నాడు గదా అనిదలంచి యాకరారుకు వొప్పుకొనెను, యిట్టికరారునకు సుబుద్ధి వొప్పుకొన్నసంగతి సుమతికి తెలిసినవాడై తటాలునవచ్చి సుబుద్ధినిచూచి, సుబుద్ధియట్టి వెర్రి

వని జేసెదవు నాకు లగ్నములేకున్నను చింతలేదు ఇట్టి కరారునకు తప్పకొనకూడదని యన్నివిధములగా ప్రార్థించినను సుమతికి మంచి మాటలుజెప్పి పది దినములలోపల ద్రవ్యమీకుంటిన నాదేహ్యమందు 2 శేర్లు మాంసం నీవు తీసుకొనవచ్చునని కరారు వ్రాశియిచ్చెను. అట్లు వ్రాశియిచ్చి మిత్రునిచేతికి ధనమునొసంగెను మిత్రుడు యాధనమును దీసుకొనిపోయి వివాహము జేసుకొనెను యిట్లు యాకన్యను వివాహ మాడి సుశీల, సుమతి, యిద్దరు నొకకేళీ గృహమునందు సంతోష భరితస్వాంతులై యుండగా అక్కడికి సుబుద్ధి వ్రాశియిచ్చిన వాయిదా మీరివచ్చెను. అప్పటిలో సుబుద్ధి, వకకాయితమునుదీసుకొని మిత్రుడా సుమతి నీవు లగ్నముచేసుకొని భార్యతో సంతోషముగా నుందువు గదా దీనినితలంచి నామనస్సున మిక్కిలి సంతసమొందుచున్నాను నేను వ్రాశియిచ్చిన కరారు వాయిదామీరినది అతడు సివిల్‌కోర్టున దాఖల్‌చేశియున్నాడు యీ నెల 12 తేది వాయిదా ఆతేది నాదేహ మున అతనికి 2 శేర్లు మాంసమిచ్చుటకు సంతసముచేనున్నాను యిక నన్ను నీవుజూడవు మిత్రుడా నీ భార్యతోటి సంతోషముగానుండుము. అని జాబువ్రాశిపంపెను సుమతి సుశీలకేళీ గృహంబున క్రీడలు సల్పు సమయమునకు యాజాబువచ్చిచేరెను సుమతి యాజాబునుచూచి దుఃఖాబ్ధియందు మునింగి కన్నులనీళ్ళుగార్చుచు భార్యనుజూచి నీకోస రమై నామిత్రుని జంపుకొంటిని. నాకు యీజన్మమేల నామిత్రుని కష్ట వేళకు నేను బోవుచున్నానని విశేషముగా సంకటపడ అప్పుడు సుశీల, నాథా దిగులొందకు, నాదేహము, నాద్రవ్యము అంతయు నీదే గదా,! నీకు కావలశినంత ద్రవ్యము దీసుకొనిపోయి నీమిత్రుని బ్రతికించు కొని వేగిరరమ్ము యిదిగో యీవుంగరముదీసికొమ్ము నాయందు నీకు నమ్మికమైన ప్రేమవుంటిన యీవుంగరమును యెవ్వరికి యివ్వవలదు. బోయిరమ్మనిజెప్పగా సుమతి కావలశినంత ద్రవ్యము దీసుకొని తనపట్ట

గామునకువచ్చి మిత్రునిచూచి దిగులుపడవలదని జెప్పి పదివేలురూప్యము లిచ్చి Barrister, నుంచి వ్యవహారమాడుచుండగా, నాది ప్రతివాదులు భయులు Barristersను వుంచి వ్యవహారమాడుచున్నారను వర్తమానము యిచ్చట సుశీల దెలుకొన్నదై తాను రహస్యముగా ప్రతివాదిపరం బ్యారిష్టరుకు యిట్లని కాకితంవ్రాశెను.

To

Ramachendra Banerjee, Esq.,

Barrister-at-Law,

MADRAS.

SIR,

May I request you to lend me your dress for appearing as your substitute on behalf of your client in Suit No. 146 on the file of Madras High Court Sessions, in recompensation thereof, I promise to pay you Rs. 10,000 in addition to the Rs. 10,000 your client has agreed to pay you. All that I request you is to intimate to your client that, as you have too many engagements there, you are sending a substitute and to request the Court to post your case on the 25th of this month. Meanwhile please call over here so that we may talk over the matter personally.

Yours faithfully,

RAJA SUSELAMMA,

*Conjeeveram.*

# మ-రా-శ్రీ, బ్యాలిష్టరు రామచంద్ర బెనర్జీగారికి

కాంచీపురం రాజాసుశీలమ్మ నమస్కారములు చేశి వ్రాసుకొన్నది

146 నెంబరు ప్రతివాదిపరం మద్రాసు సెష్షన్ కోర్టు.

అయ్యా,

యీనెంబరు సంమ్మంధము ప్రతివాది తమకుయిచ్చు పదివేలు రూప్యములుకాక నేను పదివేలు రూప్యములు నేను యిచ్చుచున్నాను, తమ ఫ్రస్సుఅంతయు నాకు తక్షణం పంపవలశినది. తాము బదిలీగా యింకొకరిని పంపుచున్నానని చెప్పి యీనెల 25 తేది వాయిదా వేశే ట్టు జడ్జీగారిని ప్రార్థించి తాము తక్షణం యిచ్చటకివచ్చి దర్శనమిచ్చి నాతోమాటాడి వెళ్ళవలశినది.

తమవిధేయురాలు,

రాజాసుశీలమ్మ

కాంచీపురము.

అని యీలాగుజాబువ్రాశి అతని ముడుపులన్నియు తెప్పించు కొని బ్యాలిష్టరుగారితో నంబరు విషయములు తెలుసుకొన్నదై యీ తేదికి సరీఘాబయలు దేరి ప్రతివాదినిచూచి దిగులు చెందకుమని ధైర్యమునుచెప్పి, జడ్జీగారి యదట పురుషరూపముతో కూర్చొని యుండగా యీమాయాపురుషుని తేజస్సునకు రూపమునకు జ్ఞానము నకు వాగ్ధోరణకు వాదిపరంబ్యాలిష్టరు, వాది, జడ్జీ, సభవారందరు, అచ్చెరువొందుచుండగా ప్రతివాదినిచూచి, అయ్యాసుబుద్ధి నీకరారు ప్రకారం నీదొక్కయందు 2 శేర్లు మాంసమును వాదియగు దుర్బుద్ధి

కోసుకొనునట్లు చెప్పుము నీవు వ్యవహారమాడుటచే ప్రయోజనము లేదని చెప్పగా, దుర్బుద్ధి సంతసించెను, సుబుద్ధి స్నేహితుడు వెక్కివెక్కి యేడ్చుచు, ముందువచ్చిన బ్యాలిష్టరువుండిన మామిత్రుని బ్రతుకించు నేమోయనుచు, అయ్యా భ్యాలిష్టరుగారు, జడ్జీగారు (Judgement) జడ్జిమెంటు చెప్పకమునుపే మామిత్రుని ప్రాణమునుదీయుటకుపక్రమించితిరని వలవలకూర్చొని యేడ్చుచుండగా, సుశీలయను మాయాబ్యాలిష్టరు, దుర్బుద్ధినిచూచి అయ్యావాది యిక యెందుకు నిదానము యీతక్షణమున ప్రతివాదిడొక్కయందు రెండు శేర్లు మాంసం కోసికొనవచ్చు అని చెప్ప దుర్బుద్ధి నాకోర్కె యీడేరెనని సుబుద్ధి దగ్గరకునచ్చెను. అప్పుడు బ్యాలిష్టరు సుబుద్ధిని పరుండుమని చెప్పెను, పరుండిన సుబుద్ధిడొక్క శీల్చుటకు దుర్బుద్ధి మంచికత్తినిచే బూనగా సుశీలయను బ్యాలిష్టరు అయ్యా దుర్బుద్ధికత్తి పదునుగాలేదు కత్తిని బాగానుద్ధుకరమ్ము అనిచెప్పెను అప్పుడు దుర్బుద్ధి కత్తిని బాగానూరి సుబుద్ధి డొక్కశీల్చుట కుపక్రమించెను. అప్పుడు సుశీలయను బ్యాలిష్టరు, డాక్టరును దగ్గరవుంచుకొని అయ్యా దుర్బుద్ధి నీకవారు ప్రకారం 2 శేర్లు మాంసమునకు యెక్కువ తక్కువకాక కోసుకొనవలెను రక్తంవకతొట్టుయైనను యివతల రాకూడదు మాంసంమాత్రం కోసుకొనవలసినది అట్లుకాకరక్తము బయిట వచ్చినను మాంసము హెచ్చుకమ్మి కోసినను సుబుద్ధిప్రాణముపోయినను నీవే జవాబు చెప్పవలసినది రెండు శేర్లు మాంసమునకెంతో అంతయే నీకు అధికారమని చెప్ప, దుర్బుద్ధి యీవిషయములకు దిగులుపడి నా పదివేలు రూప్యములు నాకుయిస్తేచాలును, నాకు మాంసం అక్కరలేదనెను. అప్పుడు బ్యాలిష్టరు, ఓహో అట్లకాదు. నీకరారు ప్రకారంవాయిదా మీరినది మాంసమునకే నీకు అధికారము రూపాయలుకు అధికారములేదనిచెప్ప దుర్బుద్ధి ఖిన్నుడై వెళ్ళిపోయెను అప్పుడు సుబుద్ధి,

సుమతి, జడ్జీ, సభ వారందరు సంతసించిరి. సుబుద్ధి సుమతి సుశీలయను బ్యాలీష్టరునుచూచి మీకు కావలశినది యిచ్చెదమని చెప్పగా, సుశీల యను మాయా బ్యాలీష్టరు అయ్యా మీరు లక్షయిచ్చినను నాకవస్యా కములేదు యీసుమతి దగ్గరనుండు వుంగరమును యివ్వమని అడుగగా అప్పుడు సుమతి యోచించెను. ఆహా నాభార్య యీ వుంగరమును యవ్వరికి యివ్వవలదని యనేకవిధములుగా నాకు జెప్పియున్నది. నామీద ప్రేమవుండినట్లయిన యవ్వరికి యివ్వవలదన్నది యితడా మిత్రుని ప్రాణము గాపాడినాడు, నాభార్య నాయందు విసుకు జెందినను చింతలేదు నామిత్రుని బ్రతికించిన యీతడు సంతోషబడితేచాలును యని యీవుంగరమును యీమాయా బ్యాలీష్టరుకు యిచ్చెను అప్పుడు సుబుద్ధి సహా సంతసించెను. బ్యాలీష్టరు గ్రామమునకు బోయను పిమ్మట కొన్నిదినములకు సుమతి, సుశీల గ్రామమునకు బోయను అప్పుడు సుశీల నాథా యుంగరమేదియన యీవిషయమంతయు జెప్పెను అప్పటిలో యామెనవ్వి తానుచేశిన సాహసమునుదెల్పి యుంగరమును జూపించి నాథా భార్యకన్నను మిత్రుడే యెక్కువ, బంధువులు తల్లి తండ్రి అన్నదమ్ములు భార్య వీరెవ్వరికి వొకానొక సమయమందు కనికరమురాదు మిత్రునికి కనికరము కల్గును మిత్రునితో సమానమగు వస్తువయీ వృద్వియందు లేదని జెప్పెను కాబట్టి వుత్తముల సాంగత్యము ప్రాణమును గాపాడును.

శ్లో॥ విరహేపిసంగమఃఖలు పరస్పరసంగతంమనోయేషాం।
హృదయమపివిఘట్టితం చేత్సంగోవిరహంవిశేషయతి॥

లోకములో ఏ స్త్రీపురుషులయొక్క మనస్సు వరస్పరాను రాగముతో గూడుకొనియుండునో, అట్టివారు వకరినివకరు విడచినను. దూరదేశమందున్నప్పటికి కూడా, సమీపమునందున్నట్లు సంగమును గోరుచున్నారేగాని దూరమందున్న మాత్రముననె వియోగముగాదు. వ

స్త్రీపురుషులయొక్క మనస్సు పరస్పరానురాగము లేనిదియగునో, అటువంటివారు వక గ్రామమందుండినను వియోగమునే కలుగజేయును వకరినివకరు వదలుకొనుట కిష్టముగానుందురు. సమీపమునందున్ననువియోగమే కలుగునుగాన యిట్టిస్త్రీలు నమ్మినపుడువారిని విడనాడుటకై రచుట చాలా అన్యాయము.

శ్లో॥ స్నేహాహివరమఘటితో నపరంసంజాతవిఘటితస్నేహః।
హృతనయనోహివిషాదీన విషాదీభవతిసఖలుజాత్యంధః॥

స్నేహము శేయకుండుటయే వుత్తమము స్నేహముచేసి మరల దానిని విడపింపజేసుకొనుట వుత్తమముకాదు. కన్నులు కొన్నిదినములు బాగుగాకనుబడుచుండి పిమ్మట నవిపోయినవారికి దుఃఖముగాని పుట్టుగ్రుడ్డునకు దుఃఖము కలుగనేకలుగదు గదా.

పరోపకారార్థము యీదేహముగాన పరస్త్రీలు మిమ్మునునమ్మిన పుడు చెరచెక వర్తించుడి.

శ్లో॥ పరోపకారాయఫలంతివృక్షాః పరోపకారాయచరంతిగావః।
పరోపకారాయవహంతినద్యః పరోపకారార్థమిదంశరీరం॥

వృక్షములు పరోపకారార్థము ఫలించుచున్నవి గోవులు పరోపకారార్థము బిడుకుచున్నవి. నదులు పరోపకారార్థము ప్రవహించుచున్నవిగాన పరోపకారార్థమై పాటుపడి దేహమును సార్థక్యత నొందించుడి, పరోపకారార్థము పాటుబడుచుండు వారియొక్క, విషయమును గురించి, వ్రాయుచున్నాను.

## (పరోపకారార్థమై పాటుపడువారలు)

దేశమందంతంటనూ, నేనుచూచినంతలో, పరోపకారార్థమై త్రికరణశుద్ధిగా పాటుపడువారలు, కొందరుకలరు, వారెవ్వరన బ్రం॥ శ్రీ॥ మద్దగిరితాలూకు బేడతూరు గ్రామం, పంచాగం కృష్ణశాస్త్రిలవారు,

వీరు అపద్ధము పలుకనివారు, నిర్మలమైన మనస్సుకలవారు, సమస్తప్రాణులయందు దయకలవారు, కోపము నుత్యజించినవారలు, పరోపకారార్థమై తనదేహమునైనను యిచ్చుయిచ్ఛ గలవారలు.

కం॥ లోకాపవాదమునకిత డాకంపమునొందడోరులయందుగుణంబుల్।
జేకొనిసంతోషించును ప్రాకటగురుభక్తిగలుగుభవ్యుండితడే॥

మడకశిరాతాలూకా అనంతపురం గ్రామములోనుండు సుఖవసతి, బ్రాహ్మణ, బ్రం॥ శ్రీ॥ అప్పావధానులవారి కుమారులు రామాశాస్త్రులవారు, వీరు పరులకు, వుపకారములు చేయుటయందును సమస్త ప్రాణులయందు దయయుకలవారలు.

హిందూపురం తాలూకు, హిందూపురములోనుండు, వైద్యం, బ్రం॥ శ్రీ॥ ఛత్రం నానెప్పగారు, వీరలు పరోపకారార్థమై హిందూపురం రైల్వేస్టేషనువద్ద, అన్నచత్రమునుగట్టించి వచ్చినవారల నాదరించుచు చక్కగా అన్నదానముచేయుచు సమస్తప్రాణులను, వారివలనెజూచుచు, నేటివుడాక్టరు అనుబిరుదును వహించి, లోకమందంతటను, కీర్తివహించియుందు, వీరు మహాత్ములు.

పెనగొండతాలూకు లేలమర్ల గ్రామనివాసులగు, వెంకట రమణాచార్లువారి కొమారులు, మ॥రా॥రా॥ శ్రీ॥ హనుమంతరావుగారు. వీరు కోపములేనివారు, ఆశాపాశమును కోశివేశినవారు, సమస్త సందర్భములను దెలిశినవారలు, పర్వులకు. మంచినీతిమార్గము నుపదేశించువారు.

పెనగొండతాలూకా నారశింపల్లి గ్రామనివాసులగు, మ॥రా॥రా॥ శ్రీ॥ నారాయణరెడ్డిగారువీరు సమస్త జాతివారియందు, అనురాగము కలిగి, మంచిహృదయముచే, పరోపకారమును జేయుచు దేహమును సార్థకత, నొందించువారు.

పెనగొండతాలూకా, కొత్తచెరువులోనుండు, దేవాంగం అగసర నారెప్పగారు, వీరు మంచి, నెనరైనహృదయము కలవారలు, తమ్మును

యవ్వరైనను నమ్మిన చక్కగా పరోపకారార్థమై పాటుపడవారులు, మంచి
తెంపుగలిగి దానముచేయగలవారలు, ధర్మవరం డాక్టర్, విజయగంగం
మొదలియారు, వీరుమంచిమనస్సు, సర్వప్రాణులయందు దయపరోపకా
రము వీట్లయందు పాటుపడువారలు, కిడపవైశ్య, యాదాళినాగమ్మగారు
వీరు అన్నదానమునందునను, పరోపకారవిషయమునను ప్రతిలేని దాన
ము, చేయుచులోకమునందు మిక్కిలి ఘనతనువహించి దేహసార్థక్యతను,
బొందించు యీమెవిషయమై, యంతజెప్పినను జెప్పవచ్చును. హిందూ
పురంతాలూకా ముల్లుమోదుగపల్లెరా, రాశ్రీ శనివారం తిమ్మారెడ్డి
గారు వీరు దానమిచ్చుటలో తెంపుకలిగి దానముచేయువారలు అన్న
దానము చేయువారలు పరోపకారమందు మిక్కిలి శ్రద్ధగాపాటుపడువా
రలు. హిందూపురంతాలూకా కొట్టెపు, గ్రామందివాసులగు, మ-రా-
రా-శ్రీ, రెడ్డికరియణ్ణగారి, తిమ్మారెడ్డిగారు వీరు మహారసికులు, వకరికి
దానముచేయుటలో, తెంపుగలిగి, దానముచేయుచు పరోపకారార్థమై,
చక్కగా పాటుబడువారులు, హిందూపురంతాలూకు పరిగి నరసాపురం
గ్రామము, పంచాంగం, బ్రం॥శ్రీ. శివరామశాస్త్రిలవారు వీరు పరోప
కారమందు, అన్నదానమందు, చాలా, యిచ్ఛగలవారలు. యిదేతాలూ
కు, పరిగి కొత్తపల్లి గ్రామమునందు, మ॥రా॥రా॥శ్రీ, వైశ్యసుబ్బ
శెట్టిగారు, వీరు సమస్తప్రాణులను, (ఆత్మవత్సర్వభూతానీ) అను న్యాయ
శాస్త్రరీత్యా సమస్తప్రాణులను తనవలనె, జూచువారలు. అపద్ధమును
బలుకనివారలు, సమస్త జాతులవారికి, అన్నదానమును విశేషముగా
జేయువారలు. దానమిచ్చుటలో, వకరి ప్రోత్సాహమునకు లోబడియి
వ్వరా, జన్యగుణముగా, శ్రీకృష్ణులప్రీతిగా దానముసెనంగువారలు వీరి
యొక్క గుణమును యింతనివర్ణించి జెప్పనలవికాదు, ముఖ్యములో పరో
పకారార్థమై చక్కగా, పాటుబడువారు, వీరివిషయము యంతజెప్పినను
జెప్పవచ్చును.

క౦॥ పరులేమనినసహించును పరులయధర్మంబులెత్తిపలుకడితండూ।
పరదూషణవిననొల్లడు పరదూషణసేయనట్టిపావనుడితడే॥

పావగడతాలూక కనకాపురం గ్రామంమేజస్ట్రీట్, మహా రాజశ్రీ, వాసుదేవరావుగారు, వీరు అన్నదానమునందును దేవతాభక్తి యందును బ్రాంహ్మణ పూజయందును సమస్తప్రాణులయందు దయకలిగి చక్కగా పాటుపడువారలు, యిదేగ్రామమందున, మహారాజశ్రీ, మాసరాజనపల్లి, వెంకట రమణయ్యశెట్టిగారు, వీరలు దేవబ్రాంహణ భక్తియూ పరోపకారార్థమై చక్కగా, దేహమునుకష్టించి, పాటుపడు వారలు. మడకశిరాతా। కల్లుమరిగ్రామం కరణం మహారాశ్రీ, భాస్కర రావ్‌గారు, వీరలు, సమస్తప్రాణులయందు దయకలవారలు, దేవతా భక్తి బ్రాంహ్మణసేవ పరోపకారార్థమై పాటుపడడము మొదలుగా కల సత్కార్యములయందు ఆశకలవారలు, యిదేగ్రామం గ్రామంమేజస్ట్రీట్, మ-రా-రాశ్రీ, దానెగొండ్లవారు, వీరు పరోపకారార్థమై, తెంపుకలిగియు, సమస్త ప్రాణులయందు దయకలగియు, ఇచ్చుటయందు మితిలేని బుద్ధికలవారలై యుండువారు, హిందూపురంతాలూకా కమ్మవారపల్లె రామప్పగారు వీరు అన్నదానమునందును. పరోపకారము నందునను చక్కగా పాటుపడువారు, వీరు ప్రతిసంవత్సరమునందునను చైత్రమాసంబున రామజయంతిని జేయుచు బహుజనులకు అన్నదానమునుచేయుచున్నారు. వీరియొక్క బుద్ధి అతిశ్లాఘనీయము, గోరీబిదనూరు తాలూకు హెూసూరు వెలనాడు జ్వాలంభట్లువారు వీరు మహాసత్పురుషులు పరోపకారమందు చాలాశ్రద్ధకలవారు సమస్తప్రాణుల వుపకారార్థమై ఆగ్రామ సమీపంబుననే పదివేలురూపాయలు వరుసకు ఖర్చుచేసి భారీచెరువును కట్టించినారు. ఛత్రముకట్టించినారు, తోపువేయించినారు, ప్రతిసంవత్సరంబున నృశింహజయింతిని జేయుచు బహుజనులకు అన్నదానమును చేయుచున్నారు, వీరు దైవమునందు బ్రాహ్మణ

లయందు చాలాభక్తిగలవారు. మడకశిరాతాలూకా, కేతెపల్లి మరా రాజశ్రీ, యీరెగొండ్లువారు వీరు చాలాసందర్భములు తెలిసినవారు పరోపకారమందున భూతదయయందున అన్నదానమందున చాలానమ్మిక కలిగినమనస్సు కలవారలు. హిందూపురంతాలూకా దిన్నమీాద కొడిగిపల్లిగ్రామం, పం॥ బ్రహ్మశ్రీ॥ వే॥ వెంకటరావ్పగారు, వీరు అన్నదానమందును భూతదయ స్నేహితమునందును పరోపకారమందును బాగుగా పాటుపడువారలు మడకశిరాతాలూకు రేకులకుంట వైశ్యయల్లప్పగారు వీరు ప్రతివత్సరకార్తీక శు15 దినంబున కృత్తికోత్సవమును చేయించుచున్నారు, బ్రాహ్మణులకు బ్రాహ్మణేతరులకు విశేషముగా అన్నదానముచేయుచున్నారు. వీరు 51-60 ధర్మోపనయనములు చేసియున్నారు 2-3 ధర్మవివాహములు జేసియున్నారు. వీరు పరోపకారముకొరకు చక్కగా పాటుపడువారలు.

మడకశిరాతాలూకు రాయాపురం నరశిగొండ్లుగారు. వీరుమంచి రశికిభామణులు తెంపుకలిగి దానముచేయువారలు పరోపకారముకొరకు చక్కగా పాటుపడువారలు.

పెనుగొండతాలూకా పాముదుర్తి బయపరెడ్డిగారు, కదిరితాలూకా దొరిగిల్లు వెంకటరెడ్డిగారు వీరువుభయులియందు ముందుజెప్పియుండు వారివిషయములన్నియు వీరియందు జగత్ప్రశిద్ధముగా అవరించియున్నవి విశేషముగా జెప్పనేల మడ్ధగిరితాలూకా పెద్దదాళీవట్టం మ-రా-రా-శ్రీ, కరణం హనుమంతరావ్ గారు, వీరుసకల విద్యాప్రవిణులు దేవతావిషయమై పరోపకారవిషయమై చక్కగా పాటుపడువారలు. మద్రాసు, గంగాబాయమ్మగారు యీామెకంచియందు అన్నచత్రము శాశ్వితముగానుండునట్లు స్థాపించియున్నది కంచియందు ఇంకను చత్రములున్నను యీామెచత్రమందు రాత్రిపగలు 5-6 వేలు బ్రాహ్మణులకు అన్నదానము జరుగును, అతిశ్లాఘనీయము.

మ-రా-శ్రీ॥ మడకశిరాబండె నాజప్పగారు వీరు తెంపుకలిగి దాన ముచేయువారలు మంచిమనస్సుచే పరులకు నుపకారముచేయువారలు.

మ-రా-శ్రీ॥ గుత్తికరణం వెంకోబరావుగారు, వీరు సమస్తప్రాణుల యందు దయకలవారలు సమస్తసందర్భములను దెలిసినవారలు పరోప కారార్థమై ఆగ్రామమునకు మంచిబుద్ధికలిగి, పాటుపడువారలు, మ-రా శ్రీ, పద్యహ మడక శిరాతాలూకులోనుండు, తహశీల్ దార్ హెూసూరు రామస్వామిగారు వీరు సకల ప్రాణులయందు దయ, దేవతాభక్తియు, కవి తా చమత్కారమూ, వేద జ్ఞానమూ న్యాయాన్యాయ విచారణ, సత్యవాదిత్వము, మొదలుగాకలిగిన సద్గుణములుకలిగి పరోపకారార్థ మై పాటుపడు మహానుభావులు వీరివిషయమందు, సద్గుణములను యన్ని తెప్పినను జెప్పవచ్చును పావగడతాలూకు మానరాజనపల్లి కర ణం, మ-రా-రా-శ్రీ, వెంకట్రావుగారు వీరు అన్నదానమందు జగత్ప్రి ఖ్యాతి వహించినారు స్వదేశీమెడికల్ హాల్, ఆయుర్వేద యూనాని శా స్త్రివైద్యులు, ఎస్. సి. నంబిగారు, 22 రెడ్డిరామన్నవీధి, మదరాసు, వీరు పసిబాలుర సంరక్షణార్థమై ధర్మార్థముగా ఒక ఆస్పత్రిని పర్పాటుచే సియున్నారు, వీరివద్ద మంచిమందులు సరసముగా దొరుకును వలయు వారు వీరికేట్లాకును తెప్పించుకొని చూడవచ్చును.

పరోపకారార్థమై, పాటుపడువారలలో నాకునమ్మికగా తెలియుం డువారలు వీరు లోకమందంతటను, పరోపకారార్థమై పాటుబడి పుణ్య మును సంపాదించి కీర్తి వహించుచుందురని, భరతఖండనివాసులగు భ్రాత లను, మిక్కిలి వేడుచున్నాను. వివేకముకలిగి యిందలి వివరించియుండు విషయములన్నియు గ్రహించి సదాచారసంపన్నులై, యుండవలసినది.

(వివేకముపోవు మార్గము)

శ్లో॥ తావదేవకృతినామవిస్ఫుర త్యేషనిర్మలవివేకదీపకః ।
యావదేవనకురంగచక్షుషాం తాడ్యతేచటులలోచనాంచలైః ॥

లోకమునందు పండితులుకూడా. యంతకాలమువరకు మృగనే
త్రముల వంటి నేత్రములుకల స్త్రీలకడకంటి చూపుచేత, చూడబడరో
అంతవరకు పండితులకు స్వచ్ఛమగు వివేకముగల దీపము ప్రకాశించు
చుండునుకాని, స్త్రీలయొక్క చూపునకులోబడిన వివేక ముండనేరదు.
కాబట్టి వేదాంతశాస్త్రము, సంపూర్ణముగ నభ్యసించిన పండితులవా
క్కుచేత, మాత్రము, స్త్రీసంగమము నుద్దేశించి, వినువవలయునని
చెప్పుచుందురేకాని, వాస్తవముగా వినువజాలరు. యత్రని ముఖులచేత
చక్కబడిన మొలనూలనిగ్గు. నాభిస్థానములచేత ప్రకాశించుచున్న
స్త్రీలయొక్క, జఘనప్రదేశములను. యవ్వరు వినువగలరు, యవ్వరు
వినువజాలరు. వినునవివానికి వివేకముండనుజాలదు, యంతశాస్త్రము
జనువినను. యంతవివేకము కలవాడైనను, సంసారమందు తగులు
యుండిన. సద్గతి దొరకుటదుర్లభము. పైవిషయములలో యంతిచెప్పి
నను జెప్పవచ్చును. ప్రయత్నము లేదే. ప్రారబ్ధాను సారముగా యేయే
విధముగావలయునో. ఆయావిధముగా జరుగునుగాని. కాకమానదు.

## భక్తి మార్గము

శ్లో॥ యోనహృష్యతి నద్వేష్టినశోచతి నకాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్సమే ప్రియః
గతార్థాన్నానుశోచంతి నార్థయంతే మనోరథాన్।
వర్తమానేనవర్తంతే తేరమే ంశవాప్రియాః

యవడు సంతోషింపడో, యవ్వరు ద్వేషమునొందడో, యవ్వ
రు దుఃఖింపడో, యవడు శుభాశుభములను వదలుకొని, భగవంతుడగు
నాయందు భక్తికలవాడై, యుండునో, వాడు నాకిష్టమైనవాడు, పాం
డవులు గతించిన యర్థమును గురించి. దుఃఖింపరు, రానిదానిని గోరరు
యేవి లభించియున్నవో, దానిలో తృప్తినొందియుందురు, కావున

పాండవులు నాకు ప్రియమైనవారలు, అని భగవంతుడగు, శ్రీకృష్ణులవారు, అర్జునులవారికి జెప్పిన వాక్యములను గ్రహించి, గతించి పోయినదానిని, స్మరింపకయు, రాబోవుదానిని గురించి యాలోచింపకయు, అనాలోచనగా దొరకినదానిని అనుభవించుచు, ఈదేహము అనిత్యమనియు, లోకమునందు శాశ్వతమైనది. యావది లేదనియు, దైవమాయలో జిక్కియున్నామని తలంచి, పురుషుడు చేయు ప్రయత్నములలో పుణ్యము సంపాదించు ప్రయత్నమె ముఖ్యముగా జేయుచు సమస్తపాపములకు కష్టములకు ఆధారభూతమయిన, యీసంసారము, భార్య, పిల్లలు, తల్లి, తండ్రి, సోదరులు, బంధువులు మొదలుగాగల లోకమును, మిథ్యయని దలంచుచు.

శ్లో॥ కృష్ణత్వదీయ పదపంకజ పంజరాంతః ।
మద్యైవ మేవిశతు మానసరాజహంసః ।
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః ।
కంఠావరోధనవిధౌ స్మరణంకుతస్తే ।

హే కృష్ణా, నీయొక్క పాదములనే పంజరములో మానసరాజహంసనైన నన్ను యిప్పుడే చేయుము, ప్రాణము పోవుసమయమందు కఫముచే కంఠముకట్టినప్పుడే, నిన్ను స్మరణజేయుట అవునోగాదో, యని దేవాదిదేవుని స్మరణజేయుచు ఉండవలెను.

శ్లో॥ అర్థాగృహే నివర్తంతే స్మశానే మిత్రబాంధవాః ।
సుకృతం దుష్కృతంచైవ గచ్ఛంతమనుగచ్ఛతి ।

మనము సంపాదించియుండు ద్రవ్యము పరమాత్మ పంచభూతాత్మకమైన శరీరమునుండి వెళ్లునప్పుడు, యింటియందుండును, మిత్రబాంధవులు, భార్య పిల్లలు మొదలగువారు పంచభూతాత్మకమైన శరీరము వెంబడి స్మశానమువరకు వత్తురు. శాశ్వతమైన పరమాత్మ వెంబడి

రారు, తానుచేసిన పుణ్యము, పాపము, పరమాత్మ వెంబడివచ్చునే కాని, మరెవ్వరురారు అ శాశ్వతమైన యీదేహమును, సంసారాం బుధిలో పడద్రోయక విరక్తిమార్గము నవలంబించి, వేదాంతమార్గము నభ్యసించి, స్వయంజ్యోతిని, తన్నుతాను దెలుసుకొన్నవాడై, భగవంతుని సాన్నిధ్యము జేరుకురని ముఖ్యాంశము.

శ్లో॥ భోగేరోగభయం కులేచ్యుతిభయం విత్తేనృపాలాద్భయం।
మానెదైన్యభయం గుణేఖలభయం రూపెజరాయాభయం।
శాస్త్రేవాదిభయంబలేరిపుభయం కాయేకృతాంతాద్భయం।
సర్వంవస్తుభయాన్వితం భువినృణాం వైరాగ్యమేవాభయం

భోగేచ్ఛగలవారికి రోగభయము, సత్కులమువారికి కులమున నెరిసుకిలుగునను భయము, ధనవంతులకు, రాజభయము మానవంతులకు దీనత్వము సంభవించునను భయము గుణవంతులకు దుర్మార్గుల భయము. శాస్త్రజ్ఞానులకు వాదిభయము రూపవంతులకు ముసలితనము ప్రాప్తించునను భయము బలవంతులకు శతృవులభయము శరీరమునకు, యమునిభయము, లోకమునందుండు సమస్త విషయములకు, భయము కలదు, వైరాగ్యమునకు, భయమేమికలదు. గాన వైరాగ్యముతో సమానమైన పదార్థములేదని, యీపదార్థమునుగైకొని కృతార్థులగుటకు ప్రయత్నముచేయువలయును.

## వేదాంత మార్గము.

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం।
యేకంనిత్యం విమలమచలం సార్వదాసాక్షిభూతం।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుంతన్నమామి॥

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుర్గురుర్దేవ మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః ॥

శ్లో॥ గురవేసర్వలోకానాం భిషజేభవరోగిణాం ।
నిధయేసర్వవిద్యానాం దక్షిణామూర్తయేనమః ॥

శ్లో॥ వ్యాసశంకరరూపాయ ప్రణవార్థస్వరూపిణే ।
సూత్రభాష్య కృతేతస్మైయిగురవే కరివేనమః ॥

## వేదాంత ప్రకరణం

మిత్రులారా, నశ్వరమైన ప్రపంచము స్థిరమని యెంచదగినదే, మాయయనబడును, యీలాటిమాయాంధకారమును బోగొట్టుటకొరకు చతుర్వేదములు, షట్శాస్త్రములు, అష్టాదశపురాణములు, ఉక్తిచరిత్ర ముదలగునవి. విచారమునకు అధారములైననూ, అనాది శిద్ధమయిన ఈ మాయనులొలిగించుటకు అసాధ్యమై మహనీయులైనవసిష్ఠ, విశ్వామిత్ర, జమదగ్ని, కస్యప, భరద్వాజ, వాలఖిల్య, మైత్రేయ, కణ్వ, కాత్యాయన, యాగ్న్యవల్క్య, మొదలైన మహనీయులు, తొమ్మిది ముక్తిపథములబట్టిపోయిననూ మాయయొక్కలోతు తెలియక దివ్య సంవత్సరములు తపోనిష్ఠులై, ఉండినను ముక్తిద్వారము తెలియక మాయాగృహమందు సంచరించి, యీనవయోగ సిద్ధివల్ల జ్ఞానోదయమై ఆత్మవిచారమువల్ల కలిగిన, అజ్ఞానాంధకారమైన, మాయానివృత్తి, అనంతప్రాప్తిమైన, నిజముక్తిని స్వస్వరూప అనుసంధానమువల్ల, తన్ను తాను తెలిసినవారలై, జీవన్ముక్తులై నారని, సమస్త పురాణేతి హాస ములయందు, మనము వింటున్నాముగదా? ఇప్పటికాలమందు అల్పమతులైన మనము, చిత్తస్థయిర్యత ఉంచుటకొరకు, మహనీయ్యులుచూపినతొమ్మిది మార్గములుబట్టి బోయినయడల, పదియవమార్గమైన, జ్ఞానయోగమనెడు, వెలుతురులోపడి, సుప్రకాశమైన తమయొక్క, స్వస్వ

రూప జ్ఞానవెలుతురులో, అజ్ఞాన నివృత్తినిజేసి, పరమానందమును బొంది, దేహాదిప్రపంచమును, దగ్ధపట న్యాయముగానెంచి, నిజముక్తులగుదురనుట. నిజమైన వేదాంతమార్గము గదా హేమిత్రులారా మొదటి సోపానమైన, మంత్రయోగము నవలంబించి, వాక్శుద్ధి పొందుటయే, మంత్రయోగమని చెప్పెదరు. యీసప్తకోటి మహామంత్రములకు శిరోరత్నమైన, ఆత్మస్వరూపమైన, గాయత్రి మహామంత్రమే సర్వశ్రేష్టమని, వేదోదితముగా నున్నదిగాన, యీలాటి మహామంత్రయోగమును. శాస్త్ర సూక్తప్రకారము, మంత్రాంగ సహితముగా, మహాగాయత్రి స్వరూపమును, వాచ్యార్థ, లక్ష్యార్థములయందును, మంత్రాధిదేవత స్వస్వరూపమును ధ్యానించి, నిధిధ్యాసముల యందుంచినయెడల సంశయములేక వాక్శుద్ధికలుగును. (వాక్ అనగా) సమస్త విధములకు, ఆధారభూతమైన వాణియనబడును. యీయొక్క వాణినిజ యించిన యెడల, అన్యవిద్యలను జయించి, పరవిద్యను సాధించవచ్చును, యీలాటి మంత్రయోగమునకు, క్రమమయిన, అంగములుండవలయు యీ అంగములవల్ల, మంత్రము సజీవమనబడును, అంగరహితముగా నుంచిన యెడల నిర్జీవమంత్ర మనబడును. అంగసహితమైన సజీవ మంత్రమును అనుష్టించవలయును. అంగము లెవ్వియనగా, భూశుద్ధి, భూతశుద్ధి, అంతర్మాతృక బహిర్మాతృక, ప్రాణాయామ, దిగ్బంధన, రక్షాయంత్రము, జపచక్రోద్ధారము, కులచక్రము, షడామ్నాయమూలం, పరస్పర సాంప్రదాయరహస్యము, ఋషి, దేవతా, ఛందస్సు, బీజం, ఆకృతి, మంత్రపల్లవం, మంత్రసంస్కారం, మంత్రదీక్ష, ఖడ్గ, మాలా, కవచ, తంత్రబలి, స్వభావ, మైత్రి, గళకా, ప్రసవ, ప్రకృతి, వికృతి, ప్రియ, అనంత, యీలాటి అంగన్యాస, కరన్యాసయుక్తముగా, అనుష్ఠించినయెడల, సమస్తకారణములకు మూలకారణమైన, యీ గాయత్రియను పరదేవతను స్వాధీనము పరచుకొనుటదే. మంత్రయోగ మనబడును. యీలాటిమం

త్ర యోగమును, కారణగురుపులవల్ల, మంత్రోపదేశము పొంది, యీ ప్రథమ సోపానమునుదాటి ద్వితీయసోపానమైన హఠయోగము నవలంబించి, సాధనచతుష్టయ సంపన్నుడైన ముముక్షువుయమ నియమ, ఆసన ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణధ్యాన, సమాధిస్థితియందు, నిష్ఠాగరిష్ఠుడైన తపస్వియే, అణిమాద్యష్ట సిద్ధులనుపొందునని, పాతంజలిమహాపురుషులయొక్క మతము, యీలాటి యోగమువల్లనే, సమస్త పురుషులు, దేవదానవులు, యక్ష, కిన్నర, కింపురుషులు, సిద్ధసాధ్య, పన్నగులు, మొదలయినవారలు, అణిమాద్యష్ట సిద్ధులనుపొంది, సమస్తలోకములయందు, ఇచ్ఛామాత్రముగా సంచరించి, ఆయునిర్ణయము లేక, బ్రహ్మలిఖితమును జయించి, ఇచ్ఛాసుఖమును పొందిరని, పూర్వకథాసార సంగ్రహమువల్ల, మనము యిల్లప్పుడు వింటున్నాముగదా ఆలాటి హఠయోగము నవలంబించి, మంత్రయోగమువల్ల చిత్తశుద్ధినిగలిగి, సాధనచతుష్టయ సంపన్నుడైన, ముముక్షువుయమ మనెడు దశఅంగములను నిగ్రహించి, నియమమనెడు దశఅంగములను పరిగ్రహించి, యెనభైనాలుగు ఆసములను సాధ్యపించి, రేచక పూరక కుంభకమనెడు, ప్రాణాయామమునుచేసి, మలినమైన పాపపురుషుని దగ్ధముచేసి, నిర్మలమైన మనస్సుచేత, ప్రత్యాహారమువల్ల, అంతరేంద్రియ బాహ్యేంద్రియనిగ్రహమునుచేసి, చిత్తవృత్తిని, అస్తి, భాతి, ప్రియస్వరూపమగు, సచ్చిదానంద స్వరూపమయిన దివ్యతేజస్సుయందు, చిత్తవృత్తిని భ్రూమధ్యమందుంచు, అపురవీక్షమందునిచి, ఈ ధారణబలముచేత, ధ్యానముచలించక, పూర్ణసుఖమైన సమాధిస్థితియందు, ఉండుటే హఠయోగమనబడును, ఈలాటియోగమునకు ముఖ్యకారణమైనది, ప్రాణాయామము ప్రాణాయామమనగా) ఈప్రాణాయామము త్రివిధములుగా నున్నది, ముముక్షువుయనువాడు, పద్మాసనారూఢుడై నాసికాగ్రమును మధ్య అనామికాంగుష్ఠములలో బట్టి వామనాసాపుటముచే పదహారు మాత్రకలు

పూరించి అరవై నాలుగుమాత్రకలు కుంభకముచేసి (కుంభకమనగా) వాయువునిలిపి, మూలమంత్రమును పఠించి, ధ్యేయవస్తువును జూచుచు, ముప్పై రెండు మాత్రుకలు, దక్షిణనాసాపుటముచేత, రేచకము (అనగా) వాయువ్వువిడచి, పునహా అదేనాశిక ద్వారమువల్ల, మొదటచెప్పినప్రకారం పూరించి కుంభకమువల్ల రేచించడమె, ప్రాణాయామమనబడును, ఇలాటి ప్రాణాయామమువల్ల, కాయశిద్ధినిబొంది, మూలాధారస్వాధిష్ఠ మణిపూరక, అనాహత, విశుద్ధ ఆజ్ఞేయ, శింశుమార, ధృవ, సహస్రార చక్రములయందుండు, రహస్యమునుదెలసి ముక్తిస్థానమందుండు సాక్షాత్పరమాత్మని, దివ్యస్వరూపమును ధ్యానించి ముక్తులగుటయే రెండవ సోపానమయిన, హఠయోగమనబడును, మూడవ సోపానమయిన, లయయోగము నభ్యసించవలయును, పృథ్విని అప్పుయందు అప్పును, అగ్నియందు అగ్నినివాయువునందు వాయువును ఆకాశమందు ఆకాశమును అవకాశమైనమహత్తత్వమందు, అవకాశమును మహాతత్వమందు, మహాతత్వమును చిత్తమందు చిత్తమును మనస్సునందు, మనస్సునుబుద్ధియందు, బుద్ధిని జ్ఞానమందు, జ్ఞానమును ఆత్మస్వరూపమైన, నిజసుఖమందులయించుటయే, లయయోగమనబడును. యీమూడవ సోపానమును దాటినయడల, శాంత రాజము, అమనస్కయోగమనెడు రెండుసోపానములుదాటి. భక్తియోగంబనెడుసోపానములనెక్కి త్రివిధములగుబాహ్య అనన్య, అంతరములైన భక్తిమార్గయత్రయములవల్లను సత్వ, రజస్తమోగుణస్థులైన, వారనుష్టించవలసిన పథమేమనగా, (బాహ్యాభక్తి) "అనగా" దివ్యలోకమైన, వైకుంఠ, కైలాస, సత్యలోకములనెడు, త్రిలోకములలోనుండు, నిత్యసత్యస్వరూపులైన, బ్రంహవిష్ణు మహేశ్వరుల, సగుణరూపమైన, దివ్యవిగ్రహములనుబట్టి, నిత్యానైమిత్తక కర్మాదులనుదీర్చి వేదోక్తప్రకారముచేత, సాలంకృతమైన, చతుర్భుజయుక్తమైన, సారూప్యమగు విగ్రహాదులను, నవవిధములైన, భక్తిమార్గము

లచే, షోడశోపచారములయిన, పూజలొనర్చుటయే బాహ్యభక్తి అనబడును. నాశరహితములైన, కైలాస వైకుంఠములందుండు నిజ మూర్తులను అనన్యభావముచాత, నిజస్థలమందు, పరిశుద్ధాత్ముడై నిర్మలమైన మనస్సుచేత సుఖాసనమునునుండి, అంతర్లక్ష్యయుతుడై, చతుర్భుజయుక్తులైన, సాలంకారమూర్తులయందు చిత్తవృత్తినిలిపి యడతెగని మనోదార్ఢ్యమువల్ల దివ్యసుందర విగ్రహములను నవరత్నఖచితమైన దివ్యసింహాసనమునందు ఆవాహనచేసి, సమీచీనమైన వస్త్రాభరణములచేతఅలంకరించి, చంద్రసూర్యాగ్నికళలను, మూర్తులందు నిలిపి, సంపూర్ణకళ యుక్తమగు దివ్యసుందర తేజోధిష్ఠితములగు, మూర్తులలను, మనోభావముచేత, మానసపూజనొనరించి, మృదుమధురమైన మాటలచేత. మూర్తులను స్తోత్రముచేసి, శుద్ధసాత్విక మనెడు, కర్పూరమును జ్ఞానాగ్నివల్ల, ప్రజ్వలించి, నిజమూర్తి స్వస్వరూప పరిపూర్ణానందమనెడు. సాగరములో మునుంగుటయే, అనన్యభావమనబడును, యిదియే, అంబరీష, అక్రూర, ముచికుంద, ప్రహ్లాద, పరాశర, నారద, శుక, శౌనక, బకదాల్భ్య, భీష్మ, పుండరీక, వ్యాస, రుక్మాంగద, అర్జున, హనుమంత, వసిష్ఠ, బలి, ఇంద్రాదులే మొదలైన వారలు యీఅనన్య భావముచేత, ఆత్మారామత్వముయందు, మూర్తిధ్యానమువల్ల, దేహాదిప్రపంచమును, లయించి, సాలోక్య సుఖమునుపొందిరని, మహాభాగవతాదిగ్రంథములయందు, జెప్పబడియున్నది గదా. ఈలాటి మూర్తులను,బహుకాలము ధ్యానించుటచే కలిగినపరిపూర్ణానందమువల్ల, ధ్యానధ్యేయవస్తువుయేకమని ర్వికల్ప, సమాధిస్థితియందు పరిపూర్ణానందమై ఏకమైనిత్యమై, విమలమైఅచలమై సర్వదా సాక్షిభూతమై సుఖదుఃఖరహితమై, భావాతీతమై వాఙ్మనస్సుక గోచరమై ఉండుటయే, అంతర్భావమనియు, నిజసుఖమనియు, యీత్రివిధమైన, భక్తిమార్గములనెడు సోపానములుగల దివ్యజ్ఞానమును కలిగి, ఆత్మ అనాత్మ విచారపరుడై వివేకవైరాగ్య

శమాదిషట్కము ముముక్షుత్వమనెడు సాధనచతుష్టయ సంపన్నుడైనవాడేమముక్షువుయనబడును. (అనగా) "మోక్షాధికారి" (వివేకమనగా) ఆత్మ "అనాత్మవిచారం" వైరాగ్యమనగా ఆత్మవినహా అన్యపదార్థములయందు యిచ్ఛలేకయుండుట" (శమాదిషట్కమనగా) శమ, దమ, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానా, యివియే సాధన చతుష్టయములనబడును యివి అభ్యసించినవాడే. ముముక్షువు "మోక్షాధికారి" అధికారియైన మనుజుడు, సద్గురువుల నాశ్రయించి, వారి అనుగ్రహములకు పాత్రుడై, మనోవాక్కాయ కర్మలచే, శుశ్రూషచేయుచు వేదాంత తత్వ రహస్యమును దెలియవలెను. యీప్రకారము దెలిసినవాడై, ఆత్మ వినహా వేరెపదార్థమును లేదనియు మాయాభాసమైన, ప్రపంచము మిథ్యమనియు, ఆత్మనే, సత్యమనియు, నిశ్చయించి నిశ్చయజ్ఞానము కలుగుట "జ్ఞానమనిపేరు" అఖండల, ఏకరస, అద్వైత, సత్యజ్ఞానానంద, నిత్యనిర్మల, స్వయంప్రకాశ, పరిపూర్ణ వస్తువైనా, జాతి, ప్రియరూపమైన, సచ్చిదానంద స్వరూపమైన, అద్వితీయమైన, పరబ్రంహామందు, మిథ్యాస్వరూపమైన, ఇచ్ఛాయను మాయకలిగి, ఆమాయవల్ల, అవకాశముకలిగి, అవకాశమె ఆకాశమై, ఆకాశమందు వాయువుకలిగి, వాయువునందు అగ్ని, అగ్నియందు అప్పు, అప్పుయందు పృథ్వి, పృథ్వియందు ఔషధములు, ఔషధమువల్ల అన్నము, అన్నమువల్ల, శోణితము, శోణితమువల్ల మాంసము, మాంసమువల్ల మేదస్సు, మేదస్సువల్ల అస్థి, అస్థివల్ల ఇంద్రియము, ఇంద్రియమువల్ల పిండోత్పత్తి, యీ పిండమె పృథ్వి, అప్పు తేజస్సు, వాయువు, ఆకాశములనెడు, పంచభూతములయందును పంచపంచ అంశములనుపొంది, పంచవింశంత్యాంశములై ఘటమాయను. యీఘటమె, స్థూలశరీరమనబడును, యీశరీరమునకు జ్ఞానేంద్రియములైదు, (అనగా) శ్రోత్ర, త్వక, చక్షు, జిహ్వా, ఘ్రాణము లనునవి, ఘ్రాణేంద్రియములు, వాక్కు, పాద, పాణి, ఉపస్థ, వాయువు

లనెను, యివియే, ఐదు కర్మేంద్రియములు, ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, యివియే పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, సహా, చేరిన, 17 సప్తదశ కళాత్మకమైన సూక్ష్మ దేహమనబడును, దీనికి ప్రాజ్ఞుడే అధిదేవతా, కారణదేహమనెను, సప్తావరణముచేత జేరిన మాయా స్వరూపమైన, అజ్ఞానకారణ దేహమనబడును. యీలాటి దేహాది ప్రపంచమె, తానని భ్రాంతిజెంది, మాయాంధకార కుహరములో జిక్కి భావనాత్రయమువల్ల, జాగ్రత్స్వప్న, సుషుప్తలనెడి, అజ్ఞానప్రపంచమును, సత్యమని యెంచుటయే, అజ్ఞానమనబడును, యీలాటి అజ్ఞానమును పోగొట్టుటయే, సుజ్ఞానమనబడును, ఈలాటి సుజ్ఞానియైనవాడు, స్థూలదేహము నేనుకాదనియు, స్థూలదేహముకంటును, పృథ్వీసంబం

శ్లో॥ అస్థిమాంసత్వచోనాడీ రోమాంచైవాదిపంచకం।
పృథ్వీపంచగుణంచైవ తదంశాని ప్రకీర్తితాః

అస్థి, మాంసము. త్వక్కు, నాడి, రోమము. పృథ్వీసంబంధము. యీపదిఅంశములు నేనుకాదనియు.

శ్లో॥ శ్లేష్మమూత్రంచ తథా స్వేద, శుక్లశోణితమేవచ।
అపఃపంచగుణంచైవ తదంశాని ప్రకీర్తితాః।

శుక్లము, శోణితము, లాలము, మూత్రము, స్వేదము, జలసంబంధమైన, ఈ ఐదంశములు నేనుకాదనియు.

శ్లో॥ క్షుధాతృష్ణాతథానిద్రా ఆలస్యం సంగమేవచ।
అగ్నిపంచగుణంచైవ తదంశాని ప్రకీర్తితాః।

క్షుధ, తృష్ణ, ఆలస్య, నిద్ర, సంగమం, అగ్నిసంబంధమైన, ఐదుగుణములు నేనుకాదనియు.

శ్లో॥ చలనంధావనంచైవ ఆకుంచననిరోధనం।
విరోగశ్చేతి విజ్ఞేయ వాయుఃపంచగుణాస్మృతాః॥

వాయుసంబంధమైన, చలన, ధావన, ప్రసరణ, అకుంచన, నిరోధన మొదలైన వస్తువు నేనుకానియు.

శ్లో॥ రాగద్వేషభయాలజ్జా మోహాశ్చాప్యయథాతథా।
నభోపంచగుణాః ప్రోక్తంతదంశాని ప్రకీర్తితాః॥

రాగము, ద్వేషము, భయము, లజ్జా, మోహము, అను ఆకాశ సంబంధమైన, ఈఅయిదు గుణములు నేను కాననియు. ఈయిరువై యైదు గుణములుచేరిన, స్థూలదేహమునకు. సాక్షియైయున్నానని, సూక్ష్మదేహమును విచారించుము, సూక్ష్మదేహమైన, జ్ఞానేంద్రియములు నేను కానియు. కర్మేంద్రియములు నేను కానియు, పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, నేనుకాననియు, యెంచుటయే. సూక్ష్మదేహ నిరసనము ఖనును, కారణదేహమైన, మిథ్యాస్వరూపమయిన, మాయయనను, అజ్ఞానము, నేనుకాననియు. జాగ్రత్స్వప్న, సుషుప్త్యవస్థాత్రయములకు, దేహత్రయములకు. నేను సాక్షివున్నాననియంచి, దేహాదిప్రపంచమేలేనందున, సాక్షిలేనందున, నేనే వున్నానని, నాకు పరిమాణములేనని సర్వమూనేనై నేనేసర్వమై సుఖదుఃఖరహితమై, భావాతీతమై, పరమానందస్వరూపమై, అఖండల, ఏకరస, అద్వైత, సత్య, జ్ఞానానంద, నిత్య నిర్మల, స్వయంప్రకాశ స్వరూపమై, ఉండుటయె, నిజవస్తువయనియు, పరమాత్మయనియు, పరబ్రంహమనియు, సచ్చిదానంద స్వరూపమని యు, ఎంచి, స్వస్వరూపమైన, ఆత్మపంచలతుణమనస్కుడై, ఉండుటయే జ్ఞానయోగమనబడును, ఈలాటి జ్ఞానయోగమువల్ల, అజ్ఞాననివృత్తి యై, పరమానంద ప్రాప్తియగునని, శృతిస్మృతి, పురాణేతిహాసముల

యుందు, జెప్పబడియున్నదిగదా, "మిత్రులారా" యీవిషయమును, అభ్యసించుట, దీనియందు ప్రవేశించి, కైవల్యపదముగనుట అసాధ్యమనియు, ముఖ్యము నేను జెప్పియుండువన్నియు గ్రహించక దైవేచ్ఛ వలనె కలుగుచున్నదిగాని మనప్రయత్నమేమియు సాగదనియు యెంచవలదు.

శ్లో॥ ఉత్సాహం సాహసంధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః।
షడ్భిర్మనుష్యయత్నానాం సప్తమందైవచింతనం॥

ఉత్సాహము, సాహసము, ధైర్యము, బుద్ధి, శక్తి, పరాక్రమము యివి ఆరున్నూ, మనుష్యుడుచేసిన యీమాదికార్యములకేగాని, దైవసహాయము నొకపాలుమాత్రమే, భ్రాతలారా, సర్వకార్యములకు, తప్పక ప్రయత్నముజేయుచు, కీర్తినిపొంది మనభరతఖండమును దేశాభిమానులై వృద్ధికి తెస్తురని మిక్కిలి వినయముగా ప్రార్థించుచున్నాను. ఈప్రబంధమునందలి విషయములు శ్లోకములు, పద్యములు, మొదలగునవి, కొన్నిగ్రంథముల సహాయముచే యుంచు, కనపరచియున్నాను. యిందులో కొన్నిచోట్ల గ్రంథబాహుళ్యముచె శ్లోకార్థములు పూర్తా చేయలేక ముఖ్యమైన అంశములు వేశియున్నాను.

ఈప్రబంధమునందు యన్ని నెరసులున్నను యన్ని అపశబ్దములున్నను. యన్ని అపార్థములున్నను వక్రవక్రముగా తెలియబడని మాటలు తమబిడ్డలాడుచుండగా తలితండ్రులు ఆమాటలనే, కిన్నరులు జేయు వీణా మృదంగాది మొదలైన వాద్యములవలనే చిలుకపలుకుల వలెన ఆలకించివిని యేలాగు సంతసించి ముద్దిడుచున్నారో ఆలాగున ఈగ్రంథమునందు యెన్ని నెరసులున్నను, వాటిని యెంచక గొప్ప వింతునని ప్రార్థన ప్రాజ్ఞులైనవారలు దోషమును దీసివేసి గుణమున్నే ప్రధానముగా జేతురు. గాన నాయందు యన్నిదప్పులున్నను దూషించక

ఈప్రబంధమును గౌరవింతురని భరతఖండ నివాసులగు భ్రాతలను గూర్చి ప్రార్థన జేయుచున్నాడ.

సంపూర్ణము.



నిర్ణయసింధౌతృతీయ పరిచ్ఛేదే శ్రాద్ధనిర్ణయః పేజీ. 344.

"శూద్రదృష్టాన్నగ్రాహ్యః పరాశరః"

శ్లో॥ తద్విష్ణోరితిమంత్రేణ గాయత్ర్యాచప్రయత్నతః ।
ప్రోక్షయేదన్నజాతంతు శూద్రదృష్ట్యాదిశుద్ధయె ॥

శూద్రుడన్నము చూచుటవలన కలగిన పాపనివృత్తికొరకు తద్విష్ణోః పరమంపదం అనుమంత్రముచేతను గాయత్రీ మంత్రముచేతను అన్నమును ప్రోక్షించిన శుద్ధినొందును.

మద్యమాంసాది నిషేధః.

వృద్ధహారీతసంహితాయాం షష్ఠోధ్యాయః.

శ్లో॥ సురాయాః ప్రతిషేధస్తు ద్విజానాం మునికీర్తితః ।
విశిష్టస్యాపిశూద్రస్య పాతిత్యమనుక్రమవత్ ।

బ్రహ్మక్షత్రియ వైశ్యులకే సురాపానము నిషేధమని చెప్పుట కాదు శూద్రునకుకూడా నిషేధమే అనృతము, మద్యమాంసము, పరస్త్రీసంగమము, పరద్రవ్యాపహారణము, శూద్రునకుకూడా విశేషనరకప్రాప్తియని మనువు వచించియున్నాడు.

"కన్యాప్రశంస" "కన్యావిక్రయప్రశంస"

శ్లో॥ శుల్కేనయేప్రయచ్ఛంతి సుహితాంలోభమోహితాః ।
తేయాంతినరకేఘోరే యావదాభూతసంప్లవం ।
గమనాగమనాద్యోగా దేవంశుల్కవినిర్ణయ్యతే ।
యేవంజ్ఞాత్వాచయుక్తింతాం కన్యాంవిందేతసత్కులం ॥
నస్యాద్దివేచపిత్రేచ దాసీస్యాదధసేవితా ।
క్రయక్రీతాతుసాదాస నసాపత్నీవినిర్ణయ్యతే ॥
అగ్నిష్టోమాతిరాత్రాణాం శతంశతగుణాకృతం ।
ప్రాప్నోతిపురుషోదత్వా హోమాదిసమంత్రేరలంకృతం ॥

యస్తుసత్యేణధర్మేణ పితాచాప్యయతేసుతాం ।
సుప్రీత్యలభతేస్థానం యథాదక్షఃప్రజాపతిః ।

యెవ్వరు లోభమోహముచే యుక్తులై తమపుత్రికను క్రయమునకు విక్రయించుచున్నారో, వారు మహాప్రళయపరి యంతరము ఘోరమైన నరకమును పొందగలరు.

(నరకమనగా)

సీ। కరుకుపగ్గములను కంఠమూలముఁగట్టి యురియొయ్యంగ నీడ్చుకొంతసేపు ।
జల్లునరక్తముల్ వెళ్ళంగ బల్లేల కొసరిగుమ్ముచుండ్రుకొంతసేపు ।
కడకాలుబట్టి వెక్కసముగా నేలపైఁ గూలవేయుచుండ్రుకొంతసేపు ।
మిట్టనెక్కించి బల్మిగనూకి పల్లాలకుఁ ద్రోతురుకొంతసేపు ।
విద్యాప్తకన్యకావిక్రయాసక్తుల । కంఠములుధారి చెంపలుమ్రాగిపోవ
కాచిపోయుదురీసంబు కనికరములేక । కోయుచుందురు కోడవండ్ల క్రూర
మతుల ॥

ఈలాగు విక్రయించుటవలన గలిగినదోషము తెలుసుకొని కన్య సత్కులమందు బుట్టిన వరుణ్ణిపొందవలయును ఈలాగు విక్రయించిన కన్యకకు, యజ్ఞములయందు, శ్రాద్ధాదులయందు, అధికారములేదు పురుషునిచే సేవింపబడు దానిగా జెప్పబడుచున్నది యిట్టివనిత దాసి గాని ధర్మపత్నియనబడదు, వివాహమంత్రముచె సంస్కరింపబడిన కన్యను యెవడు వరునికొరకు అర్పణజేయుచున్నాడో, అతడు నూరుమారులు చేయబడిన అగ్నిష్టోమాది క్రతుఫలమును బొందుచున్నాడు తండ్రి యైన యేపురుషుడు సత్యమైన ధర్మమార్గముచే వరునికర్పణజేయు చున్నాడో, ఆపురుషుడు దక్షప్రజాపతివలెనె సర్వోత్తమమైన పుణ్య లోకమును పొందుచున్నాడు.

వాశిష్ఠధర్మశాస్త్రే తృతీయోధ్యాయః॥ స్మృతిః॥ అశ్రోత్రియాననువాకా, అనగ్నయః శూద్రధర్మేణభవన్తి, నాసాబ్రాహ్మణోభవతి, మానవంచాత్రముదాహరన్తి ॥ యోనధీత్యద్విజో వేదమన్యత్ర కురుతే శ్రమం సజీవన్నేవశూద్రత్వ మాశుగచ్ఛతిసాన్వయః॥

బ్రహ్మనిష్ఠులుగాక అగ్నిహోత్రములులేక, వేదము జదువక నుంటున్నారో యట్టిబ్రాహ్మణుడు శూద్రప్రాయుడగుచున్నాడు, యిందుకు మనువుచెప్పబడిన శ్లోకముదాహరించబడును, యేవిప్రుడు వేదమునుజదువక నితరవిద్యలయందు పరిశ్రమజేయునో వాడుబ్రతికియూ నసవంశముతోగూడ శీఘ్రముగ శూద్రత్వమును జెందుచున్నాడు. నేను జూచినంతటిలో మద్దగిరితాలూకా కసబాలోనుండు వేల్నాడు కొండావధాన్లువారు నరసన్న మడకశిరాతాలూకా రేకులకుంట అనంతపురంలోనుండు ములికినాడు శేషాద్రిశాస్త్రిలవారు వకరున్నా వేదమును జక్కగాజదివి యున్నవారలు.

"దేవీభాగవతేనవమస్కంధే అష్టమోధ్యాయః"

శ్లో॥ అన్నానాంనియమోనాస్తి యోనీనాంచవిశేషతః।
ఆశ్రమాణాంజ్ఞానాంచసర్వే మేచ్ఛాఃకలాయుగే॥

ఇంక సర్వజనులు కలియుగమందు విశేషముగ అన్ననియమము యోనినియమము ఆశ్రమనియమము లేక మ్లేచ్ఛులగుచున్నారు.

(యిందుకు దృష్టాంతము) 1914 సంవత్సరమున చన్నపట్టణమందు చాతుర్వర్ణములవారు 4000 మంది మహాసభగాజేరి అందులో బ్రాహ్మణులు వైశ్యక్షత్రియ శూద్ర స్త్రీలను వివాహము జేసుకొనవచ్చుననియు క్షత్రియులు వైశ్యశూద్ర స్త్రీలను వివాహము జేసుకొనవచ్చుననియు వైశ్యులు శూద్రస్త్రీని వివాహము జేసుకొనవచ్చుననియు శూద్రుడు శూద్రస్త్రీని మాత్రము వివాహము జేసుకొనవలెనని

యు పెద్దమనుష్యులుచేరి మీాటింగుచేసినారు, యిందుకు చాలామంది తృప్తిలేక యీసభను పునహాయేర్పాటు జేయబోవుచున్నారు.

ఆత్మలాభసుఖంయాన్తత్తపోధ్యానమునీరితం।
శ్రుతిస్మృత్యాదికంధర్మం తద్విరుద్ధంనచాచరేత్॥

స్వలాభసౌఖ్యముకొరకు తపోధ్యానములు విషయములు వచింపబడినను (అందులో ఇచ్ఛానుసరణివచింప బడినవి) అయినను శ్రుతిస్మృత్యాది ప్రతిపాదిత ధర్మములనే చేయవలయును గాని తద్విరుద్ధ ధర్మముల నాచరింపగూడదు.

## మావద్ద సరసముగాదొరకు ఔషధముల జాబితా.

| మాత్రలు | | రు.అ.పై. | భస్మములు. | | రు.అ.పై. |
|---|---|---|---|---|---|
| జ్వరాంకుశం 30మా, గల సీసా 1కి. | | 0-8-0 | శతపుటకృష్ణాభ్రకభస్మం తులం 1కి | | 5-0-0 |
| జ్వరఫణిగరుడం | ... | 0-8-0 | తామ్రభస్మం | ... | 15-0-0 |
| మహాజ్వరాంకుశం | ... | 1-0-0 | వంగభస్మం | ... | 3-0-0 |
| ఆనందభైరవి | ... | 0-8-0 | ప్రవాళభస్మం | ... | 3-0-0 |
| సన్నిపాతభైరవి | ... | 0-8-0 | పటికారభస్మం | ... | 1-0-0 |
| చిత్తానందభైరవి | ... | 0-8-0 | స్వర్ణభస్మం | ... | 30-0-0 |
| రసానందభైరవి | ... | 0-8-0 | రజతభస్మం | ... | 15-0-0 |
| అర్ధనారీశ్వరం | ... | 1-0-0 | త్రివంగభస్మం | ... | 3-0-0 |
| కోడాసుడి | ... | 1-0-0 | నాగభస్మం | ... | 3-0-0 |
| గోరోజనమాత్రలు | ... | 1-0-0 | మైలుతుత్తభస్మం | ... | 1-0-0 |
| కస్తూరిమాత్రలు | ... | 1-0-0 | రసభస్మం | ... | 10-0-0 |
| ఏలాదిమాత్రలు | ... | 0-8-0 | గంధకభస్మం | ... | 5-0-0 |
| హింగుకాదిమాత్రలు | ... | 0-8-0 | శంఖభస్మం | ... | 3-0-0 |
| రసకర్పూరమాత్రలు | ... | 0-8-0 | మనశిలభస్మం | ... | 1-0-0 |
| పుష్పవటీమాత్రలు | ... | 0-8-0 | శిలాజిత్తుభస్మం | ... | 3-0-0 |
| కాలాగ్నిరుద్రభైరవం | ... | -0-0 | గరుడగంధకభస్మం | ... | 5-0-0 |
| బ్రహ్మాస్త్రరసం | ... | 2-0-0 | వెలిగారభస్మం | ... | 1-0-0 |
| పాశుపతాస్త్రరసం | ... | 2-0-0 | తుత్తునాగభస్మం | ... | 3-0-0 |
| అగ్నికుమారకం | ... | 1-0-0 | పంచలోహభస్మం | ... | 3-0-0 |
| తాంబూలమాత్ర | | 0-4-0 | | | |

| | రు.అ.పై. |
|---|---|
| కూలకుఠారభస్మం | . 5-0-0 |
| మేహకుఠారభస్మం | . 5-0-0 |
| **సిందూరములు.** | |
| తామ్రసిందూరం తులం 1కి | ...15-0-0 |
| రససిందూరం ... | .?.10-0-0 |
| అన్నభేదిసిందూరం | ... 3-0-0 |
| ఇంగ్లీకశిందూరం | ... 3-0-0 |
| కుక్కుటాండశిందూరం | ...10-0-0 |
| స్వర్ణశిందూరం | ...30-0-0 |
| రసకర్పూరమూ 6 పలంశీసా 1కి. | 1-0-0 |
| శంఖద్రావకం 3 పలం సీసా 1కి | 1-0-0 |
| మరీచిద్రావకం ... | ... 1-0-0 |
| సోమద్రావకం | ... 1-0-0 |
| కల్లుప్పుద్రావకం | ... 1-0-0 |
| పెట్లుప్పుద్రావకం | ... 1-0-0 |

| | రు.అ.పై. |
|---|---|
| కర్పూరద్రావకం దీనిచే కర్పూరాద్యరిష్టమందురు | ... 1-0-0 |
| పుష్పద్రావకం | ... 2-0-0 |
| **లేహ్యములు** | |
| మరీచిలేహ్యం శేరు 1కి | ... 5-0-0 |
| శొంఠిలేహ్యం ... | ... 5-0-0 |
| పిప్పల్యాదిలేహ్యం | ... 5-0-0 |
| ద్రాక్షాదిలేహ్యం | ... 5-0-0 |
| ఖర్జూరాదిలేహ్యం | ... 5-0-0 |
| మహాబిల్వాదిలేహ్యం | ... 5-0-0 |
| సౌభాగ్యశొంఠి | ... 5-0-0 |
| సమస్తమేహములకు లేహ్యం | ... 8-0-0 |
| చల్దికిలేహ్యం | ... 8-0-0 |
| వీర్యవృద్ధికిలేహ్యం | ...10-0-0 |
| రతిసమయమందు వీర్యము నిల్పుటకు లేహ్యం | .12-0-0 |

స్త్రీలకురుతుకూల తెలసరి అంటుబడకుండుట పుండ్లుపొక్కులు మొదలగు చల్ది వ్యాధులకు యింకా సమస్తమైన రోగములకు మాత్రలు చూర్ణములు రసములు భస్మములు సిందూరములు ద్రావకములు పుష్పాలు నూనెలు లేహ్యములు మొదలగునవి మావద్ద సరసముగాదొరకును రోగి వయస్సు, స్త్రీ, లేకపురుషుడు, ఏజాతుల, పేరు, గ్రామం, పోష్టు విడిఅక్షరములతో వ్యాధియెన్ని దినములుగావుండినది, వ్యాధిగుణములు తెలుపుతూ ఇందుకై 4-లో 1 భాగము అడ్వాన్సుగా మొత్తము పంపవలశినది అట్లు పంపినమందులు పంపబడును పోష్టేజికొనువారె భరించవలయును.

ఆర్డరుపంపి తెప్పించుకొన్న మందు వాపసుపంపిన వెనుకకు తీసుకోబడదు.

వలయువారు యీక్రిందివిలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ఇతర పుస్తకములు ఔషధములు వలయువారు అర్ధణా బిళ్లను పంపిన మాకేట్లాకును పంపబడును.

ఫిడ్లు, తబలా, వైద్యం, జ్యోతిషము, హరికథ, యీవిద్యల నభ్యసించవలెనని యిచ్ఛయుండువారలు, మావద్దకువచ్చి నేర్చుకొనవచ్చును మాయింటియందు అన్నముపెట్టి ధర్మార్థముగా విద్య నేర్పించబడును వ్యాధిగ్రస్తులకు ధర్మార్థముగా వ్యాధిని గుణముచేసి పంప

దయూను తమతమ గ్రామములనుండి ఔషధములు తెప్పించుకొనువారికి మాత్రము దుడ్డు తీసుకొని పంపడమూనుగాని మావద్దనేవచ్చి కొన్నిరోజులు నిలిచి ఔషధములు తీసుకొనువారికి మాత్రము ధర్మార్థముగా చికిత్స చేయడమూను.

ఇట్లు,

పి. వెంకటాద్రి శాస్త్రి,

నేటివుడాక్టర్,

మలుగూరు,

పోస్టు హిందూపూర్.



సర్వమంగళా.

47 పేజి శేషము. పతిని చూచినపుడే సంతోషించును. పతి చూచినప్పుడు తల వంచుకొనును. ఇవతలవతల చూచువ్యాజంబున పతినిచూచును. పతికాలంబునకుఁజాద్యవ యవములను వెల్లడిచేయును. ప్రయత్నపూర్వకముగ మదన సదనమును సిగ్గుచే మూసు కొనును, పతితో నాలింగనచుంబనాది సౌఖ్యములననుభవించును. పతితో యధార్థముగ మాటలాడుచుండును, పతికి శక్యములగు ద్రవ్యముల నేయడుగును, పతిస్వల్పముగనిచ్చినను మిక్కిలి సంతోషమునుపొందును, పతి పంపిన వస్తువుల నత్యాదరముతో గ్రహించును పతి ఆలింగనముచేసినప్పుడు అమృతమును పూసికొన్నట్లెంచును, మగడు నిద్రించినపిదప తాను నిద్రించును, మగడు లేవకమునుపు తానులేచును, పిదప మగనిని తొడతాకినిద్ర లేపును, ఇట్లు చేయునది పతివ్రత యనబడును, కావున స్త్రీ లిట్టి గుణములుగలిగి పతుల యందను రాగముతో వర్తించవలయు.

సకృదపికులటాభి స్స్వైరిణీ భిక్షుకీభి స్సహవిటఘటితాభి స్సంస్పృశేన్నైవ నార్యః । రుచిరసుపదమమ్మై పథ్యమేనంచవేత్తి ప్రతిదినమపిభర్తుర్భో జనేచ్ఛాంప్రసిద్యాత్ ।

వ్యభిచారి స్త్రీలతోడను, మంత్రవాదినులతోడను, బిచ్చపువాండ్రతోడను, నట విటులతో జేరియుండు స్త్రీలతోడను సహవాససంభాషణాదుల జేయదగదు ప్రతిదిన మును తనభర్తయొక్క అభిప్రాయమెరింగి రుచికర పదార్థముల వండవలయు.

క్వచిదపి నిభృతే వాద్వారి నా నైవతిష్ఠే చ్చిరమథగిరమస్మై విప్రయా నప్రయచ్ఛేత్ । సవిరళజనదేశే మంత్రయేన్నిష్కుటే వా పురుష మపిపవిత్రస్త్వన్యమత్రాపివినా వ ।

• పతివ్రతయగు స్త్రీ, నిర్జన ప్రదేశమందుగాని తలవాకిటగాని యెప్పుడైనను నిలువ గూడదు, భర్తకిష్టముగాని మాటలనెప్పుడును బలుకగూడదు, జనములేనిచోటగాని ఇంటి పెరటి తోటలయందుగాని అన్య పురుషులతో సంభాషింపగూడదు, ఒక ఆలోచనలేనిది స్వపురుషునితోగూడ పలుమారు మాటలాడుట పలుమారు చూచుట కూడదు.

అనుమతిముపలభ్యాధీష్టితాస్స్వత్రయాయాచ్ఛయసమనువిదద్యాద్భర్తుసద్మాన్యమత్రే । గతపతిరయితేతుక్వాపి మాంగల్య మాత్రాణ్యుపచితగురువిప్రాధారయేన్మండనాని ॥

పతివ్రతయైన స్త్రీవివాహాయజ్ఞ గోష్ఠి దేవోత్సవాదుల కెచ్చటికైనపోవలసినప్పుడు మగని యాజ్ఞనుపొంది పదిరాలు మొదలగు పతిబాంధవులతో గూడినదై పోవలయు,

మగడు శయనించిన పిదప తాను శయనించి మగనికంటె ముందుగ తాను లేవవలయును, భర్తదేశాంతరమునకు పోయియున్నపుడు మాంగల్యముతప్ప తక్కిన యాభరణముల ధరించక గురువులు బ్రాహ్మణులు వీరియందు భక్తిగలిగియుండవలయు. 17 పేజి శేషము.

చతుర్థేహ్ని తతస్స్నాత్వా శుక్లమాల్యాంబరాశుచిః । ఇచ్ఛంతీ భర్తృసదృశం పుత్రంపశ్యేత్పురఃపతిం ॥ పూర్వంపశ్యేద్యతుస్నాతాయాదృశం నరమంగనా । తాదృశంజనయేత్పుత్రం భర్తారందర్శయేదతః ॥

పిమ్మట నాలుగవ దినమున స్నానముచేసి తెల్లని వస్త్రములను పుష్పములను ధరించి శుచిర్భూతురాలై పతి సమానుడగు పుత్రుని గోరుచున్నదై ముందుగ భర్తను చూడవలయు, ఏలననగా స్నానము చేసినతోడనే ముందుగ నెట్టి పురుషుని జూచునో వాని వంటి పుత్రుని కనును కాబట్టి ముందుగా పతినే చూచునది.

ఋతుస్తుద్వాదశనిశాః పూర్వాస్తిస్రశ్చనిందితాః । ఏకాదశీచ యుగ్మాసు స్యాత్పుత్రోన్యాసు కన్యకా ॥

స్త్రీలకు ఋతువయినది మొదలు ౧౨ దినములవరకు ఆర్తవము కనపడుచుండుట వలన నది ఋతుకాలమనబడును వానిలో మొదటి మూడుదినములు. ఏకాదశి ఇవి నిందితములు, సరిదినముల యందు గూడిన పుత్రుడును బేసి దినములయందు గూడిన కన్యకయు జనించును.

ఊనద్వాదశవర్షాయా మప్రాప్తః పంచవింశతిం । యద్యాధత్తే పుమాన్గర్భంకుక్షిస్థస్సవిపద్యతే ॥ జాతోవానచిరంజీవేజ్జీవేద్వాదుర్బలేంద్రియః । తస్మాదత్యంతబాలాయాంగర్భాధానంనకారయేత్ ।

౧౨ ఏండ్లకు లోబడిన స్త్రీయందు ౨౫ సంవత్సరములకులోబడిన పురుషుడు గర్భాధానముచేసిన యాగర్భము కుక్షియందే ఆపదనొంది స్రవించును, ఒకవేళ గర్భము నిలిచి శిశువు జనించినను బహుకాలము జీవించదు, జీవించినను ఇంద్రియపటుత్వ లేకుండును, కావున మిక్కిలి బాల్యముగల స్త్రీయందు గర్భాధానము చేయగూడదు.

సాంత్వయిత్వా తతోన్యోన్యం సంవిశేతాం ముదాన్వితౌ । ఉత్తానాతన్వనారీయోషిత్తిష్ఠేదంగైస్సుసంస్థితైః । తథాహి బీజంగృహ్ణాతి దోషైస్స్వస్థానమాస్థితైః ॥

స్త్రీ పురుషులు లొకరినొకరు ప్రియవాక్యములచే నూరడించుకొని సంతోషయుక్తులై పరుండవలయు స్త్రీ భర్తయందే మనస్సుగలదై బాగుగ నుంచబడిన

గలదై వెల్లకిల బరుండవలయును, అట్లగుటచే స్వపాన స్థితవాతాదిదోషములచే బీజమును గ్రహించును కావున స్త్రీ రతి కాలమునందు కామాతి రేకముచేనుపరతి మొదలగు క్రీడా భేదములతోను పురుషాయిత బంధములతోను రమించుట సత్సంతానము గోరువారికి దగదు.

యోభార్యాయాం ఋతౌమోహాదంగనేవ ప్రవర్తతే తతఃస్త్రీ చేష్టితాకారోజాయతేషండసంజ్ఞికః ॥ ఋతౌపురుషవద్వాపి ప్రవర్తేతాంగనాయది । తత్రకన్యాయదిభవేత్ సాభవేన్నరచేష్టితా ॥

పురుషుడు తనభార్యయందు ఋతుకాలమున మోహావిష్టుడై యుపరతియొనర్చిన స్త్రీయొక్క చేష్టలు ఆకారముగల వీర్యరహితుడగు పుత్రుడుకలుగును, వీడు షండుడన బడును స్త్రీ తనపురుషునితో ఋతుకాలమందు నుపరతిని సల్పుటచే కన్యకజనించిన పురుషచేష్టలు కలిగియుండును, అనగా పురుషునివలె స్వతంత్రముగ వ్యవహరించునది యు కామకాంతినొందక చర్మమయలింగ ధారిణులగు స్త్రీలతో సంభోగముచేయునది యు ననియెరుంగవలయు, ఇందుకు నిదర్శనముగా జ్యోతిశ్శాస్త్రమునందు జన్మకాలగ్రహ సంపత్తినిబట్టి స్త్రీలకిట్టి స్వభావము గలుగునని చెప్పబడియున్నది ॥ శ్లో॥ శుక్రాసితౌ యది పరస్పరభాగసంస్థౌ శుక్రేచ దృష్టిపథగౌ వుదయే ఘటాంశః । స్త్రీణామతీవ మదనాగ్ని మదప్రవృద్ధి స్త్రీభి స్సమంచ పురుషాకృతి భీరమేచ్చ ॥

స్త్రీ పురుషులు కలసినప్పుడు ముందుగా పురుషుడు శుక్రమునువిడచిన శూరుడును బలవంతుడను ధైర్యవంతుడునగు కొమరుడుగలుగును, ముందుగా స్త్రీ ఆర్తవముతోవిడచిన రూపవతియగు కొమార్తెయుకలుగును, కావుననే కొన్ని పురుషగర్భములు తల్లిపోలిక గలవిగను కొన్ని స్త్రీ గర్భములు తండ్రిపోలిక గలవిగనుండును.

బాలుని బెదరించినను అకస్మాతుగ నిద్రలేపినను భయపడును తటాలున లేవనెత్తి నను మీదికెగరవేసినను శిశువునకు వాతాది దోషములుచేయును కూర్చుంపబెట్టినయెడల మురుగుజ్జు తనముకలుగును కావున నిట్టిపనులను బాలునిమేలు గోరువారు చేయకూడదు,

ప్రసవించిన స్త్రీకి చనుబాలు కొరత అయినయెడల రోగములేనిది ముసలితనము బాల్యము లేక మధ్య యవ్వనముగలది మిక్కిలి పొడుగు పొట్టి లావు సన్నముగాక సమా నముగనుండునది మంచిగుణములుగలది ఆశలేనిది బిడ్డలుకలది ప్రేలాడు పెదవులులేనిది ప్రేలాడక వూర్ధ్వగతములుగాక సమానముగ నుండెడి చన్నులుగలది వికృతాంగములు వ్యసనములేనిది ప్రేమకలదియునగు, దాదిని బాలుని ఆరోగ్యముకొరకు యేర్పరచవలయు, అట్టి ఊర్ధ్వస్తని అయినయెడల బాలునిముఖమునకు వక్రతకలుగును ప్రేలాడు కుచములు

అయినయెడల బిడ్డయొక్క ముక్కు మొగము కప్పబడి శ్వాసనిరోధముకలిగి తత్కాలము గ శిశు ప్రాణాపాయమునకు హేతువగును గాన సమానస్తనితో శిశువునకు పాలు యిప్పింపవలయును.

శిశువునకు ఏయంగమునందు బాధయుండునో ఆయంగమును మాటిమాటికి తాకుచు యితరులాయంగమును దాకిన నేడ్చును శిరమునందు రోగము కలిగినయెడల కన్నులు మూసుకొనును తలవంచుకొనును పొత్తికడుపునందు గలిగిన మూత్రమురాక బాధకలుగును మరియు దప్పిమూర్ఛకలుగును లోకడుపునందు బాధకలిగినయెడల మలమూత్రములు రాకుండును దేహకాంతిచెడును వాంతి కడుపుపొంగు పేగులు అరచుటయు కలుగును, విశేషముగ నేడ్చుచుండిన శరీరమంతట బాధయని తెలుసుకొనునది.

నేను చెప్పియుండు విషయములన్నియు స్త్రీలు, పురుషులు, గమనించి ప్రవర్తించవలెను అట్లు ప్రవర్తించిన యిహపరసాధకంబగుననుటకు యింతమాత్రము సందియంబులేదు.

మంగళమహా శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీంకేయును

సంపూర్ణము.



